శ్రీ కుసుమహరనాథాయ నమః

# శ్రీహరనాథావతారము

జై హరనాథ



కుసుమకుమారి జై

...RABHU HARANATH.

గ్రంథకర్త,

ఠాకూర్ దాస్.

సంపాదకులు—ప్రకాశకులు,

శ్రీ కుసుమహరనాథ కేంద్రసంఘము, ఖడ్గపురము.

# విజ్ఞాపన.



భక్త సోదరులారా!

ప్రణామములు. ఆంధ్రదేశమున నేడు లక్షలకొలది జీవులు పరమ కరుణానిధియగు, ప్రభుహరనాథుని దివ్య చరణముల నాశ్రయించుకొనియున్నారు. ప్రభుహరనాథుని దివ్య చరిత్రామృతమును గ్రోలవలయునని, ఎందరెందరో తపించుచున్నారు. అట్టి వారిని తృప్తిపరచుటకై, పటములు, లాకెట్లు మున్నగునవి ప్రచురించి, నిరుపేదలకుకూడ అందుబాటులో నుండునట్లు, సాధ్యమైనంత స్వల్ప ధరలలో, అందజేయుచు సేవజేయవలెననియు, క్రమ క్రమముగా ఆంగ్లభాషలో శ్రీనాథ జీవిత గ్రంథములను, పత్రికలను, ప్రచురించుటకును, నిశ్చయించుకొని, శ్రీ కుసుమహరనాథ కేంద్రసంఘమును, ఖర్గపురమునందు స్థాపించితిమి. ఎట్టి ప్రతిఫలాపేక్షయున్ను లేక, విశేషమగు త్యాగమును చూపుచు యీ కేంద్రసంఘ కార్యక్రమమును కొనసాగింప సమకట్టిన వివిధ భక్త సోదరులకు మా కృతజ్ఞతను తెలియబరచుచు, వారి కెల్ల వేళలయందును జయము కలుగుగాకయని, శ్రీ కుసుమహరనాథుని, దీనముగా ప్రార్థించుచున్నాము.

సాధక మహాశయులారా! మీ ప్రేమ భిక్షకై సదా వేచుకొని యున్న మమ్ములను గ్రహింపుడని వేడుకొనుచున్నాము.

ఇట్లు,

శ్రీ కుసుమహరనాథ కేంద్రసంఘము,

ఖర్గపురము.

# విషయసూచిక.







జయ శ్రీ కుసుమహరనాథ్.

"కుసుమకుమారీ సేవిత చరణమ్
మరతను గుప్తాసుర మహిమానమ్
సంతత కృష్ణకథారస తత్త్వమ్
తం ప్రణమామి శ్రీహరనాథమ్"

# అవతారిక.



'సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్
సభూమిం విశ్వతో వృత్త్వాఽత్యతిష్ఠద్దశాంగులమ్'

అను మంత్రార్థము—

"ఇందుగల డందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలడు"

అను భాగవత వచనమునందు సంపూర్ణముగ ప్రతిబింబించి సర్వమానవుల హృదయగోళములందును నిండియున్నది.

'అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపిసన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభావామ్యాత్మ మాయయా'

అను గీతా వచనము ననుసరించి సర్వవ్యాపి యగు సర్వేశ్వరుడు సాధు పరిత్రాణాదికము ప్రయోజనముగా భూమిని యుగ యుగంబుల నవతరించు చుండునని ప్రాజ్ఞులు విశ్వసించు చున్నారు. అట్లే మత్స్య కూర్మాది దశావతారములు ప్రవర్తిల్లునని మన నమ్మకము.

'గురుపాక్షీసమన్వై - జలగ్రహామన్వై - క్రోదంబన్వై' అను సువిశాల మహోన్నత భావనచే జంతుజాలము నందును భగవదవతార లీలను సందర్శించిన మన తత్త్వవేత్తల జ్ఞానధన్యత ప్రశంసనీయము. మహావిష్ణుని దశావతారములు సుప్రసిద్ధములై యున్నను శ్రీమద్భాగవతము భగవంతుని ననంతకోట్యవతారధారిగా వాకొనుచున్నది. రథము నడుపు చక్రరక్షకుడు రథమునందే యుండునట్లు, విశ్వమును ప్రవర్తింపజేయు విశ్వేశ్వరుడు విశ్వమునందే యున్నట్లు తద్జ్ఞులు భావింతురు.

సదాశివునకు పసుపతియనియు, శ్రీకృష్ణునకు గోపాలుడనియు నామాంతరములు. జీవులు, పశువులు; భగవంతుడు తద్రక్షకుడు. గోగణము గోపకుడు లేక యుండజాలదు. గోపాలకు డొక్కొక్కయెడ దాను ముందు నడచుచు గోవుల నడిపించును; ఒక్కొక్కయెడ వెనుక నుండి ప్రేరేపించుచు ముందుకు తోలుచుండును; ఒక్కొక్కయెడ నాలమంద యుండవలసినచోట నుండవలసినట్లుండు నప్పుడు తానే చెట్టుక్రిందనో, గట్టుమీదనో కూర్చుండును. అమందయించుక అమార్గమునబడెనా తానామందలోనికి వచ్చి దానిని సరియైన మార్గమునకు ద్రిప్పును. భగవదవతారతత్త్వ నీవిధమేయగును. మందలోని పశువులనేకములు తద్రక్షకుని తెలిసికొనజాలవు; కొన్ని పోలికపట్టును; కొన్ని యెదురుగా నున్నప్పుడు 'చెఱుపుమఱుపు'గా తెలుసుకొని తాను పరోక్షముననో, దూరముననో యుండునపుడు ఆ తలంపే లేకుండును. జీవుల స్థితిగతులు నిట్టివే, జీవి గమనించినను గమనింపకున్నను భగవంతుడు సర్వదాసన్నిహితుడై యున్నాడనుట నిర్వివాదాంశము.

'యదా యదాహి ధర్మస్యగ్లా నిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానాం సృజామ్యహమ్'

అనునట్లు ధర్మగ్లాని వాటిల్లునపుడు భగవంతుడు భూమిపై నవతరించుచునే యున్నాడు. రామ కృష్ణాదు లిట్టి యవతారములే యని జ్ఞానులు గుర్తించియున్నారు.

అనంతములగు నవతార ములలో రామకృష్ణావతారములు సంపూర్ణములు. లీలామానుష విగ్రహుడగు శ్రీకృష్ణుడు ద్వాపరాంతమున 126 వత్సరములు లీలలు నెఱపి భౌతికశరీరమును వదలినను కలియుగమ్మున మరల మరల దానే యనేకరూపమ్ముల బొడగట్టుచున్నాడు. చైతన్యస్వామి, శ్రీ కృష్ణభగవానుని యింకొకభూమిక యనునది భక్తలోకమునకు విదితమే. శ్రీ కృష్ణచైతన్యుల యవతారమే శ్రీ కుసుమహరనాథదేవుడని నేటిలోకము స్వానుభవమున దెలిసికొనుచున్నది.

అవతారములు భగవదంశాపరిణతములేయైనను దేశ కాల పరిస్థితులంబట్టి తత్తత్ ప్రయోజనములను భిన్న భిన్నములై కన్పట్టును. పరశురామావతారమున క్షత్రియోన్మూలమునకై యేర్పడిన శక్తి రామావతారమున క్షత్రియ ధర్మస్థాపనకై విలసిల్లినది. అట్లే శ్రీ కృష్ణావతారమున దుష్ట వినాశనమునకై వినియోగపడిన శక్తి శ్రీకుసుమహరనాథావతారమున దుష్టపరివర్తనమునకై యుద్యమించుచున్నది. అందు ధర్మ సంస్థాపనము ప్రధాన ప్రయోజనమైన నిందు ప్రేమ సంస్థాపనమే పరమార్థము. తక్కిన విషయములలో శ్రీ కృష్ణ హరనాథావతారములు రెండును సమానముగా నభయ ప్రదములు. "యేయథామాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్" అను ప్రతిజ్ఞ యిర్వురిపట్ల సమానముగానే వర్తించును. కాని యిందు విశేష మేమన అవసర మెఱింగి కోరిన ననుగ్రహించువాడు శ్రీ కృష్ణుడు; కోరకయే అవసరమెఱింగి యనుగ్రహించువాడు శ్రీహరనాథుడు.

"చెలినై చుట్టమునై యమాత్యుడవునై" అను పలుకు శ్రీ కృష్ణునకు పాండవులపట్ల సత్యము; శ్రీహరనాథునకు తన్ను స్మరించు ప్రతిప్రాణిపట్లను యదార్థమే.

"మద్భక్తాయత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద" అని శ్రీ కృష్ణ భగవానులు సెలవిచ్చి యున్నారు. తన్నెచ్చట దలంచుకొన్న తానచ్చట నుండుట ప్రభుహరనాథుని ప్రతిన. తన పటమున్న చోట దానుండునట! ఇది భక్తులందఱకు వేయివిధముల దెలిసిన విషయమే! ఇంతకంటెను విచిత్రమగు విషయమేమన-తన దివ్యమంగళ విగ్రహము పటమునందైన జూచియుండక - తన పవిత్రనామమును వ్యవహార వశముననైన వినియుండక - విన్నను గన్నను మీదుమిక్కిలి విశ్వాసములేక- "అయం విశేషః" అని దుష్ప్రవృత్తికూడ గల్గి లోకకంటకులై యుండువారి ననేకులను దనకుదానై సమీపించి, వారి మనః ప్రవృత్తుల మార్చి సన్మార్గవర్తుల జేయుచున్నాడు.

ఇది శ్రీహరనాథుని నిర్వ్యాజ కరుణా విశేషమును, పతితపావనత్వమును సహస్రముఖముల బ్రకటించు చున్నదిగదా! "భావ నామాత్ర సంతుష్టహృదయః పరమేశ్వరః" అనుటకు పై మెట్టిది! సాధారణముగా నన్యదైవతముల విషయములలో మర్కటకిశోరన్యాయమున భక్తుడుపాస్య దైవతము నాశ్రయించుకొని యుండును; కాని యీ యెడ మార్జాలకిశోరన్యాయమున శ్రీ హరనాథుడే భక్తుని పట్టుకొని యుండును- కాన నిది కేవలము ప్రమాద రహితమైనది.

నేడు ప్రభుహరనాథుడు దినదినమును వేలకువేలు జనుల నాకర్షించుచుండుట తన నామమాధుర్యముచే నొకవంతును తన దివ్య లీలలచే మూడువంతులును. ఆదియుగమ్ములు విశ్వాసవంతములగుట శ్రీరామచంద్రుడెన్నో లీలలుజూప నవసరము లేకుండెను. మధ్యమ యుగములో విశ్వాసము కొంతతగ్గుటచే శ్రీ కృష్ణభగవాను డనేక

లీలలు బ్రదర్శించెను. అయిన నదియు ననేకులకు జ్ఞానప్రదము కాదయ్యెను. కౌరవసభలో శ్రీ కృష్ణుని విశ్వరూపప్రదర్శన మేకొలది పాటి యోగీశ్వరులకుతప్ప తక్కిన దుర్యోధనాదులకెల్ల నింద్రజాల మాత్రమేకదా యైనది! నేడు లోకము కేవలముగా భగవద్విశ్వాస హీనమైనది. కాన లోకుల హృదయముల నిద్దుష్టముల నొనర్చి సన్మార్గోన్ముఖ మొనర్చుటకు ప్రభువనేక లీలల బ్రత్యేకవ్యక్తులకునై నందిన చర్యలలోగూడ జూపుచున్నాడు. ప్రకృతికంటె పరుండగు ప్రభువునకే యిట్టిలీలలు చెల్లును.

"అద్భుతా నీహయావంతి భూమహా వియతివా జలే
త్వయి విశ్వాత్మకే తానికిం మేదృష్టం విపశ్చతః"

శ్రీ మద్భాగవతము.

అని శ్రీ కృష్ణునిగూర్చి యక్రూరు డొనర్చిన స్తవ మెంతవాస్తవము !

ఇట్టిలీలచే సమాకర్షించిన జీవిని తనయందు శాశ్వతముగ బంధించువిధానము మరియు విచిత్రముగా నున్నది. కృతయుగమున తరించుటకు జ్ఞానమును తన్మూలమగు తపస్సును ప్రధానములై యుండెను. త్రేతాయుగమ్మున కర్మయును తదూపములగు యజ్ఞాదులును నియమితములయ్యెను. ద్వాపరమున నంతకంటెను సులభతరంబగు భక్తి ప్రశంసింపబడెను. 'కలౌ స్మరణాన్ముక్తిః' అనుటచే నేడు తరుణోపాయమిచ్ఛామాత్రమున నే లభించుచున్నది. గడచినయుగములలోని భక్తిసంభారము నేడు మనకు లభించునదిగాదు. కావున ప్రభువు నేడు జీవులను ప్రేమసూత్రమున బంధించుచున్నాడు. ఈ విశ్వప్రేమ భక్తికంటెను, ముక్తికంటెను గూడ నధికతరమైనది. నామస్మరణ మాత్రమున ప్రభువే యీ ప్రేమవిధానమును మన కనుగ్రహించును. అప్పుడు లోకములో మనకు ద్వేషపదార్థ మొక్కటియు నుండదు. ఆకారణమున కామక్రోధాదులకు తావేగలుగదు. దానమనశ్శాంతి

మానసౌమ్మగును. దుఃఖము సమూలముగా నశించును. లోకమానంద నిలయమగును. జీవితము బృందావనమగును.

ఈ భగవత్ప్రసాదము సర్వజీవి సామాన్యమైనది. ఇందు జాతి మత విభేదములు లేవు. స్త్రీపురుష వివక్షలు లేవు. బాల యువ వృద్ధ విభాగములులేవు. సూర్యాతపమ్మను చంద్రికాంతియు బోలె నిదియు నెల్లర సొత్తేయగును. ఇందు మంత్రతంత్రములు సంగన్యాస కర న్యాసములు, శారీరకసాధనలు, నేవియులేవు. 'కుసుమహార' నామమే సర్వమును. 'మడి-మైల' యను భేదభావము లేదు. భగవత్ప్రసాదితమై శరీరము నిత్యపవిత్రమైనది. 'యన్నామ శ్రుతిమాత్రేణ పుమాన్ భవతి నిర్మలః' ఇందు గురువని యొకడులేడు. తండ్రి బిడ్డలకు నడుమ నొక ద్విభాషిగాని లగ్నకుడుగాని యేలయుండవలయును?

"అనన్యాశ్చింత యంతోమాం యేజనాః పర్యుపాసతే తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" అని భగవంతు డభయమిచ్చియే యున్నాడు.

ఇదియే సర్వమత సమ్మతమగు విశ్వజనీనమతము. ఈ నాటికీ యమృతభాండము భూలోకమున నవతరించినది. దీనిని సేవింపగల్గు పూజ్యులు ధన్యజీవనులు. అట్టివారి శ్రీ చరణధూళి నిరంతరము నే శిరసావహింతును.

"ప్రభు స్మరనాథో విజయతే."

విజయనగరము,
ధాతు. ఉగాది.

విశ్వనాథకవిరాజు.
27_3_36.



శ్రీ రాధాకృష్ణావతారమూర్తియగు

# శ్రీ కుసుమ హరనాథ మహాప్రభువు.



"ఆమె నాయందున్నది. నేనామెయందున్నాను. మా యిరువురకు భిన్నత్వములేదు"

శ్రీ కుసుమహరనాథ్.

శ్రీ కుసుమ హరనాథాయనమః.

# శ్రీహరనాథావతారము

## 1 అ ధ్యా య ము.

## శ్రీ హ ర నా థు డె వ రు?



పాఠకమహాశయులారా, మహాప్రభువు తన మాయామానుష విగ్రహమును దాల్చి "హరనాథ" అను నామముతో పిలువబడుచు, యీ ప్రపంచమున తన వివిధ భక్తులతో క్రీడించు దినములలో అనేకు లాతని దివ్యచరిత్రను వ్రాయఁబూనిరి. అత్యద్భుతమగు నతని మాయామానుష మహిమల నెన్నింటినో కండ్లారఁజూచి అనేకవిధ ములుగా నాతని భగవత్తత్వమును గొనియాడుచుండిరి. ఆయన పూర్ణుడు. అఖండమగు ప్రేమ, శక్తి, జ్ఞానము, మున్నగు లక్షణాదులను కలిగిన పరమపురుషుడు. ఆతని జీవితము నొక సాగరమునకు పోల్చి నచో నొక్కొక్కభక్తున కొక్కొక్కయంశము మాత్రమే గోచరిం చుచుండెడిది. ఎవరి గ్రహణశక్తి యెంతవఱకుండెడిదో, అంతవఱకే యాతనిని తెలుసుకొనసాధ్యమయ్యెడిది. ఈవిషయము సర్వసమ్మత మైనది.

ఈయధ్యాయమును మూడు భాగములుగ విభజించనైనది.

(1) శ్రీ హరనాథుని ఆంతరంగిక భక్తుల యభిప్రాయములు.

(2) వివిధమతసాంప్రదాయములకు చెందిన భక్తులాతనికి వ్రాసిన జాబులు.

(3) శ్రీహరనాథుడు, తన స్వరూపలక్షణాదులను తెలియజేయుచు పల్కిన కొన్ని మహావాక్యములు.

శ్రీహరనాథుని జీవిత మంతయు భగవత్కళా పరిపూర్ణమైయుండెను. ఒక్కొక్కలీలను గ్రహించినచో నొక్కొక్క కళాంశము గ్రాహ్యమగుచుండును. ఆతనిమహోత్కృష్ట జీవితమునంతయును పూర్తిగా మనము తెలుసుకొనునంతవఱకును శ్రీహరనాథ యవతార తత్త్వమును గ్రహింపగల్గుట దుస్సాధ్యమే యగును.

## 1. ఆంతరంగిక భక్తుల యభిప్రాయములు.

### కవిరాజ్ ప్రభాతచంద్రసేన్‌గారు (కలకత్తా).

"శ్రీహరనాథుని సమక్షమున నేననేకవత్సరములుంటిని. ఐనను ఆతడేనిముషమున, నేరూపముతో, మఱెచ్చట పని చేయుచుండెనో గ్రహింపజాలకుంటిని. ఇతర ప్రదేశములనుండి, చిత్రవిచిత్రములుగా నాసహోదర భక్తులెందరో శ్రీవారికి జాబులు వ్రాయుచుండిరి. వాటిని పరీక్షింపగా "నావద్దనున్న హరనాథుని శరీరమే మాయామానుష విగ్రహమా? లేక, యితర ప్రదేశములయం దిప్పుడు క్రీడించుచున్న రూపములా!" యను శంక నాకేకాక నాబోటివా రనేకులకు కలుగుచుండెడిది. ఈహేతువుచేతనే శ్రీహరనాథుని చరిత్రను వ్రాయుట కెవరికిని సాధ్యము కాకుండెడిది. గాని ఆతడొక్కరూపమునే దాల్చి తనభక్తులకుం గాన్పించుచు, వారిని రక్షించుచుండినయెడల ఆమహామహుని చరిత్రమును వ్రాయ సాహసించుటకు కొంతవరకు సాధ్యముగా నుండెడిది. వైద్యనాథ ముఖర్జీరూపమున రాధావల్లభసీల్ అను భక్తునకు దర్శన మిచ్చెను! జగ్‌మోహన్‌దాసు రూపమున నిత్యనిరంజనసేనునకు దర్శన మిచ్చెను! ముప్వురు కాంతలరూపమున విమలాదేవికి సాక్షాత్కరించి, ఆమెను కొన్ని కష్టములనుండి కాపాడెను! ఒక గువ్వరూపమున

బొంబాయిలో నున్న శాంతకీగారి సోదరునకు కాన్పించెను!! మరియు ననేకుల గృహములలో నేడు పూజింపఁబడుచున్న శిలావిగ్రహములుగ నాతడు మాఱిపోయెను!!! ఇంకను సూక్ష్మశరీరధారులైన వారలెందఱో, మావలెనే సదా ప్రభువుసమక్షమున నుండుట జరుగుచుండెననుట కెన్నియో తార్కాణములున్నవి. కావుననే, ఒకేప్రదేశమునగాని, యొకేరూపమునగాని, యొకేలోకమునగాని శ్రీహరనాథుఁడే క్షణమందైనను ఉండడములేదను సిద్ధాంతము ఋజువు కాబడుచున్నదిగదా! ఈకారణములచే శ్రీహరనాథుని దివ్యచరిత్రమును పూర్తిగ చిత్రించుట దుస్సాధ్యమేయగును. ఎవరైనను వ్రాయబూనినను, నిజమగుచరిత్ర విషయములలో, సహస్రాంశమైనను వర్ణింపజాలరు. శ్రీహరనాథుడు, మనకన్నులయెదుట నిజముగా ప్రదర్శించిన లీల లసంఖ్యాకములు. అయినను మనకు తెలిసినవి కొన్ని వేలు మాత్రమేగలవు. ఆయన ప్రదర్శించిన లీలలును, పలికినపలుకు లన్నియును, సముదాయముగా గమనించిననుగూడ, అనంతమగునాతని భగవత్తత్త్వమునందలి యొక అంశమైనను పూర్తిగా గ్రహింపజాలమని రూఢిగానమ్మెడి. శ్రీహరనాథుడు సర్వమతములవారితోడను క్రీడించెను. "ఈమతమునాది, ఈకులమునాది, నేను జమీందారుడను, నేను పురుషుడను" అను సంకుచితభావములెవ్వియు, ఆతని సమక్షమున నెవ్వారికిని యంకురింపకుండెను. ఇదియే ఆతని భగవల్లీల! ఆతనిభగవచ్ఛక్తి! వివిధమతములవారు, వివిధదేశములవారు, వివిధశాఖలవారు, స్త్రీలు, పురుషులు, జమిందారులు, దరిద్రులు, అందఱును, తమ తమ శరీరములను, ఆత్మలను పూర్తిగామరచి, భగవత్ప్రేమానందసాగరమున మగ్నులై, యొక్కొక్కప్పు డొకరి విస్తరియందలి ప్రసాదము నింకొకరు బలాత్కారముగ తీసుకొని భుజించుటయు, యొకరిపాదతలంబున నింకొకరు శిరంబునుమోపుటయు, పర

స్పరము కౌగలించుకొని ప్రేమావేశముచే, వెక్కి వెక్కి యేడ్పుటయును మున్నగు చేష్టల నప్రయత్నముగ జూపుచుండిరి. జిల్లా పోలీస్ సూప రింటెండెంటుగానున్న కర్టిస్ దొరగారు, తమ యుద్యోగమును, స్టీవిని, మతమును, దేశమునుగూడ మఱచి, యవాచ్యమగు నొక ప్రేమభావ ముచే నేడ్చుచు, నేలపైజతికిలబడి శ్రీహరనాథునివైపు జూచుచుండిరి. ఎట్టి పాషాణహృదయమైనను శ్రీహరనాథుని సంకల్ప మాత్రముననే ద్రవీభూతమై, ప్రేమపూరితమై, నవనీతమువలె మృదుత్వము నొందు చుండెను. ఇట్టి మార్పు తాత్కాలిముగగాక శాశ్వతముగ నుండెడిది. ఇదియే శ్రీహరనాథుని యమానుష్యమగు నత్యద్భుతమగు మహిమ. శ్రీహరనాథునికృపచే, నెందఱెందరో మహాపాపులు, విమోచన మునుఁ బడసి శ్రీహరనామము నిప్పటికిని జపించుచున్నారు.

శ్రీహరనాథుని యమృతమహా వాక్యములలోనొకటి వినుడి, “నాప్రియులారా! భగవానుని సందర్శించుటకు మీకు ముఖ్యముగా కావలసినవి యోగాసనములుగావు, మతాభిమానముగాదు, ఆలయ ములుకావు, నదీస్నానతీర్థ సేవలునుగావు, యజ్ఞోపవీతవిసర్జనము గావించి సన్యాసమును స్వీకరించుటయునుగాదు, మతచిహ్నములగు బొట్టు, కట్టు, జుట్టు, విభూదిధారణము, ఆభరణములు గావు, గ్రంథ పారాయణమకూడగాదు—విశ్వప్రేమ.

ఇతరుల యోగ్యతా యోగ్యతలతోడను, మతముతోడను, కుల ముతోడను, యెట్టిసంపర్కమునులేక, వారిసివారికొరకే, వారిని భగ వానునికొరకే గాఢముగా ప్రేమించుదివ్యశక్తి ఏక్షణమున కలుగునో ప్రపంచమును మీరెప్పుడు ప్రేమింపగలరో, ఆనాఁడు క్రూరభుజంగ ములును, వృక్షశిలాదులును మిమ్ముప్రేమించుచుండుట, మీకండ్లతో మీరే జూచెదరు. విశ్వమంతయును ప్రేమింపగల్గినప్పుడే విశ్వప్రియుఁ

డగు భగవానుని నీవు ప్రేమింపగలవు; సందర్శింపగలవు. ఆతడిప్పుడు మీ యొద్దనే యున్నాడు. మీ హృదయము నాక్రమించుటకు సిద్ధముగ నున్నాడు. విశ్వమునంతటిని నిముడ్చగలుగువిశాలత మీ హృదయమున సిద్ధించినపుడే ఆతనిని లోగొనుటకు వీలగును. మీ హృదయద్వారములను తెఱచి, ఆతని నొక్కసారి మీ హృదయ మందిరముల కాహ్వానింపుడి. ఎట్టి ప్రేమానందము, ఎట్టియద్భుతపరంపరలు, ఎట్టియమానుష శక్తులు మీకు గోచరించునో చూడుడి. మీ హృదయమెంత విశాలతనొందు చుండునో యంత సమీపముగ మీరు భగవానుని కడకుచేరు చున్నారని గ్రహింపుడి. నివృత్తిమార్గ ప్రయాణికుల గమన వేగమున కిదియే శోధన.

ఇట్టి యమూల్యమగు విశ్వప్రేమను బడయుటకై, శ్రీహరనాథు డెట్టి నిబంధనలు కాని యెట్టిరహస్య మంత్రములుగాని, యెట్టి యోగాసనములుగాని నియమించలేదు. ఈవిషయమున నాతనియమృత వాక్యముల నాకర్ణింపుడి.

(1) భగవానుని చేరుటలో నెట్టి రహస్యపద్ధతులును లేవు. మీ యిష్టమువచ్చిన భాషలో, మీ యిష్టమువచ్చిన నామముతో, నెట్టి స్థల కాలాది నియమములను పాటింపక భగవానుని సదా స్మరింపుడి.

(2) మీ దిక్కులేని కనిష్టపుత్రునిగ నన్ను భావింపుడి. నేను మీ స్వంత బిడ్డననియే తలచుడి. నన్నే మియును కోరకుడి. నాతల్లి దండ్రులగు మీ కెప్పటి కేది యవసరమని నాకు దోచునో, దానిని మీరు కోరకుండినను పరిసాదించితీరెదనని ప్రతిజ్ఞ

చేయుచున్నాను. మీరేమియు భయపడకుడి. ఒక్కసారి నన్ను మీపుత్రునిగా స్వీకరించినచో, సర్వకాలములయందును మీ రెచ్చటనుండినను, మిమ్మంటిపెట్టుకొనియే నే నుండెదను. మీరు గాక నాకు ప్రేమించుటకై మరెవ్వరులేరు.

Br. Sisir Kumar Ghosal M. A. B. L.,
Advocate, 159 Bakul Bagau Road,
Bhowanipur, Calcutta.

శిశిర్ కుమార్ ఘోషల్ గారు ఎమ్. ఏ. బి. యల్; కలకత్తా,

వీరు వేదాంతమునందు ఎమ్; ఏ; పరీక్షయందు తీర్ణులై ప్రాక్పశ్చిమ వేదాంత తత్వమునంతయు బహుకాలము శోధించి, తార్కికజ్ఞానము ప్రబలుటచే వేటినిగూడ విశ్వసింపకుండిరి. అట్టి తర్కమీమాంసవేత్త శ్రీ హరనాథప్రభువును జూచుటకేగినపుడు, ఆతని హృదయమును, ప్రభువు ద్రవీభూతమొనర్చి ప్రేమసాగరమున ముంచివైచెను. ఆక్షణమునుండి నేటివరకును శ్రీహరనాథుని కాతడు తనశరీరాత్మలనర్పించి, మహాపవిత్రమగు శ్రీహరనాథదేవుని ప్రేమామృతమును గ్రోలుచున్నాడు. వీరొసంగు సందేశమేమనిన, "నా దృష్టిలో శ్రీహరనాథుడు ప్రేమావతారము. ప్రేమయే ఈతని రూపమున నవతరించినది. ఆతని ప్రేమలీల యెట్టిదనగా ప్రతిభక్తుడును తన్నే శ్రీహరనాథుడు గాఢముగా ప్రేమించుచున్నాడనియు, నితరసహోదరభక్తులనట్లు ప్రేమించుచుండుట లేదనియు భావించునట్లుచేయును! ఇనుమయస్కాంత సన్నిధికాకర్షింపబడునట్లు నేనును శ్రీహరనాథుని దరి కాకర్షింపబడితిని. ఆతని సాన్నిధ్యమున ప్రేమశక్తి దారాళముగ నాట్యముచేయును. గావుననే భయంకర గర్జారావములు జేయు మృగములు, క్రూరభుజంగములును గూడ, కాశ్మీరారణ్యా

మున ఆతనిని చుట్టివైచి ప్రభువు పాదముల నతిగారాబముతో నాకుచుండుటకు కారణమైనది. అట్టి సందర్భమున మానవ మాత్రు లొక లెక్కయా? కలకత్తాకెపుడువచ్చినను శ్రీహరనాథుఁడు, 54 మనిక్ టొలా, వీధిలోనె సామాన్యముగా బసచేయుచుండెను. ఆతడు కలకత్తాలోనున్న దినములలో నేను సదాయచ్చటనేయుండి, మూగి జంతువువోలె, ఆతని పాదములయొద్దకూర్చొని, ప్రేమానందములో మునిగిపోవుచుంటిని. కొన్ని సమయములందు కోర్టునకు పోవలయునను మాట మఱచుటయునుగలదు. అట్టి మఱపువలన కలుగు నష్టములకు నేనేమిచేయఁగలను? బలవత్తరమగు హరనాథప్రేమపాశముల బంధితు డనై నిస్సహాయుడనై యుంటిని. ఒకనాడు పెద్దలును, స్నేహితులును నన్ను పలువిధములుగ దూషించి నాపిచ్చినిజూచి హేళనజేయుచు దుర్భాషలాడిరి. ఆనాటిరాత్రి, యింటియొద్దనే పరుండి మరునాటినుం డియు నాప్రాపంచకపు పనులనుగాని సంసార కార్యములను గాని విడువ నని దృఢనిశ్చయుడనైతిని. ఉదయమునలేచి సెజ్జపైనుండగనే అకా రణముగ నాహృదయము ద్రవీభూతమై శ్రీహరనాథుని వైపు నన్నీడ్చు కొనిపోవుచుండెను! "నా ప్రియమైన హరనాథుని వీడుట! దుర్భ రము, దుస్సాధ్యము!" అనుకొని తత్క్షణమే మోటారునెక్కి శ్రీహర నాథునికడ కేగితిని. అంతదనుక నాహృదయవేదన చల్లారకుండెను. ఇటుల నేనొక్కడనేగాను. అనేకులటు ప్రభువుప్రేమకు బానిసలై పోవుచుండిరి. ఆ పరమపురుషుని యుపన్యాసములతో మాకేమియు ప్రసక్తి లేకుండెడిది. అవాచ్యమగు నొక యద్భుత ప్రేమానందమును ఆతని సాన్నిధ్యమున మే మనుభవించుచుంటిమి. నిష్కల్మషమయి, తీవ్రమయి, ప్రగాఢమగు ప్రేమను బొందుచుంటిమి. అట్టి శక్తితో ప్రేమ శరములను మనహృదయములపై ప్రయోగింపగలవాడెవ్వడు? ఒక్క ప్రేమనాథుడే! ఆతని పేరిమిలో భక్తులను, భక్తులపేరిమిలో నాతడును

నిమగ్నులై, యొకరిభావములలో నింకొకరైక్యమై, పొంగి పొరలి వచ్చు ప్రేమభావపరంపరలలో మునిగిపోవుటయే ప్రేమరాసయనఁ బడును. శ్రీహరనాథుని ప్రేమరాసయందు పొందెడి యానందమెప్పటి కప్పుడే నూతనముగను, విచిత్రముగను, ఉత్కృష్టముగను నుండెడిది.

శ్రీహరనాథుని దర్శించువరకును, భగవానుడన నొక న్యాయాదికారివలె పాపుల దండించుచు, పుణ్యాత్ముల బహూకరించుచు నుండు వ్యక్తియని భావించుచు భగవంతుడనిన భయపడుచుంటిని. ఇప్పుడా భావమంతయునుపోయి విశ్వమంతయను సమానభావమున గాఢముగ ప్రేమించు ప్రేమస్వరూపుడే భగవానుడను స్థిరభావ ముద యించినది. శ్రీహరనాథుని దర్శించిన కొన్ని మాసములకు మెట్టి స్వప్రయత్నముకాని, సాధనకాని, లేకుండగనే నా మనసు నందొక ముఖ్యమగు మార్పుకల్గినది. పాపకార్యములందును, ఆత్మోన్నత్య భావములందును, రోతకలుగుచుండెను. ఎట్టి యెుడు దుడుకులు వచ్చు చున్నను యవియన్నియును శ్రీహరనాథుని పరముగావించి నిశ్చింతగాయుండ గలుగు ధైర్యమును పొందితిని. అచిరకాములో నిట్టి మార్పును, యిట్టిసమర్పణ భావమును, జీవులయందు కలుగజేయుటయే యాయనశక్తి. ఆతని నెంత తీవ్రముగ స్మరించుచుండిన నంత యద్భుత వేగముతో జీవుల నివృత్తిమార్గ ప్రయాణము జరిగిపును. ఆహా! అధోగతియందున్న జీవులపై నాతని కెట్టి ప్రేమగలదు! ఎట్టి నిర్హేతుక కృపనుజూపును! ఎట్టిశక్తితో తనవైపున కాకర్షించుకొనును!

పరబ్రహ్మమును, సర్వ కారణములకు ప్రధమకారణమునైన ఆదేవ దేవుడే శ్రీహరనాథ మహాప్రభువుగ నవతరించెననియే నా పూర్ణవిశ్వాసము. ఆతడు శ్రీకృష్ణుడా, శ్రీగౌరాంగుడా యను విష యములతో నాకేమియును పనిలేదు. ఆతని పూర్ణ భగవత్తత్వము నందలి, నావిశ్వాసము సహస్రాంశమైనను చలింపదు. శ్రీహరనాథు

డును, యాతని సతీమణియగు కుసుమకుమారీ దేవియును, కలసి నా యుగళపరిభువగును. ఈపరిభువుపై తప్ప యితరులెవరిపై నైనను, దేని కైనను నేనాధారపడను. శ్రీహరనాథుడే నాజీవితేశుడు. శ్రీ హరనాథుడే నాప్రేమజ్యోతి. శ్రీహరనాథుడే యీ భవసాగరమును దాటింపగలిగిన నౌకానాయకుడు. నా సర్వాశయములును యాతని చరణములపై నున్నవి. ఈయఖండ ప్రేమస్వరూపుడే, నానాథుడు. ఈతని యనన్యసేవయే, నాజీవితలక్ష్యము.

ఒక్కసారి శ్రీహరనాథునకు సమర్పణమైపోయితిమేని, ఆధ్యాత్మికవిషయముననే గాక, సామాన్యప్రాపంచక కార్యములలో గూడ, మనకుగల భాధ్యత నంతయును యాతడే వహించి మనలను సదా రక్షించుచుండునని యనేక స్వానుభవములవలన చెప్పుచున్నాను. ఆతడు జూపురక్షణావిధానము యత్యద్భుతముగ నుండును. ఆయన యాట యంతయు యద్భుతమహిమలతో నిండియున్నది. అట్టి యద్భుతముల నెన్నింటినో నేను కండ్లార జూచియున్నాను. పూర్తిగ శ్రీహరనాథుని విశ్వసించిన నాసోదరు లెందరో తమ యద్భుతానుభవములను గురించి నాకంటె దృఢగాత్రముతో పలుకుచున్నారు. అతని నిర్హేతుక కృప వర్ణనాతీతము.

నా ప్రభువొనర్చిన యద్భుతములలో ముఖ్యముగ రెండింటిని సూచించుచున్నాను.

(1) స్వల్పకాలములో జీవుల భయ రోగనివారణము.

(2) ఘోరపాపులకు కూడ భగవత్ప్రేమను ప్రసాదించి వారిని గోపికలవంటి భగవత్ ప్రియులుగ మార్చివేయుట.

నేను ముగించుటకుపూర్వము శ్రీహరనాథుని యమృతవాక్యములలో రెండింటిని తెలియజేయుచున్నాను.

(1) మీ నిస్సహాయుడగు చిన్ని బిడ్డగనే నన్ను పరిగణించుడి. అట్టిబిడ్డ మీకు పవిత్రమై ప్రేమపూరితమగు చిరునగవుతప్ప మరి యేదియు నొసంగ జాలకుండినను, వానిని మీరెట్లువిడువ జాలరో, నావిషయములోకూడ నట్లే భావించుకొనుడు. ఇట్టి పవిత్రమగు యాశ యున్నంతకాలము మీ కనన్యమగు యానందము కలుగుచుండును. అప్పుడే మీ ప్రేమ పవిత్రమమై, నిష్కామమై యుండును.

(2) మహారాజునకు తన ప్రధానమంత్రి కంటె తనరహస్యపరిచారకుడే యెక్కువప్రియుడు.

## II. భాగవత్ చంద్రమిత్తరు గారు.

(కలకత్తాలోనున్న, శ్రీహరనాథ ఉచిత హైస్కూలు, స్థాపకులు. మిలటరీ సూపరెండెండెంటు అకౌంటెంటుగా పనిచేసి పెంక్షను తీసుకొనుచున్నారు. వీరు సుమారు 30 సం॥ లు, ప్రాణాయామాది, యోగమార్గముల నభ్యసించిన, యోగిపుంగవులు. ఇప్పటికిని సజీవులై యున్నారు. శ్రీహరనాథ భక్తకోటిలో ముఖ్యులు.)

"హిందూదేశములోని, మహాయోగుల నెందరినో, నేను స్వయముగా జూచి, వారి సాన్నిధ్యమున కొంతకాలము గడుపుచుంటిని. చిరకాలము యోగాభ్యాసముజేసి, ఈ మార్గమునందలి విశేషముల నెన్నిటినో, యనుభవముగా తెలిసికొంటిని. శ్రీహరనాథుని, చైతన్య స్థితిని వర్ణించుట దుస్సాధ్యము. ఏమనిన, ఆతడెప్పుడును, సమాధి స్థితియను స్థితియందుండడు. అయినను, వివిధయోగులు తమతమ అభ్యాసములలో నున్న సమయమందు, ఆతడు తనస్వరూపమును వారి ఆయాస్థితులలోనే జూపి, తనవద్దకాకర్షించు చుండెను! దీనిని బట్టి

చూడ, వివిధలోకములలో ఆతడొకేసారి పనిచేయుచున్నట్లు స్పష్టమగుచున్నది. సామాన్యులకు, ఆతడుజాగ్రదావస్థలోనే సదాయున్నట్లు కాన్పించును. సూక్ష్మదృష్టిని పొందినవారితోకూడ ఆతడదేస్థితియందుండి, మాట్లాడుచుండును. మరియు భగవత్ దృష్టినికల్గిన వారికి, దేవతాగణములతో యాతడు వ్యవహరించుచున్నట్లు కాన్పించును. ఇన్నియును, ఒకేసమయములో వివిధజీవులకు జూపుచుండెను! ఈ ప్రపంచమున వివిధప్రదేశములలో, వివిధస్థూలరూపములతో, దర్శనమిచ్చుచు వివిధభాషలు మాట్లాడుచు, ఒకేసారి వ్యవహరించు చుండెను. కాశ్మీర్, గయ, మున్నగు ప్రదేశములనుండి మహాయోగులు కూడ ఆయన దర్శనమునకై వచ్చుచుండుట, నేను జూచితిని. ఆత డొకేసారి వ్యక్త ప్రపంచము, అవ్యక్తస్థితి అను (పరాప్రకృతి) ఈ రెంటినిని అతిశయించియు కూడనుండెను. "అవ్యక్తో, వక్తాత్ పరః" అనునట్లు, వ్యక్తావ్యక్తముల రెంటినికూడ, అతిశయించి యుండెను. ఒకసారి మాతా కుసుమకుమారీ దేవికి, శ్రీ హరనాథు డొక విషయము ఎంతో యుక్తిగా జెప్పుచుండెను. అదేసమయమున, మాతాజీ, ఆయన తొడను మెల్లగ కొట్టుచు, "ఇప్పుడు మీరెచ్చటనున్నారు" అని ప్రశ్నించెను. (ప్రభువు మాతో మాట్లాడుచుండగా, నిట్టి ప్రశ్నను, కుసుమాంబ యెందులకడిగెను? అదేసమయమున ప్రభువు, మరియొకలోకములో పనిచేయుచున్నాడని, మేము కనిపెట్ట కల్గితిమి.) ప్రభువిట్లు జబాబుచెప్పెను. "ప్రతిలోకము నందును కూడ నేనిదేవిధమున ఒకేసారి పనిచేయుచున్నాను. నేను లేనిస్థలమున్నట్లు నాకు దోచదు. ఈ లోకములోని వారు నా కొరకై యెట్లు తపించుచున్నారో ఇతరలోకములలో కూడనట్లేయున్నారు. నాకందరును ఒక్కటియే. ఎవరు భిక్షము పెట్టుదమనిన, వారిద్వారముయొద్ద కేగుటయే నాపని."

(ఇచ్చట భిక్షమనగా ప్రేమ. జీవులహృదయ భాండములందలి ప్రేమ నవనీతమునే యాతడాసించునట.) శ్రీహరనాథుడు పుట్టిన నాటినుం డియు భగవత్స్వరూపుడే. ఆతని శక్తులేవియును సాధనఫలితములు గావు. ప్రభువు తాను జన్మించుటకు పూర్వముననే, . యొకమాయా సాధురూపమును గైకొనగల్గి నప్పుడు, పుట్టినతరువాత ఆతని శక్తుల యందలి పటిమ క్షీణించునా? హిందూ వేదాంతపత్రికా సంపాదకు లెంతయోకోరగా ప్రభువీ విషయమునే చెప్పియుండెను. అప్పు డీవిష యము డిసెంబరు 1907 పత్రికయందు వ్రాయబడెను. ఐనను కార ణాంతరములచే నాత డతని యద్భుతశక్తులను తన బాల్యమున, ధారా ళముగా జూపియుండలేదు. ఆతడు సర్వకాలములయందును, తన సచ్చి దానందసాగముపై పవళించి యుండినను, ఈ ప్రాపంచిక కార్యముల నన్నిటిని, (మాట్లాడుట, భుజించుట, మున్నగు సంసారక్రియలను) ప్రయత్నమేమియు లేకనే యంత్రమువలె నడిపించుచుండెను. ఆతని జగల్లీలానాటకములో నటకుడును ప్రేక్షకుడును తానే? ఆతని నావ రించిన ప్రాపంచికవిషయము లెట్టి తీవ్రతరములైనను, సదా వేలకొలంది భక్తులతో నాతడు క్రీడించుచున్నట్లు కాన్పించినను, సదా ఆతనిదృష్టి అంతర్ముఖముగనే యుండునట్లు పూర్ణయోగులుదప్ప సామాన్యులు కనిపెట్టుట దుస్సాధ్యము. పూర్ణయోగులకైనను కొన్నిసందర్భ ములయం దట్లు కనిపెట్ట గల్గుట శక్తికిమించిన పని యగుచున్నది. సర్వవ్యాప్తమై సర్వలోకముల నావరించుకొని యుండి, యొకేసారి వ్యక్తావ్యక్తములుగ నుండిన యాతని చైతన్యతత్త్వము నెట్లూహింప సాధ్యమగును? నైనిటాల్ అరణ్యమందు నివసించుచున్న యోగి పుంగవుడును, శిద్ధపురుషుడును అగు సోంబారీమహారాజ్, అను నాతడు శ్రీహరనాథుని భగవత్త్వమునుగురించి, స్పష్టముగా 1920 సం॥లో చెప్పుచు, ‡ "శ్రీహరనాథుడు తన నిజస్వరూపమును సామా

న్యులదృష్టినుండి పూర్తిగా కప్పిపుచ్చుటకై, అనేక విధములుగా మాయానాటకమునాడుచున్నాడు. ఆయనను పూర్తిగా ఇంతవరకును నేనుకూడ కనిపెట్టజాలకున్నాను. అట్టిచో బాహ్యదృష్టికొక మహాభోగి వలె కాన్పించుచున్న యాతనిని మీరెట్లు తెలుసుకొనగలరు?" అని భవానిచరన్‌బోసు గారికి తెలయజేసెను.

## జానకీబాయి సందేశము.

ఈమె, సిక్కుమతస్థురాలు. సన్యాసమును స్వీకరించి, సాధు వేషమున, హిందూదేశమంతయును తిరుగుచుండెను. బరంపురములోని సత్యనారాయణ రావుగారి సతీమణియగు కామేశ్వరీబాయిగారికి, చాల జబ్బుగా నున్నప్పుడు శ్రీహరనాథుడు వారికిట్లు వ్రాసెను:—

"నాయనా! నాజననియగు కామేశ్వరికి, సహాయముగా నుండుటకై తగినయొక స్త్రీలభించును..." తరువాత కొలదిరోజులకు, దేశములన్నియును తిరిగితిరిగి, జానకీబాయి, బరంపురం వచ్చి రావుగారి భవనమున కెదురుగా నొకచెట్టుక్రింద కూర్చొనియుండెను. రావుగారీమెనుజూచి, "అమ్మా! ఇంత యెండలో నీ విచ్చట యేల కూర్చొనవలయును? నా గృహమునకురండు." అని యాహ్వానించగా, ఈయోగిని, "బాబా! నీభార్య యారోగ్యమిప్పుడెట్లున్నది?" అని ప్రశ్నించెను! ఆమె యొక మహాయోగినియే యని, రావుగారానందపడి, తిరిగి తిరిగి యాహ్వానించెను. ఆదినము నుండీయోగిని, కొంతకాల మచ్చటనే యుండెను.

ఒకరోజున ప్రభుపటము నామెజూచి, ఇతడెవ్వరు, అని ప్రశ్నించగా, "ఇతడు శ్రీహరనాథుడు భగవదవతారపురుషుడు. వీరిప్పటికిని సజీవులై యున్నారు. ఈయన, జీవితమంతయును, అత్యద్భుతవిషయ

ములతో నిండియున్నది...." అని చెప్పగా, యామెవిని, కన్నీరుకా ర్చుచు, దేహము పులకరింప, గద్గదస్వరముతో, "ఔను, ఈతడే మహాప్రభువు. ఈయన అంశమే, శ్రీ గురునానక్" అని ఇప్పుడు స్పష్ట మగుచున్నది. దీనికనేక కారణములున్నవి. గురునానక్ సుమారు 400 సంIIల క్రిందట, గురుముఖి భాషలో శ్రీ హరనాథస్తోత్రము వ్రాసి యుండెను. అతడు శ్రీ హ ర నా థు ని స్మరించుచు, శ్రీహర నాథుడే పరబ్రహ్మమని వ్రాయుచు, శ్రీహరనాథుని సందేశముచే వివిధమతములను కలుపుటయు, భగవన్నామము దప్ప తరించుటకు మరియొకమార్గము లేదనియు, భగవత్ ప్రేమను పొందుటయే సర్వో త్కృష్టస్థితి యనియు చెప్పియున్నాడు. శ్రీహరనాథుడుకూడ ఇప్పుడు సరిగా అద్వైతత్వమును బోధించుచు, వివిధమతస్థులను తనవద్ద కాక ర్షించుకొనుటలో నాశ్చర్యములేదు. ఈతడే మహాప్రభువు గనుక, అత్య ద్భుతములను, వేలకువేలు ధారాళముగా ప్రదర్శించుటలో నాశ్చర్య ములేదు. నేను ధన్యురాలను. నిశ్చయముగా ధన్యురాలను. ఆయనను సేవించుటకై పోయెదను. నాకు పాపవిమోచన కాలము నేటికి వచ్చి నది." అనుచు పలువిధముల తనయానందమును వెలిబుచ్చుచు గురునానక్, 400 సంIIల క్రిందట రచియించిన, శ్రీహరనాథఅష్టపదను పఠించుచుండెను. ఆమె గ్రంథమునుండి చదువుచుండగా, రావుగారు వ్రాసుకొనిరి. ఆపాట నిచ్చట వ్రాయుచున్నాము:—

భేమే--అష్టపద.

(గురుముఖి భాషలో వ్రాయబడినది,)

I

జె తే-జె తేలావా-తే తేంగ స్సై-హరనాథ్
నానకి-ఇన కే-కచూనాహాత్

అగమ, అగాధ్ పారబ్రహ్మసోయే
జోజోకహే సోము క్తహుయే
సునోమిత నానకి బినవంత
సాధుజనకి, అచరజకథ ॥

II

జయ జయ శ్రీహరనాథ్
సంతకెపాలక పృథ్వీకేమాలక
హోయె అవతారి హోకేదయాళ్
కరోజీనిహాల్ యెహె అరజ్ అమాకీ
యేహోఅవాజ్ సునోజీ మురాజీ
సంసారసముద్రసె పారకరోజీ జయసే
గౌతమ నారద అహల్యకుతారే
జయ జయ శ్రీహరనాథ్ ॥

పాఠకులారా! ఈమె సోనాముఖికేగి ప్రభుదర్శనము జేసుకొని, ఆయన సేవజేయుచు, సుమారు, 2 మాసములచ్చటనే యుండి, ప్రభుయాజ్ఞ ననుసరించి, శ్రీబృందావనమున కేగెను. ఆమె తెలియజేసియుండిన దేమనగా,

శ్రీ హరనాథ యవతారమునకు, వందలకొలది సంవత్సరములకు పూర్వమే, "హరనాథ" అను పవిత్రనామము, ముక్తిదాయకమైనదని, మహాపురుషులగు గురునానక్ వంటివారు, వ్రాసియున్నారు. భగవంతుడగు శ్రీహరనాథుడే, ఈ కలియుగమున, హరనాథనామమును గైకొని, యవతరించెను. ఈనామ మనాదిసిద్ధమైనది. పరబ్రహ్మమునకే ఈనామము వర్తించుచున్నట్లు, గురునానక్ వ్రాసియున్నాడు."

—: నారాయణచంద్రఘోషుగారి సందేశము :—

Br. Narayana Chandra Ghosh B. L.,
Legal adviser, Calcutta Carporation,
calcutta.

[వీరు శ్రీహరనాథుని యాంతరంగిక భక్తులలో నొకరై యున్నారు. వీరు కొన్ని గ్రంథములను ఆంగ్లేయభాషలో ప్రభుహరనాథుని ప్రేమతత్వమును తెలియజేయుచు వ్రాసియున్నారు. వీరు మహాపండితులని, వీరి గ్రంథములు చదివినవారందరకును స్పష్టమగును. "ఫార్వర్డు" పత్రికా సంపాదకులుకూడ, ఒకప్పుడు వీరి పాండిత్యమును, కొనియాడుచు, ప్రచురించిరి. సుమారు 10 మంది మహాపురుషులనైనను వీరు జూచియుండుటయేగాక, వారితో కలసి మెలసి చాలకాలము సంచరించినట్లు, ఆయామహాపురుషుల నామములనుకూడ పేర్కొనుచు, మాకొక దీర్ఘమగులేఖను యీ క్రిందివిధముగా వ్రాసియున్నారు. ఆ మహాపురుషుల నామముల నిచ్చట వ్రాయదలచుకొనలేదు.]

ఎందరు మహాపురుషుల సమక్షమున నున్నను, నాహృదయమునం దెట్టిమార్పును కలుగకుండెడిది. వారి యద్భుతకార్యములను జూచి నేను నివ్వెరపోవుచుండినను, నాహృదయమేలనో కాని, కరుగకుండెను. వేలకొలది యనుచరులుగల మహాపురుషులుకూడ నాహృదయమును మాత్రము, హరింపజాలకుండిరి.

ఒకదినమున శ్రీహరనాథుడు కాశ్మీరమునుండి కలకత్తాకు వచ్చియున్నప్పుడు, శ్రీహరనాథునిగురించి విని యాయనదర్శనము నకై, నందలాల్‌పాల్ మహాశయుని గృహమునకుబోతిని. నన్ను గాంచినంతనే ప్రభువు, "నందలాల్! నాసోదరుడగు నీతడెంతయో శ్రమపడి, తనకోర్టునుండి నన్ను చూడవలయునని వచ్చినాడు. ఈ... సికి ఫలహారములను యొసంగి తరువాత, నావద్దకు తీసుకొని రమ్మ...

నందలాలునితో చెప్పెను. ఇంత చనువుగా నాతో మాట్లాడుచున్న ఈతడెవ్వరై యుండవచ్చును? అని అనుకొంటిని. ఇట్లు పల్కిన యాతడే శ్రీహరనాథు డనినేను గ్రహింపలేకపోతిని. ఏమనిన, ఎంతో ఖరీదు గల దుస్తులను ధరించి, చూచుటకొక మహారాజువలె కాన్పించు నతడు, ఇంత మహాఖ్యాతిగల శ్రీహరనాథుడు కాడని యనుకొంటిని, భగవానుడు నటనాగ్రేసరు డని గ్రంథములలో చదువుటయేగాని, ప్రత్యక్షముగా జూచుట కిదియే నాకు మొదటి పర్యాయము. ఫలహారానంతరము తిరిగి గదిలోనికి వచ్చి నిలువబడితిని. వందలకొలది భక్తు లచ్చట యుండి, శ్రీహరనాథునితో సంభాషించుచుండిరి. శ్రీహరనాథుడు మహదానంద ముతో, ఆంగ్లేయ భాషలో సంభాషించుచుండెను.

హరనాథుని కంఠస్వరమును, ముఖలక్షణములును, నాకేలనో గాని చిరపరిచయముగా నున్నట్లు దోచుచుండెను. ఈయనను, ఏదైన కళాశాలలో జూచితినేమో యనుకొని, "అయ్యా! తమరే కళాశాలలో జదువుకొంటిరి?" అని హరనాథుని ప్రశ్నించితిని. సర్వజ్ఞుడగు ప్రభువు, వెంటనే నా యుద్దేశమును కనిపెట్టి,

"నాయనా! నేను చిరపరచితునిగా నీకు దోచుటలో నేమియు నాశ్చర్యములేదు. అనేక జన్మములనుండి, నిన్ను విడువక, నేను వచ్చు చున్నాను. నన్ను నీవును విడుచుట లేదు. అయితే నన్ను మాత్రము నీవు గుర్తించుట చాల కష్టము. నిన్ను మాత్రము నేను మరువ లేదని తెలుసుకొనుము" అని చెప్పెను!! హాశ్చర్యముతో యాయన ముఖమును జూచితిని. శ్రీ హరనాథుడు తన ప్రేమ నేత్రములను నా వైపు త్రిప్పెను. అప్రయత్నముగా, నాహృదయము ద్రవీ భూతమగుచుండెను. ఆనందాతి శయమున, యేడ్వు చుంటిని. ఎందుల కేడ్చుచుంటినో నాకే తెలియకుండెను! కన్నీటి ధారను మాత్రము నాపలేక పోతిని. శ్రీ హరనాథుడే, నా హృదయ

నాథుడని నా ప్రేమచాటుచుండెను. హరనాథుని సమీపించి, ఆయన పాదకమలములను నాశిరమున కద్దుకొంటిని.

నాటిరాత్రినుండియు, శ్రీహరనాథుడు నాహృదయములను బలాత్కారముగా, తనవైపున కాకర్షించుకొనుచుండెను. నిర్హేతుక ప్రేమను, మనహృదయములలో జనింపజేయగల్గు శ్రీహరనాథుడు, సాక్షాత్ భగవానుడుగాక, సామాన్యమహాపురుషు డెట్లగును? చైతన్య, వల్లభాచార్యుల శిద్ధాంతముల ప్రకారము, జీవుల హృదయములలో నిర్హేతుకప్రేమను జనింప జేయగలవాడొక్క శ్రీకృష్ణుడే! ప్రేమశక్తి సర్వవిధములగు శిద్ధులకంటెను అతీతమైన తత్వమని పండితులందరకును తెలిసిన విషయమే. ఇదియే గోలోకనాథుడగు శ్రీకృష్ణుని ప్రధానలక్షణము. ఒకశిద్ధుడు లేక మహాపురుషుడు మనపై తనకృపనుజూపి కొన్నివిపత్తులనుండి తప్పించినచో అతనిపై మనకు కలుగు భావమునకు కృతజ్ఞత యనబడును కాని ప్రేమయనబడదు. ఎట్టికారణమును లేకకల్గెడిగాఢమైన, పరిశుద్ధమగు యనురాగ ఆవేశమునే ప్రేమయనెదము. ఇట్టియనురాగమును భగవానుడుదప్ప మరెవ్వరునుకలిగింపజాలరు. శ్రీహరనాథుని యనుచరులలో వేలకొలదిమంది బలవత్తరమగు ఈప్రేమపాశములచే ప్రభుహరనాథు, పాదములకు నేడు కట్టుపడి యున్నారు. మానవప్రయత్నమువలన, ఆయనను ప్రేమింపగల్గుదు మనునది యసత్యము. ఆయన దివ్యసంకల్పములేనిదే, ఎట్టితీవ్రమగు తపస్సులు, యజ్ఞాదులు, మున్నగునవిజేసినను, ఆయనను ప్రేమింపజాలము. కనుకనే శ్రీహరనాథుడిట్లు తెలియజేయుటకు కారణమైనది.

"నావారిని నేనేయెన్నుకొనెదను" ప్రథమసారి శ్రీహరనాథుని ముఖమును జూచినంతనే దుర్భరమగు ప్రేమావేశమున వెక్కివెక్కియేడ్చుచుండిన, వారెందరినో నేను కండ్లారజూచితిని. ఆయన ఛాయాపటమును ప్రథమసారి జూచి, యేడ్చినవారెసికూడ నేనెరుంగుదును

మనతర్కమ, మీ మాంసములవలనగాని, భౌతిక శాస్త్రజ్ఞానము వలనకాని, ప్రేమతత్వ రహస్యములను స్వప్నమందైనను యూహింప జాలము. అట్టి విషయములో ప్రేమనాథుని గుర్తించుట కెవరితరము? "దేవతలుగూడ నిజమైన రాగభక్తుని గుర్తింపజాలరని" స్పష్టముగా శాస్త్రములలో నున్నది. అట్టి విషయములో రాగ భక్తులకు నాథు డగు పరమపురుషుని, లీలామానుష రూపము నెవరు గుర్తింపగలరు?

మున్ను బ్రహ్మాది దేవతలే శ్రీకృష్ణుని గుర్తింపజాలక ఆయ నను పరిహాసింపబోయిరని భాగవతమునందు వ్రాయబడినది. అట్టి విషయములో, ఈ కలియుగ జీవులమగు మనము, కేవలము పరోక్ష జ్ఞానముపై నాధారపడుచున్న మనము, కించిజ్ఞులమగు మనము, అహం కారాదులలో మునిగి తేలుచున్న మనము, ప్రేమనాథుడగు శ్రీ హర నాథ మహా ప్రభువును గుర్తింపగలమా ! ప్రేమనాథునికి, జగత్ కార్య క్రమముతో నెట్టి జోక్యమును లేదు. గనుక, ఆయన అవతారములను గురించి శాస్త్రములలో వ్రాయబడనేరదు. అయితే ఆయన అవత రించుటకు పూర్వమే, తన భక్తుడగు నొక మహా పురుషుని కైనను యాయన ప్రత్యక్షమై, తన భవిష్యత్ రాకనుగూర్చి తెలియజేయును. 1593 సం॥ లో, (అనగా శ్రీ హరనాథ యవతారమునకు సుమారు 272 సం॥ లకు పూర్వమే) మనోహరదాస్, అను మహా పురుషునికి తన రాకనుగూర్చి ప్రభువు తెలియజేసెను. ఇదియేగాక కొన్ని అద్భుత దర్శనములవలన జయరామ్ భగవతీ దేవులకు తన యవతారమును ప్రభువు సూచించెను! ఇన్ని విధములుగా తెలియజేసిన తరువాతనే ప్రభుహరనాథు డవతరించెను.

శ్రీ హరనాథు డొక శిలా విగ్రహమును తన సంకల్పముచే సృష్టించి, మాయా మానుష రూపమును దాల్చి, నాకొసంగి, నన్ను పూజాదులు చేయవలసినదని యాజ్ఞాపించెను! ఆ శిలావిగ్రహ చరిత్రమున్ను

ఆ విగ్రహముద్వారా, శ్రీ హరనాథుడు జూపు ప్రత్యక్షలీలలు వర్ణ నాతీతము.

ఎట్టి తర్క మీమాంసములతోను కాలమునుగాని, మనయాధ్యాత్మికశక్తినిగాని వృథాపుచ్చక, పూర్ణ విశ్వాసముతో సర్వ భారములను ప్రభుహరనాథునిపై వేసి పరమపవిత్రమై, సులభ ముక్తి దాయకమగు, ఆయన దివ్యనామస్మరణనే గావించుకొనుచుండెదరని నేను దీనముగా వేడుకొనుచున్నాను. సులభముగా తరించుటకు ఈ కలియుగమునం దింతకంటె మరియొక సులభమార్గము లేదు

—: వివిధ భక్తులు వ్రాసియుండిన కొన్ని లేఖలు :—

శ్రీహరనాథ భక్తకోటిలో, పార్శీమతస్థులును, క్రైస్తవులును, మహమ్మదీయులును జ్యూ మతస్థులును, వల్లభాచార్య సాంప్రదాయకులును, శైవులును, కాళీభక్తులును, మున్నగువారు వ్రాసిన జాబులుజూచినచో, శ్రీహరనాథుడే, ప్రభువని వారందరును విశ్వసించినట్లు స్పష్టమగును.

ఒక వ్యక్తిని గురువుగా స్వీకరించుట చాల సులభము కాని సాక్షాత్ భగవంతుడని విశ్వసించి, యాయన నామమునే సదా స్మరించిన చాలునని, పూర్తిగా నమ్ముట సామాన్య విషయముకాదు. ముఖ్యముగా నిందరు వివిధమతస్థులవారాతడే తమతమ యిష్టదేవతా యవతారమని గాఢముగా విశ్వసించుటయును, ఆయన నామమునే స్మరించుటయును, శ్రీ హరనాథుని భగవత్ శక్తికి ప్రత్యక్ష తార్కాణము. ఎందరెందరో మహా పురుషులు, సిద్ధులు, యోగులు, జ్ఞానులు, సద్గురువులును, ఈ లోకమునకు వచ్చియున్నారు. కాని వారి నామముల నే స్మరించునంతటి పూర్ణ విశ్వాసము, అట్టి మహాపురుషుల యనుచరులకు కూడ యుండెడిదికాదు. రామ, కృష్ణ, విఠల్, శివ, నారాయణ మున్నగు

నామములవలెనే హరనాథనామము ధారాళముగా, వేలకువేలచే శ్రీహర నాథునిజీవితకాలములోనే స్మరింపబడుచుండెడిది. హరనాథ నామయ జ్ఞము, నామప్రవాహములు, మున్నగునవి జరుపబడుచుండెను. ఇట్టి దృఢ విశ్వాసమును, భగవానుడు దప్ప, సామాన్య మహాపురుషులెవ్వరును తమయనుచరులకు ప్రసాదింపజాలరు. ముఖ్యముగా నట్టి పురుషులు జీవించియుండగానే వారి నామస్మరణయే ముక్తిదాయకమను, దృఢ మగు నమ్మిక ప్రసాదింపగల్గుట దుస్సాధ్యము. శ్రీహరనాథ భక్తకో టిలో రామగోపాల్, నారాయణ, చంద్రఘోషు, దామోదరశాస్త్రి, జగన్మోహన్‌దాస్, మున్నగు మహా పండితులును, యోగిపుంగవు లగు భాగవత్ చంద్రమిత్తరు, సదానందబ్రహ్మచారి, తమాలినీదేవి, సేన్, మున్నగువారును, భౌతికశాస్త్రవేత్తలును, మహా తార్కికులగు శిశిర్ కుమార్ ఘోషాల్, జ్యోతిష్ చంద్రవిశ్వాస్, భవానీచరణ్ బోస్ (ఎట్టి యద్భుత పరంపరలు కండ్లార జూచినను, వీరుహరనాథుడు భగ వానుడని చాలకాలము విశ్వసింపలేదు.) పూర్ణచంద్ర మహోపాధ్యాయ (వీరు కాశ్మీరములోని ప్రధాన ఇంజనీర్; కేవలము నాస్తికులు.) మున్నగువారు సులభముగా హరనాథుడే భగవంతుడని మొదట విశ్వసింపలేదు. అట్టి వారికి గూడ పూర్ణ విశ్వాసము గల్గినది. వారందరును హరనాథ నామమునే స్మరించుచున్నారు! తన నామ మునే స్మరింపుడని చెప్పకుండగనే తన నామస్మరణ ముక్తిదాయక మను దృఢవిశ్వాసము నొసంగుటయే అవతార పురుషుని శక్తి. ఇప్పుడు గ్రంథ విస్తీర్ణ భీతిచే 4, 5 జాబులనే ప్రచురించియున్నాము. ఈ జాబు లన్నియును మావద్దనే యున్నవి. కొన్ని కొన్ని జాబులలో గృహ సంబంధమగు ప్రత్యేక విషయము లుండుటచే నట్టి వాక్యములను ప్రచురించి యుండలేదు.

I జొరాస్టర్ మతస్థుడు.
బొమాన్జీయన్ ఫాంతకీగారు.

—: జయ్ శ్రీ కుసుమహరనాథ్ జీ :— ఇలావ్
(కేమ్) 25—10—26.

My holiest Lord! పవిత్రమగు నా ప్రభూ!

ఓ నా ప్రభూ! నీవొసంగిన విజయదశమి, ఆశీర్వాదముల కెన్నియో ప్రణామములు. నా ప్రభూ! నా గృహమునకు నా ప్రభువగు నిన్ను, తీసుకొని రాగల్గుసుదిన మెప్పుడు వచ్చునోగదా! నా సర్వాశయములును, నా సర్వ ప్రేమయును, నీ పాదయుగళమందే లగ్నమై యున్నవి. నీ దేవియగు కుసుమాంబకు నా ప్రణామములని చెప్పవలయును.

Your most Obedient Slave } సదా అతివినయముగానుండు నీబానిస
B. N. Pomthoki } బొమాన్జీయన్ ఫాంతకి

II క్రిస్టియన్ మతస్థుడు.
డి. వి. ఇవాన్సు దొరగారు.

ప్రియతమమైన, నా జగజ్జనకా!

కండ్లనిండ నీరుపెట్టుకొని నీ పాదములయొద్ద నా శిరస్సునుంచి నేనేమైన యపరాధములు జేసినచో, క్షమింపుమని వేడుకొనుచు, నీకు జాబును వ్రాయుచున్నాను. ఇటీవల నీవద్దనుండి నాకెట్టి జాబులును లేని కారణమున, నా మనశ్శాంతి యంతయు క్షీణించినది. ఈ దినమున నశ్రుధారలతో ప్రభావంతమగు నీ పటమును జూచుచు నొక్కడనే కూర్చొని, నిశరాత్రి సమయమగు నిప్పుడీజాబును వ్రాయుచున్నాను. నాపై నీ కృపావీక్షణము నొక్కింత ప్రసరింపుము.

నీదిక్కులేని,
బిడ్డ,
ఇవాన్సు

III మరియొక మతస్థుడిట్లు వ్రాయుచున్నాడు.

—:జయ్ శ్రీకుసుమహరనాథ్:— పూరీ,

18—4—26.

నాప్రియమైన, ప్రియమైనప్రభూ

(My dear dear Lord.)

ఇటీవల నీవద్దనుండి జాబులులేకపోవుటచే, నేనెంతయో దుఃఖించుచున్నాను, నాబోటి బిడ్డలెందరెందరో నీకుగలరు. కాని నాకు నీవొక్కడవే తండ్రివి సుమా. నాసాష్టాంగ ప్రణామముల నందుకొని, మాతాజీకికూడ నందజేయుము.

సదా నీపాదకమలముల వద్దనుండెడి,

నీదిక్కులేని బిడ్డ,

నేవాల్.

IV వల్లభాచార్య మతసాంప్రదాయమునకు చేరిన

భగవాన్‌దాస్ కళ్యాణదాస్‌గారి జాబు.

[ఈయనకే శ్రీహరనాథప్రభువు నిరుపమాన తేజస్సుతో శ్రీమహావిష్ణువుగా చతుర్భుజములతో దర్శనమొసంగెనని చదువరులెరుంగుదురుగాక! ఈయన బొంబాయిలోని నొక కోటీశ్వరుడు. ధనమదాంధ మేమియులేక మహాభక్తుడై ప్రభుభక్తులందరిని సేవించుచుండును]

బొంబాయి,

20—11—27

To my Holiest, all - loving, and all - merciful prabhu,
పవిత్రుడగు, విశ్వప్రియుడగు, పూర్ణదయాళుడగు నాప్రభునకు,

You are the all Highest, while we are nothing. we are unworthy wretches. But still with your infinite mercy you protect and save us. That is your greatness. Please do make us worthy of your Divine Love and make us your ever humble servants that we are again and again bow down to the lotus feet of the Divine mother and yourHoly Self.

నీవు సర్వోన్నత స్థితియందుండు నాథుడవైనను, మేమెట్టి విలువయును చేయని యధములమైనను, నీ యనంత కృపావిశేషముచే మమ్ము సదా రక్షించుచుందువు. ఇదియే నీ యౌన్నత్యమునకు ముఖ్య కారణము. నీ భగవత్ ప్రేమకు పాత్రులమగునట్లు మమ్ము చేయుము. సదా నీ దాసాను దాసులుగా మమ్ము చేసుకొనుమనియే మేము నిరంతరమును నిన్ను ప్రార్థించుచున్నాము. సాక్షాత్ దేవియగు మాతాజీకును, పవిత్రతమమైన నీకును, మేము ప్రణామము లొనర్చుచున్నాము.

నీ పాద సేవకుడు,

భగవాన్‌దాస్ కళ్యాణదాస్,

పాఠక మహాశయులారా! వేలకువేలు శ్రీహరనాథ భక్తులుగా నున్న జనులందరు, బలవత్తరమగు ప్రేమ పాశములచే కట్టుపడి ఆయనే సాక్షాత్ భగవంతుడని పూర్తిగా విశ్వసించి, యందులకు తార్కాణముగా యాతని నామమునే దినమంతయును స్మరించుచుండిరి, పావనమైన యాతని యద్భుత మహాత్యములనే కొనియాడుకొను చుండిరి. ఆయన వద్దనుండి జాబులు రాకుండినచో నెంతయో దుఃఖపడుచుండిరి. శైబలినీ దేవి తన ప్రేమావేశమును భరింపజాలక శ్రీ హరనాథున కిట్లు తంతి యిచ్చెను. "నీకై తపించుచున్నాను. నీ దర్శనమునకై వచ్చుటకు నా కనుజ్ఞ నొసంగుచు, టెలిగ్రామ్ నిమ్ము" అని ఒక తంతిని పంపగా, "మా అమ్మకై నేనును తపించుచున్నాను. కొలది రోజులలో, నేనే యచ్చుటకు వచ్చుచున్నాను" అని తిరిగి ప్రభువు తంతిని పంపెను. ప్రేమ యనునది హృదయములను చీల్చివేయుచు వ్యక్తమగుచుండును.

V

జగమోహన్‌దాస్ గారును నొక గుజరాటీ భక్తులు బొంబాయి నుండి శ్రీ కృష్ణాష్టమి దినమున, శ్రీ మాతాజీ కిట్లు తంతి కొట్టిరి.

కుసుమకుమారి దేవి,
c/o ప్రభుహరనాథ్,
శోనాముఖి.

Pray accept our humble pranams on this auspicious day when Prabhu appeared five thousand years ago.

(Sd!) Jugmohan.

అయిదు వేల సంవత్సరములకు క్రితము, ప్రభువు [హరనాథుడు] కాన్పించిన [కృష్ణునిగా] నేటి పరమ శుభదినమున మేము సమర్పించు వినయపూర్వక ప్రణామములను స్వీకరింపుమని ప్రార్థించుచున్నాను.

జగమోహన్.

N. B.:— ఈ తంతి మా వద్దనే యున్నది. తంతియొక్క పై విలాసములో కూడ, "ప్రభుహరనాథ్" అనియే సామాన్యముగా భక్తులు వ్రాయుచుండిరి. కలకత్తాలో ప్రభుహరనాథుని పేరుతో మందిర భవనములను కొనుటకై, రు 30,000 [ముప్పదివేల రూప్యములను] ఏప్రియల్ 1934 సం॥ న విరాళముగా నొసంగిన పరమ భక్తుడీ జగమోహన్ మహాశయుడే యని చదువరులు గ్రహింతురుగాక.

VI

పాఠకులారా! శ్రీహరనాథుడే జగజ్జనని యగు, కాళీమాత యని జెప్పుచు, కొందరు కాళీ భక్తులకు, తాత్కాలికముగా భగవత్ దృష్టిని ప్రసాదింపజేసి, విశ్వ స్వరూపిణియు, జననియు నగు కాళీ మాతగా దర్శన మిచ్చియుండెను. అట్టి భక్తులు, ప్రభుహరనాథుని

"నాప్రియమైన జననీ" అనియే సంభోదించుచు జాబులు వ్రాయు చుండెడివారు! ఇందుకు తార్కాణముగా నొకజాబు నుదహరించు చున్నాము:—

మణికార మహాశయుడు వ్రాసిన జాబు

375, ఠాకూర్ ద్వారము;

బొంబాయి, నెం. 2.

నాప్రియమైన, ప్రియమైన జనని యగు శ్రీ హరనాథా,

నీవద్దనుండి చాలాకాలముగా నాకెట్టి జాబులు కూడ లేవు కదా! ఓ నాప్రియమైన జననీ! నిన్ను జూచుటకై నేనెంతయో తపించుచున్నాను. ఈపురమున నీదర్శనము నాకు తిరిగి ప్రాప్తించునా? నాప్రియ జనని యగు నిన్నెప్పుడు చూడగలుగుదును. ఓ నా యతిప్రియమైన జననీ! తండ్రీ! నేను నీకుమారుడను. అమ్మా! నీ పనికిమాలిన యీబిడ్డయందు నీవుచూపుచున్న ప్రేమ, వర్ణనాతీతముగదా. నేనెట్టి విధముగానైనను నీకు సేవ జేయజాలకున్నాను, నాయందింతయధిక ప్రేమను జూపుచున్నావుకదా. అమ్మా! నీఋణమును దీర్చుకొనలేనే! నాభావోద్రేకమును వెలిబుచ్చుటకు తగిన భాష కాని, మాటలుకాని, నాకు తెలియవు. అమ్మా! ప్రేమపూరితమైన, నీయుపన్యాసములను, నీపవిత్రచరణములవద్ద కూర్చొని, వినునప్పుడు నాయానంద మెట్లుండును!......

సదా నీబిడ్డయగు,

మణికారుడు.

శివభక్తులెందరో హరనాథుడే సాక్షాత్ సదాశివుడని విశ్వసించుచున్నారు. అట్టివారికి, "నేను సదాశివుడ" నని జెప్పుచు, తన స్వరూపమును జూపించు చుండెను. మహాశివభక్తుడగు భోలానాథ్ మహాశయుడిట్టి శివస్వరూపమును గాంచి శ్రీ హరనాథనామ

స్మరణను గావించు చుండెను. శ్రీ గౌరాంగ భక్తులకు రావ్ సాహెబ్ సతీష్ చంద్ర బందోపాధ్యాయ, ఉర్ఫే, మున్నగువారు శ్రీ హరనాథుడే శ్రీ గౌరాంగుడని, నొక యద్భుత స్వరూప దర్శనమువలన తెలుసుకొనగలిగిన వృత్తాంత మంతయు ముందు ముందు సవిస్తారముగా ప్రచురింపబడును.

"నేనే సర్వమునై యున్నాను" యను శ్రీ హరనాథ మహా వాక్యమును మరువకుడి.

"శివునికంటె, విష్ణువే హెచ్చు, విష్ణుకంటె శివుడే హెచ్చు, వీరిద్దరికంటె కాళిమాతయే హెచ్చు, అందరికంటెను శ్రీ కృష్ణుడే హెచ్చు." అనుచు, నేడు ప్రజలు వివిధములగు తెగలుగా చీలిపోయి తుదకెవ్వరునుకూడ భగవానుని దర్శింపజాలకున్నారు. ఇట్టి వ్యత్యాస భావములును, మత క్రోధములును, పూర్తిగా నశించి, విశ్వప్రేమను బడయువరకు, భగవానుని దర్శించుట దుస్సాధ్యము, దుర్ఘటము, యగుటయేగాక కోట్లకొలది జన్మములకైనను నతనిని తెలిసికొనుట దుర్లభమగును. సర్వమత సామరస్యమును దీసుకొని వచ్చుటకే ప్రభువు యిప్పుడు హరనాథుడుగా యవతరించెను. సర్వమత సామరస్యబీజములను వేలకు వేలు జీవుల హృదయములలో తానే స్వయముగానాటెను. క్రమక్రమముగా నీ బీజములనుండి లక్షలకొలది బీజములుత్పత్తియగును. శ్రీ హరనాథుని మహా వాక్యములలో నొకటిగమనింపుడి:—

"Without Self-denial, universal Love can never arise and without universal Love, Devine Love is impossible."

Haranath

"నేను" "నాది" యను భావము నశించిన కాని విశ్వప్రేమ యలవడదు. విశ్వమునంతయును ప్రేమింపగల్గు శక్తి జనించినకాని భగవానుని ప్రేమింపగల్గుట దుస్సాధ్యము. హరనాథ్.

శ్రీ కుసుమహరనాథాయనమః.

# శ్రీహరనాథావతారము

2 వ అ ధ్యా య ము.

## శ్రీ హర నాథుని సం దేశ ములు.



శ్రీహరనాథుని సందేశములు, భక్తులతో జెప్పిన వాక్యములు, భక్తులకు వ్రాసిన లేఖల సారాంశములు.

"What I was once is beyond the reach of imagination. To any others it is a sealed book, but undoubtedly verv great is your power since you attract me from a great distance."

Haranath.

"మీ యందరి సమక్షమున నిట్లు కాన్పించుటకు ముందు నేనెట్టి స్థితి యందుంటినో గ్రహింప శక్యము గాదు. నాకు తప్ప తదితరు లెవ్వరికైనను ఈ విషయము సీలు వేయబడిన యొక గ్రంథము వంటిదగును. (అనగా నగమ్యమగు విషయము) గాని యట్టి యున్నతమగు ధామము నుండి నన్నిచ్చటి కాకర్షింప గలిగిన మీశక్తి చాల యుత్కృష్టమైనది." (అనగా విశేష పాపముల నార్జించి యంధకారమున నుండుటయే "మన శక్తి" యని. పండితాగ్రేసరుల వ్యాఖ్యానము.) హరనాథ్.

"My play has neither beginning nor end and is moving on uniformally for ever, never goes out of line and on human effort can make it serve. As it has proceeded it is proceeding and so will it proceed."

Haranath.

"నా లీల ఆద్యంతములు లేనిదై ఒకే వేగములో సర్వకాలముల యందును జరుగుచున్నది. దీనిని మార్గమునుండి తప్పించుట కెట్టి మానవ యత్నమైనను నిష్ప్రయోజన మగును. ఇంతవరకును యెట్లు జరిగియుండెనో ఇప్పుడును నట్లే జరుగుచున్నది. ఇకముందు గూడ నదే విధముగ జరిగితీరవలెను." హరనాథ్.

"I only know what I am. Verily, do I say that it is im possible for others to know me as well as I know myself. even there are no means to know me. Can any one know and realise by thinking that which is beyond the realm of thinking. Therefore do I say mark well what I say abont myself. I have come to play only and shall play for ever. Everything of this universe is mine and I myself one of everything. The whole universe is encompassed by this play.

Even by mistake do not once try to find out the end of this play. Again and again shall I come in this world, thus shall we meet together again, shall we change the scene and commence again a new play. There are endless plays.

Haranath

జూలై 1925 సం॥ పూరీ జన్మోత్సవసందర్భమున ప్రపంచమున కొసంగిన ప్రకటన.

"నే నెవరినో నాకే తెలియును. నన్ను పూర్తిగా తెలుసు కొనుట, కితరు లెవ్వరికిని గూడ, శక్యముగాదు. ఊహాతీతమైన దానిని ఎంతయోచించినను, తెలుసుకొను టెవ్వరికైనను శక్యమగునా? గనుక నావిషయమై నేజెప్పునది బాగుగా గమనింపుడు.

నే నీలోకమునకు కేవలము ఆడుకొనుటకే వచ్చితిని. (ఎట్టి కార్యబాధ్యతయును గాని. ఎట్టి కర్మయును గాని. తనకు లేదని దీనిభావము) సర్వకాలములయందును యాడుకొనుటయే నా ఇచ్ఛ. ఈ ప్రపంచమునకు మరల మరల నే నింకను వత్తును. అప్పుడు మన మందరమును చేరి యాడుకొనెదము. (మహాప్రభువు, విశ్వమోహన లీలామయుడగుటచే ప్రతి యవతారములోను యంతకు పూర్వము చూపని నూతన లీలలు జూపుచు తన యనుచరుల నానందసాగరమున నోలాడించుచుందు నని తన భవిష్యత్ యవ

తారములను గూర్చి చెప్పుచున్నాడు.) ఇట్లు అనంతమగు యాట లున్నవి. (అవతారములే యనంతముగా నున్నప్పుడు లీలలెన్ని విధ ములుగా నెంత యద్భుతముగా, నుండునో, ఊహాతీతము.)

"హరనాథ్"

(పూరీ జన్మోత్సవదినమున జూలై 1925 సం॥న ప్రపంచమున కొసంగిన ప్రకటనలోని కొంతభాగము.)

"Listsn to a secret. I have nothing to hide, to keep back. When I have allowed myself to be bound where then is the necessity for strings etc. When you have once caught hold of me, keep holding on, remembering this to be the play of the Lord. This objective universe is my stage to play upon. From the beginning of time 1 have been comming to play on this stage. But how much 'hide and seek still.' My life is but a great riddle!" Haranath

"ఇప్పుడొక రహస్యము చెప్పుచున్నాను వినుడి. నేను దాచ వలసిన దేమియును లేదు. నాయంతట నెనే కట్టుపడి నప్పుడు, (మీ హృదయములలో) యిక త్రాళ్లు మున్నగు వాటితో నేమి పని యున్నది?

(ప్రభువు మన హృదయములలో తాండవ మాడుచున్న పుడు మన హృదయాత్మ లాతని పాద పంకజములపై లగ్నమగును. ఆ క్షణము నుండియు ప్రాకృత వాసన లేవియు మనకంట నేరవు. సుల భముగా తరింపగలము. కాబట్టి తపస్సులు, యోగములు, యజ్ఞాదు లనెడు త్రాళ్లు ఎంత మాత్రమును అవసరము లేదని ప్రభువు చెప్పుచున్నాడు.)

నే నొకసారి మీకు చిక్కితినేని యిది యంతయు ప్రభులీలయే ప్రభుకృపయే యని విశ్వసించి నన్నట్లే మీ హృదయములలో నిలుపు కొనుడి. ఈ బ్రహ్మాండ మంతయును నా యాటలకై నిర్మింపబడిన

నాటకరంగము. దీనిపై నాడుటకు నేననాదినుండియు వచ్చుచునే యున్నాను. ఇంకను దాగుడుమూత లెన్నియో కలవు. నాజీవిత మొక సమస్య"
హరనాథ్.

(ప్రభువు తన భగవతత్వమును తెలుపుచు పలికిన మహావాక్యములు.)

శ్రీహరనాథ తత్వ ప్రచారిణీ సభవారికి, ప్రభు వాక సారిట్లు చెప్పినట్లు "హరనాథస్మృతి" 1 వ భాగము, నందు (బెంగాలి భాషలో) ప్రచురింపబడియున్నది.

(1) "At present I am the Incaranation of krupa. I do not make any distinction between the Rasik and the Arasik, Yogya and Ayogya."

Haranath

"ఈసారి నేను కేవలము కృపావతారముగా వచ్చియున్నాను. వీడు రశికుడనియు, వాడు అరశికుడనియు, లేక వీడు యోగ్యుడనియు, వాడు అయోగ్యుడనియు, భేదములను పాటింపను. పూర్ణహృదయములతో నన్నెవరు కోరెదరో వారిపై నాకృప వెంటనే ప్రసరించుచుండును."
హరనాథ్.

(2) "you are the birds of the forest but I am the hunter. Where will you go away! I will catch hold of you wherever you may be."

Haranath

"మీ రందరును యరణ్యము సందలి పక్షులు నే నందలి వేటకాడను. మీ రెచ్చటికి పారిపోయెదరు? మీరెచ్చట దాగుకొని యున్నను నేను పట్టుకొని తీరెదను."
హరనాథ్.

ప్రభూజీవితము చదివినచో యెట్టి చిత్రవిచిత్రముగా వివిధభక్తులను, వివిధ మతములవారిని తానాకర్షించి, వారి హృదయములను ద్రవీభూత మొనర్చి తనపాదపంకజముల యొద్దకు దెచ్చెనో తెలియును.

(3) "Narada got his Siddhi from his harp. The gopinis got their salvation from Krishna's flute and your salvation is got from my pen." Haranath.

"తన తంబురావలన నారదునకు సిద్ధికలిగెను. కృష్ణుని వేణువు వలన గోపికలకు మోక్షము కలిగెను. నా కలమువలన మీకు మోక్షము సంప్రాప్తించును." హరనాథ్.

ప్రభు లేఖ లసంఖ్యాకములుగా నున్నవి. శైబల్యినీ దేవి తనకు ప్రభువు వ్రాసిన లేఖను చదువుచు స్పృహదప్పి పడిపోయి భగవత్ ప్రేమలో మునిగిపోయెను. బొమాన్జీ (పార్శీ భక్తుడు) గారి భార్య తనకు ప్రభువు వ్రాసిన యొకలేఖను చదివి ముగించులోపల మహా భక్తురాలై తన మతమును కూడ విసర్జించి, ప్రభుహరనాథుని పదముల వైపున కాకర్షింపబడి మహాభక్తురాలుగా నున్నది. భగవాన్‌దాసు డొక్క యుత్తరమును చదివి తాను వల్లభాచార్య సాంప్రదాయకుడైనను, నేటి వరకును, ప్రభు హరనాథుని పరమ పవిత్ర నామామృతమునే గ్రోలుచు న్నాడు, తన లేఖలతో బాటు ఎట్టి మహాశక్తిని వదలుచుండునో యూహాతీతమైన సమస్య. కేవలము వేణునాథములోనే శక్తి లేదు. శ్రీకృష్ణుడానాదముతో బంపు ప్రేమ వాహినిలోనే యాశక్తియున్నది. అట్లే శ్రీహరనాథుని లేఖలను గమనించవలయును. ఒక్కొక్క వ్యక్తి కొక్కొక్క విధముగా వ్రాయుచుండెను.

(4) "In Krishna's flute there were holes and sound, But in my pen there are no such holes or any sound, yet how it charms you!?" Haranath.

"కృష్ణుని వేణువునకు రంధ్రములును శబ్దమునుకూడ యుండెడివి కాని నాకలమునకు రంధ్రములు గాని శబ్దముగాని లేవు. అయినను మీ హృదయముల నెట్లు రంజింప జేయుచున్నది?" [ప్రభువవద్ద నుండి

జాబు లేమియును లేనందున శైబలినీదేవి రాత్రియంతయు నేడ్చుచు యుదయమునసే తిరుగ టెలిగ్రామ్ (Reply paid Telegram) యిచ్చె నని యనేకులకు తెలిసిన విషయమే. ఇవాన్స్ దొరగారు రాత్రి 12 ఘంటల వరకును యేడ్చుచు జవాబు యియ్యవలసిన దని లేఖను వ్రాసిరి. ఈ లేఖ మాయొద్దనున్నది. ఈ గ్రంథములో నిట్టిలేఖలు ప్రచురింపబడినవి.]

బరంపురములో నున్న కామేశ్వరీభాయిగారి నుద్దేశించి యొక జాబులో సత్యనారాయణరావుగారికి ప్రభు విట్లువ్రాసెను.

(5). "Tell my dear mother, that she is always mine, and will be mine in my every Incarnation" Haranath.

"నా ప్రతి యవతారములోను కూడ నామెనాతోడనే యుండి యున్నదనియు, భవిష్యదవతారములలో కూడ ఆమె నాయదియే యనియు, నాప్రియమైన తల్లితో జెప్పుము." హరనాద్.

మరియొకప్పుడు రావుగారి కిట్లు ప్రభువు జాబువ్రాసెను.

(6) "Tell my dear mother that her naughty and playful Gopal is doing well. Let her not be anxious for him."
Haranath.

"తుంటరివాడును, ఆటలనే ప్రేమించు నట్టియును, నగు తన గోపాలుడు క్షేమముగానే యున్నాడని నా ప్రియమైన తల్లితో జెప్పుము. వాని కొరకై యేమియును నాతురత పడవలదని యామెతో జెప్పుము." హరనాద్.

వేరొక జాబులో రావుగారి కిట్లు ప్రభువు వ్రాసియుండెను.

(7) "Tell my dear mother, that I am always with her. Tell her not to be anxious about her Hara-Gopal."
Haranath.

"నేను సదా యామె చెంతనే యున్నానని, నాప్రియ జననితో జెప్పుడు. తన హరగోపాలుని క్షేమమును గురించి యాతురతపడవల దని యామెతో జెప్పుము." హరనాద్.

(8) "You are all my persons. I have gathered you all, just as a student revises his books before an examination so am I revising you all from many births."

Haranath.

"మీరందరును నాస్వంతజనులు. మిమ్మందరను నేను ప్రోవు జేసుకొంటిని. పరీక్షయందు విద్యార్థి యెట్లు తన గ్రంథముల నన్నిటిని పునరావలోకనము చేయునో, యట్లే పెక్కుజన్మములనుండి మిమ్మందరను నే నవలోకించుచున్నాను."

హరనాద్.

(9) "I have not come with any mission from anyone. Mine but a self-imposed mission."

Haranath.

"నేనెవరి వద్దనుండి కాని, సందేశమును తీసుకొని వచ్చి మీకెరింగించుటకు రాలేదు. మీతో యాడుకొనుటకును, నాస్వరూపాదులను మీకు తెలియజేయుటకును మాత్రమే వచ్చియున్నవాడను."

హరనాద్.

(10) "For one who is far off, you must call aloud. For one who is near, you must whisper, but for one who is always in your own heart it is enough if you only think of him. Therefore, do I say, be not anxious that your letter may not have reached me."

Haranath.

"దూరముగానున్న వానిని పిలుచుటకై బిగ్గరగా యరువవలయును. దగ్గరగానున్న వానివిషయములో మెల్లగా పిలచిన చాలును. కాని సదా నీహృదయమందే వసించు వానిని పిలచుటకై మనసా స్మరించినచో చాలునుకదా. కనుక నీజాబులు నాకు సరిగా యందునో లేదేమోయను, యాందోళన నీకేల."

హరనాద్.

(11) "Letters are mere formalities. I am always with you only. Therefore be not anxious if there is some delay in your receiving my letters."

Haranath.

"జాబులు కేవలము లాంఛనములు వంటివే. నేను సదా నీ వద్దనే యున్నాను. కాబట్టి నాజవాబులు నీకందుటలో కొంత యాలస్య మైనను, నీకేమియును యాందోళన మవసరము లేదు." హరనాద్.

(12) "If you have accepted me as your Father do not ask me this and that. I will give you everything that is good for you without ever being asked by you." Haranath.

"నన్ను నీవు తండ్రిగా స్వీకరించినచో, నన్నేమియును కోర నవసరము లేదు. నీ కేది మేలు సేయునో, దానిని నీవు కోర నప్పటికిని నేను లభింప జేసెద నని తెలుసు కొనుము." హరనాద్.

(13) "They do not belong to the inner circle, who set their minds thinking about my disappearances." Haranath.

"నా నిర్వాణానంతరము మిమ్ములవిడిచి యెచ్చటకో పోయితి నని, యెవరు భావించు చుందురో, యట్టివారు నాయాంతరంగికులు కానేరరు." హరనాద్.

[1925 సం॥లోనిచ్చిన సందేశములోని కొన్ని వాక్యములు.]

(14) "Wherever my Name is sung, there I am." Haranath.

"నా నామ మెచ్చట స్మరింప బడుచున్నదో, యచ్చటనే, నేను వసించువాడను." హరనాద్.

(15) "You will realise after I pass away, what potency lies in the Name "Haranath." Haranath.

"హరనాథ యను నామములో నెట్టిశక్తి యుంచబడినదో నా నిర్యాణానంతరము మీాకే యనుభవము వలన తెలియగలదు."

(16) "Dears, you cannot conceive from what stupendous height, I have now descended for your sake. Except you, I have none else to think of. The price I paid to get you is indeed very very heavy. Even if you shun me, or forsake me altogether, I can't afford to forget or lose you. I can't remain without you, you are all mine. You can't realise how dear and valuable you are all, to my eyes." Haranath.

"నా ప్రియులారా! నే నెట్టిమహోన్నత స్థితినుండి మీకొరకై ఇచ్చుటకు వచ్చియున్నానో, మీరూహింపజాలరు. నాకు స్మరించుటకు మీరుదప్ప ఇంకెవరును గాని లేరనియే తెలుసుకొనుడి. మిమ్ము నావద్దకు దెచ్చుటకై యత్యధికమగు నష్టమును నేను జూపించితిని. నన్ను మీరు నిరాకరించినను లేక మరచినను గూడ మిమ్ము నేనెంత మాత్రమును మరచియుండ జాలను. మిమ్ము విడచి, నేనుండజాలను. మీరందరును నాస్వజనులు. మీరందరును నాదృష్టికెంత ప్రియులో యెంతటిముఖ్యులుగా పరిగణింపబడుచున్నారో, మీరూహింపజాలరు."

హరనాద్.

(17) "Know that this body which you now see is not woman born. If it had been so, it would have been shattered into atoms long ago, with the sins of others that it is made to bear." Haranath.

"మీరిప్పుడు జూచుచున్న నాశరీరము, యోనిజనితమైనది కాదని, బాగుగా యెరుంగుడి. ఇది మాతృజనితమైనట్టిదియే మైనచో, నిది భరించుచున్న, యితరుల పాపసందోహ భారముచే నిదివరకే తునకలుగా చీలిపోయి యుండెడిది.'' హరనాద్.

జ్యోతిష్ చంద్రవిశ్వాస్ బి. యే. బి. యల్. (కలకత్తా) అను భక్తు డొకసారిట్లు ప్రభువు, 54 మనిక్టలా గృహమందు చెప్పు చుండగా, విని మాకు తెలియ బరచుచున్నారు.

(18) "This body which you now see belongs to the Lord. The person you are now calling as Haranath is no other than He." Haranath.

మీరుప్పుడు జూచుచున్న ఈశరీరము భగవానుసిదే. మీచే "హరనాథ" యని పిలువ బడుచున్న వాడాతడే యని తెలుసుకొనుడి.

ఒక అంతరంగిక భక్తునకు ప్రభువిట్లొకసారి తన స్వరూపమును గురించి చెప్పెను.

(19) "400 years back I came here as Gouranga. Now you see me as Haranath. Endless are my plays and such is charmming in its own way" Haranath.

"400 సం॥ల క్రిందట గౌరాంగనామముతో నేను వచ్చితిని. ఇప్పుడు హరనాథునిగా నీవు నన్ను చూచుచున్నావు. నాయాటలనంతములుగానున్నవి. దేనికదియే హృదయరంజకముగా నుండును.''

హరనాద్.

(20) "Surrender yourself to me, and see if I can save you or not" Haranath

"నీ శరీరాత్మలను నాకర్పించి, నిన్ను రక్షింపగలనో లేదో చూడుము." హరనాద్.

అరారియా గ్రామ వాస్తవ్యులగు జ్యోతిర్మయ బంధోపాధ్యాయ యను భక్తు డొకసారి సోనాముఖి వెళ్ళెను. ఆ దినమున చంద్రగ్రహణ మగుటచే జనులందరును స్నానము చేయుటకు బోవుచుండిరి. ఇతని కాదినమున శరీరారోగ్యము సరిగా లేనందున స్నానముచేయుట కిష్టపడలేదు. కాని స్నానమాచరింపని కారణమున తనకు అశుద్ధి చేకూరునని యోచించు చుండగా కుసుమకుమారీదేవి యచ్చటకు నచ్చి:—

(21) "నాయనా! యిప్పుడు నీకేమియు నష్టములేదు. ఎవ్వని పరమపవిత్రపాదములనుండి వచ్చుటచే గంగానదికి పవిత్రత కల్గెనో యట్టి శ్రీమహావిష్ణువు యిచ్చట నుండగా నీకేల ? ఆయన పాదములను తాకినచో నీ సర్వకల్మషములును హరించునని తెలియదా!'' యని చెప్పినతోడనే నరలీలలు జూపుచున్న సాక్షాత్ భగవంతు డగు శ్రీహరనాథచంద్రుని సమీపించి యాతని పాదములపై బడెను.

సాక్షాత్ జగన్మాతయగు కుసుమకుమారీదేవి నుడివిన పలుకులు శ్రీహరుని పల్కులవలెనే గమనింప వలసియున్నది.

రాధానగరములో ప్రభువిచ్చిన సందేశవాక్యములను గమనింతము:—

(22) "I can meet East and West and prepare very sweet essence out of the combination." Haranath.

"నేను ప్రాక్పశ్చిమముల నేకముజేయగలను. అందుండి యతి మధుర రసము నుత్పన్నము చేయగలను." హరనాద్.

(23) "Krishna played with the Hindus. Christ played with some. Buddha played with some more. Now Haranath has begun to play with people of all religions, creeds, sects in the world." Haranath.

"కృష్ణుడు కొందరి హిందువులతో గ్రీడించినాడు. క్రైస్తు వే తెంచి కొందరితో కేళిసల్పినాడు. బుద్ధుడే తెంచి మరికొందరితో విహరించినాడు. ఇప్పుడు హరనాథుడు సర్వమత సర్వజాతులవారి తోడను యాడుకొనుటకు ప్రారంభించెను." హరనాద్.

(వివిధ మత జాతులవారు ప్రభు పాదములయొద్ద కాకర్షింపబడిరని శ్రీహరనాథుని జీవితమునుబట్టి చదువరులకు ముందు ముందు తెలియగలదు.)

గౌర్ దాస్ యను భక్తునకు ప్రభువిట్లొకసారి చెప్పెను:—

(24) "ఈ ప్రపంచమునకు నే నెందులకు వచ్చియుంటినో నీ వెన్నడును నెరుఁగజాలవు. ఇప్పుడీ ప్రపంచమున మాత్రమే నేనుంటినని యు, యితర ప్రపంచములలో వ్యవహరించుట లేదనియు జెప్పువా డెవ్వడు? ఏకకాలమున నే నితర ప్రపంచములందును నుండవచ్చును." హరనాద్.

(25) "I am ready to carry the burden of your sins. Tell all you come across to lay their respective burdens on my shoulders. Do not fear for, that with all your loads, I will go to hell. I have no dread for anything. I am devoid of fear, shame, honour, caste, religion etc." Haranath.

"మీ మీ పాపభారము లన్నియును మోయుటకు నేను సంసిద్ధుడను. నీకు కనబడిన వారందరి తోడను, వారి వారి భారములను, నాభుజములపై నిడుడని జెప్పుము. మీ పాపములను మోయుచుండు టచేత నాకు నరకము సంప్రాప్తించునని భయపడకుడి. నాకు దేని యందును భయమనునది లేదు. భయము, సిగ్గు, కులము, గౌరవము మతము యేవియును నన్నంట జాలవు." హరనాద్.

(26) "My powers are not the result of any kind of Sadhana on my part. They are inborn in me. At times I feel sick of my powers for they manifest themselves without any effort on my part." Haranath

"నా శక్తు లన్నియును, యెట్టి సాధనల వలనను చేకూరినవి కావు. స్వతస్సిద్ధముగా నవన్నియును నాలో యిమిడియున్నవి. అప్పు డప్పుడు నాశక్తులు నాకే విసుగుపుట్టించును. ఏమన యెట్టి స్వప్రయత్నముకాని లేనిదే ఈ శక్తులు వ్యక్తమగుచుండును." హరనాద్.

బెంగాలీదేశములో ప్రఖ్యాతిగాంచిన సంకీర్తనా పరుడగు గౌర్ దాస్ మహాశయుడు (కాష్ఠహారినిఘుట్టము.) మాన్ ఫిర్ వద్ద ప్రభువును దర్శించెను. జ్యోతిష్ చంద్రవిశ్వాస్, యడ్వకేటుగారును యీయన సోదరులగు రాయ్ బహద్దూర్ సతీష్ చంద్రవిశ్వాస్ (under-Secretary to the Govt. of India, Foreign and Political Dept. Simla) మున్నగువారు ప్రభువునకు చమురురాచి నలుగు పెట్టుచుండిరి. గౌవురుదాసుడు ప్రభువును జూచి—

"తంత్రీ! నీవొక సిద్ధపురుషుడవని యెంచి నీకృప బడయుటకై యిచ్చుటకు నచ్చితిని. నన్ను గూడ నీవుద్ధరింపవలయును."

ప్రభువు దీర్ఘాలోచనా నిమగ్నుడై యుండెను. గౌర్ దాస్ తిరిగి "నీవు శిద్ధపురుషుడవు గాన నన్ను కాపాడగలవు" యని

చెప్పగా ప్రభుహరనాథుడు గార్‌దాస్‌ను జూచి

(27) "నాయనా ! నిన్నీ క్షణమునుండి యొకపూర్ణ సిద్ధపురుషు నిగా జేసినచో నీకు తృప్తి యగునా ? అట్లయిన చెప్పుము. నా ప్రతి చెమట బిందువునుండియు నసంఖ్యాకములగు సిద్ధపురుషులను నేను సృష్టింప గల్గినప్పుడు నీకు సర్వసిద్ధులును ప్రసాదించుటలో నేమున్నది ? నీకు కావలసిన దేదియో కోరుకొనవచ్చును." అని చెప్పెను.

గార్‌దాస్:—"ప్రభూ! నన్ను క్షమించుము. నీయద్భుతము లను యనేకులచే విని నీవొక సిద్ధపురుషుడవే యనుకొంటిని. కాని సిద్ధులను సృష్టింప గల్గు ప్రభువవని యనుకొనలేదు. అట్లయిన సర్వో త్కృష్టమగు భగవత్ ప్రేమనే నాకు ప్రసాదింపుము." వెంటనే గార్‌దాస్ హృదయము ద్రవీభూతమగుచుండెను! భగవత్ విరహము దుర్భరముగా నుండెను ! విశ్వప్రేమరసమును గ్రోలుట మొదలు పెట్టెను. ప్రభుపాదములను తన ఛాతీపై బెట్టుకొని "హే గోపాల్ ! ప్రేమస్వరూపా ! నీవే నాహృదయనాథుడ, వని తెలుసుకొన జాల నైతిని" యనుచు స్పృహలేక నేలపై వ్రాలెను ! అఖండమగు భగ వత్ ప్రేమానందమును గురించి చదువుటయేగాని యనుభవించుట కిదియే ప్రథమమని యాతడు చెప్పెను.

పాఠకులారా! సిద్ధులకు గల్గు శక్తులన్నియును ప్రకృతి మండ లములోనే పనిచేయగలవు. ఒక్క ప్రేమశక్తియే అప్రాకృత ధామ మునకు చేరినదియై జీవులను మాయా ప్రపంచములనుండి విముక్తులు గాజేసి అప్రాకృత ధామమునకు గొంపోవగలదు. ఇట్టి భగవత్ ప్రేమ ను భగవంతుడుదప్ప సిద్ధపురుషులు, యోగులు, దేవతలు మున్నగు వారు ప్రసాదింప జాలరని భాగవతమునందు వ్రాయబడినది. కనుకనే ప్రేమనాథు డనియు, ప్రేమలోలుడనియు, ప్రేమస్వరూపుడనియు, శ్రీ హరనాథు డనేకులచే నేడు స్తుతింప బడుచున్నాడు.

శ్రీహరనాథ మందిరములో నొకసారి ప్రభు సమక్షమున తన భక్తులాయనను స్తుతించుచు, ప్రార్థించుచు, సంకీర్తనము గావించు చుండగా హరిభాయి యను నొకపురుషుడిది యంతయు జూచి, "స్వామి! ఇదేమి? మిమ్ము వీరందరుచేరి భగవంతుని స్తుతించు విధము ననే స్తుతించుచున్నారు'' అనగా ప్రభువు పక, పక నవ్వి--

(28) "నాయనా! ఇందేమి యాశ్చర్యమున్నది? విష్ణుమందిర ములో నున్నపుడు విష్ణువును స్తుతించుచు గానము చేయుదురు. శివాల యములో నున్నపుడు సదాశివుని స్తుతించుచుందురు. మరియు గానము చేయుదురు. అట్లే హరనాథ మందిరములో హరనాథభక్తులగు వీరంద రును నన్ను స్తుతించుచు నా ప్రీత్యర్థము, గానముచేయుచున్నారు" అనిచెప్పెను. (బెంగాలీ హరనాథస్మృతి అనువాదము) పాఠకులారా! ఈభక్తుడు కొంతకాలము తరువాత శ్రీహరనాథభక్తుడై వేయి నోళ్లతో శ్రీహరనాథకీర్తనలు పాడుచుండెను!

(29.) "You simply carry my message of universal love to every door and leave the rest to me. I will choose my own flock."

Haranath.

"నా విశ్వప్రేమ సందేశమును ప్రతి గృహమునకును తీసికొని వెళ్లి తక్కిన పనియంతయు నాకు వదలివేయుము. నావారిని నేనే యెన్నుకొనెదను."

హరనాద్.

(30.) "This time I have not brought my sakti as it is not cumbent upon me to relieve the earth of its burden."

Haranath.

"ఈ యవతారమున నాకెట్టి దుష్టశిక్షణ కార్యక్రమముతోను పనిలేదు కావున భీభత్స స్వరూపియగు నాశక్తిని యిప్పుడు వ్యక్త పఱుచుటలేదు.''

హరనాద్.

(31) "Do not be anxious for any Public Mandirs in my name, know it well that a time will come, after my departure when millions of houses will be my mandirs."

Haranath.

"నా పేరుతో ఆలయములను కట్టింపవలయునని మీ రిప్పుడు తపింప నవసరము లేదు. లక్షలకొలది గృహములు నా మందిరము లగునట్టి కాలము నా నిర్యాణానాంతరమున రానున్నదని బాగుగా తెలిసికొనుడి." హరనాద్.

(సుమారు 30 వేల రూప్యములను ఖర్చుపెట్టి పూరి పట్టణములో హరనాథమందిరమును, అదే సంవత్సరము బృందావనములో మరియొక మందిరమును తనభక్తులు కట్టుచున్న కాలమందీ విధముగా వారికిచెప్పెను. అట్లు ప్రభువు చెప్పినను మందిరములు కట్టించబడెను.)

(32) "My inner and outer selves are different. Hence your difficulty in under-standing me. I am never simple and can never be." Haranath.

"నా అంతర్ బహిర్ తత్వములు వేరు వేరుగా నుండుటచేతనే నన్ను తెలిసికొనుటకై మీ కెంతయో కష్టమగుచున్నది. నా జీవితము సరళముగాను సులభగ్రాహ్యముగాను యుండదు. అట్లుండుటకు వీలులేదు." హరనాద్.

(సాధారణముగా శ్రీహరనాథుడు బాహ్యదృష్టికొక సామాన్య నరునివలెనే నటించుచుండెను. అంతరంగికుల సమక్షముననే తన భగవత్తత్వమును దాపక వెల్లడిచేయుచుండెను.) హరనాద్.

(33) "If I so wish even stones and sticks are bound to willingly repeat Harinam day and night."

Haranath.

"నేను సంకల్పించి నంత మాత్రముననే రాళ్లును, కర్రలును గూడ అహర్నిశలు హరనామస్మరణ చేయవలసినదే." హరనాద్.

(పూరి యాశ్రమములో ప్రభు యిచ్చ ననుసరించి ఒక వెదురు

బొంగు పూర్తిగా శిథిలమగు పర్యంతరమును హరినామస్మరణ గావించెను! ఈ యద్భుతము 1913 వ సం॥లో జరిగెను. ఆ వెదురు బొంగుయుండిన పవిత్ర స్థలమునందు స్మారకచిహ్నముగా నిపుడొక చిన్న రాతి కట్టడమును నిర్మింప యోచించుచున్నారు)

(34) "Once you surrender yourself to me without any self conceit, you will be made to feel my hand at every step. Verily do I say, that even death cannot snatch your life without my approval."

Haranath.

"గర్వమును పూర్తిగా వీడి నాకు సమర్పణయయిపోయినచో మీ జీవితమందలి ప్రతివిషయములోను నేను మీ వెంటనే యుండుట గమనించెదరు. నా యనుజ్ఞ లేనిదే మృత్యుదేవత కూడా మీ ప్రాణములను తాకజాలదని రూఢిగా విశ్వసింపుడి.'' హరనాద్.

పాఠకులారా? భౌతికశాస్త్రజ్ఞులీవిషయమును పూర్తిగా గ్రహింప జాలరు. ఈ విషయమును రుజువుచేయుచు యనేక ప్రత్యక్ష తార్కాణములను దిగువ నిచ్చుచున్నాము. మృత్యునోట పడిన వారు మృతి నొందిన వారుగూడ యెట్లు పునర్జీవులయిరో వారి ఆయుర్ధాయములు ప్రభువుచే (కొన్ని కారణాంతములనుబట్టి) యెట్లు వృద్ధిచేయబడినవో మున్నగు విషయములు క్లుప్తముగా నిచ్చుట నిచ్చితిమి. ఆయాభక్తుల చరిత్రల నిచ్చుచు విపులముగా ముందు ముందు వర్ణింపబడియున్నది.

(A) Br. Phani Kanta Mukhopadyaya Postmaster, Sri Ramapur, Bengal.

ఫణికాంత ముఖోపాధ్యాయుడు, శ్రీరామపురము పోష్టు మాష్టరుగారు 1933 వ సం॥ లో మృత్యునోటనుండి రక్షింపబడినవిషయము. కలకత్తాకు 10, 12 మైళ్లలో శ్రీరామపురము కలదు. 1933 సం॥

మేనెలలో సైపాయిడు జ్వరమువచ్చి యూపిరితిత్తులు రెండును అపాయస్థితిలో నున్నవి. అతడిట్లు మాకు తన యనుభవము తెలియజేయుచున్నారు, "నేను మరణ శయ్యపై నుంటిని. అతి కష్టముతో శ్వాశయాడుచున్నది. నా భార్య తల్లి మున్నగువారు దుఃఖమును ఆపుకొనలేక యేడ్చు చున్నట్లు నే నెరుంగుదును. తులసి తీర్థమును మాత్రము పోయుచున్నారు. నా జీవితేసుడును, మహాప్రభువును యగు శ్రీహరనాథుని స్మరించు చుంటిని. కొంతసేపటికి నా స్పృహాపోయినది. నా కంటికి నూతన దృశ్యములు గోచరించు చున్నవి. నలుగురు దీర్ఘకాయులు నావద్దకువచ్చి, "ఈ తనినే మనము తీసికొనిపోవలయును" అని చెప్పుచున్నారు. ఒక్కసారి "హరనాథా! రక్షింపుము" అని బెంగాలీలో కేకవేసితిని. ఎచ్చటనుండియో కాని శరవేగముతో ప్రభుహరనాథుడు వచ్చి నిలువబడెను. ఆదీర్ఘకాయులు భయభ్రాంతులతో మెచ్చటకో పోయిరి. ప్రభువు నన్ను జూచి, "నీవు నాకు చేయవలసిన సేవ యీలోకమున యింకను యున్నది. అంతవరకును నీకు మృత్యుభయముండదు. పొమ్ము" అని చెప్పెను, వెంటనే నాకు తిరగి యీప్రాపంచక చైతన్యము కలుగుచుండెను. నా శరీరముపైబడి మెవరో యేడ్చుట వినబడుచున్నది. కండ్లు తెరచినతోడనే యందరును యేడ్చుటమాని యాశ్చర్యముతో నన్ను సమీపించిరి."

(B) మరియొక తార్కాణ మిచ్చు చున్నాము.

Br. Bowani Charan Bose. Govt. Auditor, Delhi.

భవానీచరన్ బోసుగారు, డెల్లీ గవర్నమెంటు ఆడిటర్. ఈయనిప్పుడు కలకత్తాలో నున్నారు. వీరి వేతనము నెలకు (600 రూ. వీరిట్లు తెలియజేయుచున్నారు:—

"డిసెంబరు 1920 సం॥లో నేను డిల్లీలో పని చేయుచుంటిని టాంపూరాలో D. 116 ఇంటి నెంబరులో కాపురముంటిని. ఇన్స్పె

ఎంజా వచ్చుటచే చాల ప్రమాదస్థితిలో నుంటిని. సీనియరు డాక్టరు వచ్చి నిగ్రహించుట చాలకష్టమని రహస్యముగా చెప్పుచుండుట నేను గ్రహించితిని. రాత్రి సుమారు 9 గంటలకు విశేషబాధ పడుచుంటిని. ఈ బాధవలన నా దేవదేవుడగు శ్రీహరనాథుని కూడ మరచితిని. దీనదయాళుడగు యాతడు నావద్దనే యున్నాడను భావమే నాకు లేదు.

నా స్పృహ తప్పిపోయెను. నూతన నాదములును, దృశ్యములును, నాజ్ఞానేంద్రియములు గమనించు చుండెను. ఎవరో ముగ్గురు దీర్ఘకాయులు నావైపునకు వచ్చి, "మనకు కావలసిన వ్యక్తి యితడే" యని చెప్పుచుండిరి. భయ భ్రాంతులచే "హరనాథా" యని యరచితిని. వెంటనే గాలివిమాన శబ్దము వంటి ఒక శబ్దముతో ఎవరో వ్యక్తి నా వైపునకే వచ్చుచుండెను. అతడే శ్రీహరనాథుడు. వారి ముగ్గురను ప్రభువు జూచి వారితో నేమో చెప్పి యదృశ్యుడాయెను. "మనకు కావలసినవాడు ప్రక్క గృహము నందున్నాడు" యని చెప్పుకొనుచు వారదృశ్యులైరి.

నేను కండ్లు తెరువగానే రోదనముచేయుచు యందరును నన్ను చుట్టియుండిరి. నేను కండ్లు తెరువగానే వారు నిశ్శబ్దముగా నుండిరి. గడియారమును చూడగా రెండునిమిషములు తక్కువగా 11 ఘంటలాయెను. నా భార్యను మెల్లగా పిలచి,

"ప్రక్క గృహములో నెవరైన మరణశయ్యపై నున్నారా?" యని యడిగితిని. అప్పుడు నాభార్య "ఎవ్వరును లేరు. మిమ్ము జూచుటకై వారు యిచ్చటకు కూడ వచ్చియుండిరి" అని చెప్పెను.

అదేసమయమున D. 118 నెంబరు గృహములో నేడ్పులు వినబడుచుండెను. ఆ యింటిలోని యొక పురుషునికి గుండె యాగిపోయి యాకస్మికముగా నప్పుడే చనిపోయినట్లు వారు చెప్పిరి.

(C) ఆదూరి సత్యనారాయణగారు కాశీలో మృతినొందిన, కొన్నిఘంటల తరువాత ఆయన కళేబరమును తీసుకొనిపోవ ప్రయత్నించుచుండగా శ్రీహరనాథు డాయనకు ప్రాణదానము నిచ్చుట యనేకులకు తెలిసిన విషయమే. వీరి పూర్ణచరిత్రలు విపులముగా ముందు ముందు వ్రాయబడును.

D) మిద్నాపూర్‌లో యడ్వకేటుగానున్న శ్రీష్‌చంద్రదత్తుగారి సతీమణియగు తమాలినీమాయిగారి చరిత్ర, పై చరిత్రకులకంటెను యద్భుతముగా నుండును. ఆమెకూడ మృత్యువునోటనుండి ప్రభుహరనాథునిచే రక్షింపబడినది.

(E) Br. K. Suryanarayana Garu, S. L. D. General Stores, B. N. Ry. Kharagpur.

కె. సూర్యనారాయణగారు, జెనరల్ స్టోర్సు, ఖర్గపూర్.

ఈభక్తుడు తన ప్రత్యక్ష యనుభవ విశేషమును 10-12-1935, తేదిని శ్రీకాకొళంలో యీాదిగువవిధముగా ఉపన్యాస మొసంగిరి:—

"1935 సెప్టెంబర్ 26 తేదీని 2½ సం॥ వయసుగల నా మనుమరాలు, గుండెదడచే స్పృహదప్పి పడిపోయెను. కొలది నిమిషముల తరువాత ఆమెగుండె పూర్తిగా యాగిపోయెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములుగాని నాడి కొట్టుకొనుటగాని ఎట్టి ప్రాణచిహ్నములుగాని లేవు. అదేసమయమున ప్రభుహరనాథుని నిత్యపూజ చేయుటకొరకై నేను స్నానమాచరించుచుంటిని. ఈ విషయమును తెలుసుకొని వెంటనే పట్టువంచ మొలకు చుట్టుకొని చిన్నబిడ్డను నాచేతులలో వైచుకొని శ్రీ హరనాథుని పూజాగృహమున కేగి ప్రభు పటమువద్ద కూర్చొని పూర్ణపరితాపముతో హరనాథ ప్రభువునకు నా కష్టమునుగూర్చి చెప్పుకొని ఆబిడ్డచెవిలో "కుసుమహరనాథా" "కుసుమహరనాథా" అనుచు స్మరించు చుంటిని. కొన్ని నిమిషముల తరువాత

నాకుస్పృహదప్పి యట్లేకూర్చొని నాకు తెలివి వచ్చిన తరువాత చూచుకొనగా ఈ బిడ్డ నాయొడిలో మూత్ర విసర్జనజేసి వెంటనే కండ్లు తెరచెను!! కొలదినిమిషములలోనే తన తల్లియొద్దకు చిదానంద ముతో పోయెను. శ్రీమన్నారాయణుడగు శ్రీహరనాథప్రభువు ఈ కలియుగమునందు ప్రత్యక్ష భగవానుడై వేలకువేలు గృహములలో నేడు తాండవమాడుచున్నాడు సుమారు 19 సం॥ లవరకును నేను మరి యొక నామరూపముతో ఈశ్వరునకు పూజాదులు చేయుచున్నను నాకెట్టి విశేషములును జరిగియుండలేదు. భగవానుడు నామొర విని నట్లుతోచదు. అయితే కొలదికాలముమాత్రమే పూర్ణహృదయముతో శ్రీ కుసుమహరనాథ మహాప్రభువును భజియించినంత మాత్రముననే భగవానుడెన్నో విధములుగా ప్రసన్నుండగుచున్నాడు."

ఇంకను అనేక ప్రత్యక్ష తార్కాణములున్నవి.

(F) Br. Jotish Chandra Biswas B. A., B. L.,
No 25 Haldar Bagan Lane,
Shambazar, Calcutta.

జ్యోతిష్ చంద్రవిశ్వాస్ బి.ఏ., బి.యల్., గారు తమ యద్భుతానుభవము మాకిట్లెరింగించి యున్నారు:—

నవంబరు 1922 సం॥ లో ఆయన మృతి నొందుటయు శవము తలవైపున శ్రీహరనాథుని పటమును తనభార్య పెట్టుటయు ఈతడు సూక్ష్మలోకమున కేగిన వెంటనే సన్యాసివేషమున శ్రీహరనాథ మహాప్రభువు ప్రత్యక్షమై, జ్యోతీష్! నీవిప్పుడు చనిపోయితివని నీకు తెలయునా? అని ప్రశ్నించుటయును కొన్ని ప్రత్యేక కారణములను బట్టి ఈతనికి ప్రాణదానంబిచ్చుటయు, మున్నగు యద్భుత వృత్తాంతము పూర్తివివరములతో ముందు ముందు వ్రాయబడును: ఈతడొక అడ్వకేటుగా పనిచేయుచున్నారు. శ్రీ హరనాథునిపై తన

భారము లన్నియును వేయుటయును ప్రభుహరనాథుడీతని . కొసంగిన శోధనలు, (Tests) అట్టి శోధనల కీతడెట్లు యోర్చినదియు మున్నగు వివరములు కూడ వ్రాయబడును.

బ్రహ్మాది దేవతా గణములు శ్రీహరనాథుని సందర్శించుటయు ఆయన ఆజ్ఞలకు సదాబద్ధులై యుండినట్లును ప్రభువే తన యాంతరంగికులతో జెప్పియుండెను. కాబట్టి ప్రభుహరనాథుని తెలుసుకొనుటకు గాఢమగు ప్రేమయే కావలయును కాని మన తర్కమీమాంశములు కాదు. మనోతీతమగు విషయమును తర్కముచే నెట్లు తెలుసుకొన వీలగును.?

శ్రీ హరనాథచంద్రునిచే వారు మృత్యునోటనుండి రక్షింపబడి రని యెరుంగవలయును.

ఈ విధముగా ననేక తార్కాణము లియ్యగలము.

(35) "This is an age of spontaneous Love. I love you because it is my very nature to love. I wait not to weigh your merit or demerit." Haranath

"ఇది ధారాళమగు పవిత్రప్రేమ యుగము. ప్రేమించుటయే నాకు సహజము గనుక మిమ్మందరను నేను ప్రేమించుటకు కారణ మగుచున్నది. మీ యోగ్యతాయోగ్యతలను గమనింప వలయునని తలంచి నేను తడవు సేయను.'' హరనాద్.

(36) "For killing Ravana, Rama Avathar was necessary. For killing Kamsa, Krishna Avathar was necessary. For bearing your burdens of sins my Incarnation is necessary." Haranath.

"రావణుని చంపుట కొరకు రాముడు వచ్చియుండెను. కంసుని వధించుటకు కృష్ణుడు వచ్చియుండెను. మీ యందరి పాపభారములను నా భుజములపై బెట్టుకొనుటకై నేను వచ్చియున్నాను." హరనాద్.

(37) Love me a little and I will repay your love a thousand fold. Even if you do not love me I cannot but love you, for I know nothing but love.'' Haranath.

“నన్ను స్వల్పముగా ప్రేమింపుడి. వేయి మడుంగు లధికముగా మీ ప్రేమ ఋణమును దీర్చెదను. నన్ను మీరు ప్రేమించ కుండినను కూడ మిమ్ము నేను ప్రేమించక దప్పదు. ఏమన ప్రేమగాక నాకింకే మియును తెలియదు.'' హరనాథ్.

(38) “I feel inexpressible bliss in suffering for you all. Any Hell will be a Heaven of Heavens to me if from that spot, I can see you rolling in bliss in Brindaban.” Haranath.

“మీయందరి కొరకును నేను బాధపడుటలో ఊహాతీతమైన యానందమును పొందుదును. మీరు ప్రేమబృందావన ధామములో యానందసాగరమున నోలలాడుట జూచుచుండినచో ఎట్టి నరకమైనను నాకు స్వర్గమునకు స్వర్గలోకమువలె నుండును.'' హరనాథ్.

(39) “Dears! you are my everything. I remember you all with every birth of mine. Those that are heavily laden, and those that are miserable and those that want everlasting bliss come to me:—come to me!-; I know the way to brindaban. Surely can I take you over there.” Haranath.

“నా ప్రియులారా మీరే నాసర్వమునై యున్నారు. నా ప్రతి యూపిరితోడను మిమ్మందరిని నేను స్మరించుచున్నాను. విశేషభారములతో నున్నవారును ఉత్కృష్టబాధలు పడుచున్నవారును, శాశ్వత శాంతి గోరువారును నావద్దకు రండు. బృందావనము దారి నాకు తెలిసినదియే. మిమ్మచ్చటకు తప్పక గొంపోవగలను.'' హరనాథ్.

(40) pulling one you will get three, and these will be merged into one, and this one will again become two."
(Letters of Haranath Part II P 46)

"ఒకరు ముగ్గురుగా వ్యక్తమగును. వీరు ముగ్గురును తిరిగి ఒకనిగా మారును. తిరిగి ఈతడు యిద్దరుగ మారును." హరనాథ్.

వ్యాఖ్యానము:—ఒక్క శ్రీకృష్ణుడు గౌరాంగ అద్వైత నిత్యానందులుగా ముఫ్వురి రూపమున వ్యక్తమయ్యెను. తిరిగి వీరు ముఫ్వురును కలసి ఒక్కరూపమున శ్రీ హరనాథుడుగా కాన్పించిరి. తిరిగి యితడు (అనగా శ్రీహరనాథుడు) ఇద్దరుగా వ్యక్తమగును. (రాబోవు యవతారములో శ్రీ హరనాథుడు ఇద్దరు వ్యక్తులుగామారి తన యద్భుత లీలానాటకము నందలి మరియొక యంకమును ప్రదర్శింపబోవును. ఈ రహస్యము లన్నియును స్పష్టముగ మరియొక సందర్భములో ప్రభువుహరనాథుడే తన యాంతరంగ భక్తులకు తెలియ జేసెను.)

(41) You will bring one objeet, but as you pull on many wonderful mysteries will be opparent to you. As you pull on, you will find how many new unearthly things are fastened to it." Haranath.

"నీ వొకనిని నీ హృదయమునకు (ప్రేమ) పాశములచే కట్టు కొనుము. ఎంతదృఢముగా (ప్రేమ) పాశములు బిగువగు చుండునో అట్టి యద్భుత పరంపలు నీకు స్పష్టముగా గోచరించుచుండును. అప్రాకృతనూతనవ్యక్తు లనేకులీయొక్కని నుండియే వ్యక్తమగు చుండుట నీకు గోచరమగును." హరనాథ్.

వ్యాఖ్యానము:—తనను గూర్చియే పై విధముగా చెప్పియుండెను. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, శ్రీసదాశివుడు, కాళీమాత శ్రీ

శ్రీనరసింహము, శ్రీగౌరాంగుడు, మున్నగు పూర్వావతారములన్నియును, తానే యని చెప్పుటకుగాను పై స్వరూపములన్నింటిగాను, తాను మారిపోయి అంతరంగికభక్తులకు యద్భుతదర్శనములిచ్చెను. ఏభక్తున కేరూపమున దర్శన మిచ్చియుండెనో ఈగ్రంథములో ముందు ముందు వ్రాయబడును.

42. "When the Lord came here as Krishna, he had to steal butter (because Yasoda thinking him to be a simple human child would never give him butter enough for him and for his adherents) but now being transformed into me, He has so much butter daily offered to him that he can't utilise it all for himself. Therefore do I say, come to me to partake this Prashad left for you all by Krishna.

Krishna's touch and the saliva of his mouth give this Prashad life-sustaining-power and makes it so invigorating. Krishna is now physically distributing this life giving Prashad to you with his own hands."

Sri Haranath Tattwa P, 195-196.

"మున్ను కృష్ణుడిచ్చటకు వచ్చినప్పు డాతడు వెన్నను దొంగిలింప వలసి వచ్చినది. (సామాన్య బాలుడనుకొని యశోద కొలది వెన్న నే ఆయనకు పెట్టుటచే తనకును తనతోడి బాలురకును చాలకుండెడిది.) అయితే యిప్పుడాతడు, నారూపమున మారిపోయినదిలగాయితు అత్యధికముగా నవనీతము ప్రాప్తించు చున్నది. అతడుపయోగించుకొనుట కంత వెన్న అవసరములేదు. మీ యందరికొరకు శ్రీకృష్ణుడు విడిచియున్న ఈ మహాప్రసాదమును తినుటకై రండు. ఆయన దివ్యస్పర్శయును అధరామృతమును ఈ ప్రసాదమున కెంతయో జీవశక్తి నిచ్చియున్నవి. శ్రీకృష్ణుడు స్థూలరూపమున ఈ ప్రసాదమును తన స్వహస్తములతోనే మీకిచ్చుచున్నాడు. తీసుకొనుడి." హరనాథ్.

43. "I have come here to enjoy and enact the delightful play of a wedding chamber. If you unnecessarily increase the crowd I will vanish. Wait till I disappear. I will choose my own flock." Haranath.

"మనోహరమగు పడక గదియందలి ఆటను ఆడుచు ఆనందించుటకే నేనిచ్చటకు వచ్చితిని. విశేషముగా నటకుల సంఖ్యను వృద్ధిచేసితి రేని నేను మాయమై పోయెదను. నేను నిర్యాణ మగువరకును యాగుడి. నా నటకులను నేనే యెన్నుకొనెదను." హరనాథ్.

(ఎట్టి ప్రతిఫలాపేక్షయునులేక భగవత్ ప్రేమనే పరమానధిగా యెంచు జీవులే భగవానుని కెంతయో ఇష్టులు. ఏలోకమునకు జనినను భగవత్ సేవనే కోరుచుండెడి మహాత్ములు దుర్లభమని మున్ను కృష్ణునిగా వచ్చినప్పుడు కూడ అర్జునునితో జెప్పబడెను. ధర్మార్థ కామమోక్షములను నాలుగు పురుషార్థములుకూడ కామ్యములేయని తెలుసుకొనగల్గు వారే శ్రీ హరనాథునిచే నటకులుగా పరిగణింప బడుదురు. ఇట్టి జీవులకు భగవత్ ప్రేమ యొసంగబడును. తదితరులకు ఆతడు జూవునది కృప. అనేకులు సామాన్యముగా ప్రేమయే కృప యని పొరబడుచుండుట కలదు. భక్తుల సంఖ్య లక్షలకొలది యున్నను అందరును ఆయనకు అంతరంగికులు కారు. తన యాంతరంగికులతో ప్రేమరాస జరుపుచుండును. ఇతరులలో ననేకులు యేవో సహాయ్యములు సదా కోరుచుండుటచే వారికి భగనత్ ప్రేమవిరహము నొసంగక, తన కృపను జూపుచు వారికామ్యములను నెరవేర్చు చుండును. పైన జెప్పిన "నానటకులు" అనగా అంతరంగికులనియే అర్థము.)

44. "Everything of this unwerse is Mine, and I Myself am of everything as well. The whole universe is encompassed by my play. Even by mistake do not try to find out the end

of this play. Do not think you will be counted as an accomplished actor simply because you can act well in this one play only. When there are endless plays for Me I donot believe you can act well in all these plays. Be the most attached person of the head of these plays and you will be an accomplished player."

(From the Puri Janmotsab message 1925)

ఈ బ్రహ్మాండము నందలి దంతయును నాదియే. సర్వమును నాస్వరూపమే కాని మరియొకటి కాదు. ఈ బ్రహ్మాండమంతయును నాయాటతో నిండి యున్నది. బొరబాటునః కూడ ఈ యాటయొక్క తుదిని కనుగొనవలెనని ప్రయత్నింపకుడి. ఇప్పటి ఆటయందు మీ రెంత నిపుణతతో నటించినను మిమ్ములను మహానటకులుగా పరిగణించెదనని యూహింపకుడి. ఇట్టి యాటలు అసంఖ్యాకములుగా నేను ప్రదర్శింప నున్నప్పుడు ఇన్నింటిలోను కూడ మీరు బాగుగా నటింపగల్గుదురని యూహింపకుడి. ఈ యాటలకు నాథుడైన వానికి మీరత్యంత ప్రియులుగా నున్నచో ప్రతి యాటయందును మీరు నిపుణులుగా పరిగణింప బడుదురు.

(1925 పూరీ జన్మోత్సవ, ప్రపంచ సందేశమునుండి.)

పాఠకమహాశయులారా!

ఎందరెందరో మహాపురుషులు వచ్చియుండిరి. కాని తామే భగవదవతార మని, ధారాళముగా తమ యనుచరులకు చెప్పియుండలేదు. అట్లు ధారాళముగా చెప్పిన మహాపురుషులలో శ్రీకృష్ణుడొకడు కాన్పించు చున్నాడు. ఆయన తరువాత తిరిగి శ్రీహరనాథుడు కాన్పించు చున్నాడు. శ్రీ కృష్ణుడు తన యాంతరంగికుడగు అర్జునునితో తన భగవత్తత్వమును వెల్లడిచేసినట్లే శ్రీ హరనాథుడు తన యాంతరంగికులకు ధారాళముగా తానే సాక్షాత్ భగవానుడ

నని చెప్పుటయే గాక, 4, 5 ప్రపంచక సందేశములలో కూడ తాను భగవానుడ నని తెలియజేసియున్నట్లు మీకు ఋజువుచేయ బడినది.

ఇదిగాక శ్రీ హరనాథుని సమకాలికులగు సోంబారీ మహా ఋషి వంటి మహాపురుషులు, శిద్ధులు మున్నగు వారెంద రెందరో ఆయనను పూర్తిగా తెలుసుకొన జాలమని చెప్పియున్నట్లు మీరు ముందు ముందు చదువబోయెదరు. అవాఙ్మానస గోచరుండగు భగ వానుని తెలుసుకొనుటకుగాని ఆయన లీలామానుష రూపమును గుర్తిం చుటకుగాని కేవలము ప్రేమయే కావలయునుగాని మన శుష్కతర్క మీమాంసముకాని గ్రంథపఠన గాని శాస్త్రశబ్ద జ్ఞానముకాని నిష్ప్ర యోజనము.

శ్రీ కృష్ణుడు భగవానుడని ఆయన సమకాలికు లెందరు తెలుసుకొన గల్గిరి? దుర్యోధన శిశుపాలుర వంటి వారేగాక, ఎంద రెందరో పండితోత్తములుకూడ ఆయనను పరిహసింపలేదా? అది గాక ఏ బుద్ధుడవతార పురుషుడని మనము విశ్వసించు చున్నామో అట్టి బుద్ధుని యనుచరు లగువారు సుమారు అనేకవందల సం॥ల క్రిందట వ్రాసిన శూత్రిపికట మను గ్రంథములో శ్రీకృష్ణుడు అసురుడనికూడ వ్రాయసాహసించిరి! కాబట్టి భగవానుని తెలుసుకొనుటకు కేవలము నిశ్చల నిరాడంబర ప్రేమయే కావలయును గాని, మన శుష్కపాండి త్యము కాదని విశ్వసింపుడి. రేపేమి సంభవింప నున్నదో తెలుసు కొనలేని మనము సర్వసృష్టికిని అతీతుడైన పరమపురుషుని గుర్తింప శక్యమగునా? కనుకనే శ్రీహరనాథ ప్రభువు తనను గూర్చి తానేమి చెప్పుచున్నాడో గమనించి పూర్ణవిశ్వాసముతో ఆయన వాక్యము లను గ్రహించ వలయును. అట్లు గ్రహించి ఆయనకృపకై దీనముగా వేడుకొనినచో కొలదికాలములో దీనదయాళుడగు శ్రీహరనాథుడు, దేదీప్యమానమగు తన తేజోరూపమును మీకు సాక్షాత్కరింప

జేయును. ఈవిషమునకు లెక్కకుమిారిన తార్కాణము లున్నవి. అట్లు సాక్షాత్కరించిన పుణ్యజీవు లెందరో ఇప్పటికిని సజీవులై యున్నారు. అట్టి వారిచరిత్రలు కొన్నింటిని మాత్రమే ఈ రెండవ భాగమున ప్రచురించి యున్నాము.

నివృత్తి మార్గ ప్రయాణీకులకు "విశ్వాసమే ప్రతి. విశ్వాసమే రాజు! విశ్వాసమే సర్వస్వమని" భక్తకబీరు చెప్పినట్లు విశ్వాస మవసరము. స్వానుభవముపై జెప్పెడి పరమ భాగవతోత్తముల వాక్యముల యందు విశ్వాసముంచుట యవసరము. సోంబారీమహారాజ్ వంటి మహా పురుషుల వాక్యముల యందు విశ్వాస ముంచుటవసరము. మహాపతితులవలె సంచరించి ప్రభుహరనాథుని కృపావిశేషమున పరమభక్తులుగా మారిపోయిన పుణ్యజీవుల స్వానుభవ వృత్తాంతముల యందు విశ్వాసముంచుటవసరము. శ్రీ హరనాథుడే ఒకప్పుడిట్లు పలికి యుండెను.

45. "Hold fast with firm faith and everything will be revealed to you gradually." Haranath.

"పూర్ణ విశ్వాసము కలిగియుండుటవల్ల క్రమ క్రమముగా నీకు సర్వమును తెలియ జేయబడును." హరనాథ్.

వైద్యనాథ ముఖర్జీ యను మహాభక్తు డిట్లొక గ్రంథమున, వ్రాసియున్నారు:—

"Lord Haranath works in the field of the heart; He chooses His own flock and reveals Himself to them in time."

"ప్రభుహరనాథుడు (జీవుల) హృదయధామమునందే పనిచేయును. తనవారిని తానే యెన్నుకొని అట్టి వారికి క్రమ క్రమముగా తన స్వరూపమును కనబరచును."

నారాయణచంద్రఘోష్ అను మహాపండితుడొక గ్రంథమున నిట్లు వ్రాసెను.

"There are many to whom Haranath is revealed as the Lord in person! and there are others who having not got such good fortune but resting faith in others, to whom He is so revealed, worship Him in silence. Sri Hsranath is now seated in the throne of Vishnu and is receiving oblations from His devotees as the Lord. There are still alive some who saw with their own eyes a big bust of Sri Haranath in Grihi's dress hung up by some mysterious agency in one of the high turrets of the temple of Jagannath on its north-eastern face for nearly 3days together"

(Haranath Lilamrutam P. 101.)

"శ్రీహరనాథుడే ప్రభువు యని, అనేకులకు సాక్షాత్కారమైనది. ఇట్టి భక్తుల స్వానుభవములను విశ్వసించి అనేకులు శ్రీహరనాథుని, పూజించుచున్నారు. మహావిష్ణు పీఠముపై ప్రభుహరనాథుని, నేడధిష్టింపజేసి భక్తజనులు పూజలు సల్పుచున్నారు. శ్రీహరనాథ ప్రభువు, అట్టి పూజాదుల నందుకొనుచున్నాడు. 1924 సం॥ జూలై నెలలో జగన్నాథాలయముపై, ఈశాన్య దిశయందొక మహత్తరమైన శ్రీహరనాథరూపము వరుసగా 3 దినములు కాన్పించెను! ఈ తేజోస్వరూపమును కండ్లార గాంచిన వారిలో కొందరింకను సజీవులై యున్నారు."

[హరనాథ లీలామృతము 101 పేజి.]

పాఠకులారా! పైనుదహరించిన గ్రంథము, శ్రీ హరనాథుని కాలములోనే ప్రచురింపబడి, ప్రభువునకు సమర్పింపబడినది. ఇట్టి గ్రంథమునందే పైవిధముగా వ్రాయబడినది.

శ్రీహరనాథుని చరిత్రమంతయును సమగ్రముగా తెలుసుకొనువరకును, ఆయన స్వరూపమును గూర్చి, మనయిచ్చవచ్చినట్లు భావించుట చాలపొరబాటేయగును. శాంతచిత్తము పూర్ణవిశ్వాసము కలిగి, భక్తిశ్రద్ధలతో శ్రీహరుని యత్యద్భుత చరితామృతమును గ్రోలెదముగాక! ఆయన కృపను సంపాదించి సులభముగా తరించెదముగాక!

శ్రీ కుసుమహారనాథాయనమః.

# శ్రీహారనాథావతారము

౩ వ అధ్యాయము.

## సుందరీదేవి పూర్వజన్మ వృత్తాంతము.

సర్వజ్ఞుడగు శ్రీహారనాథప్రభువు తన జనని యగు సుందరీదేవి పూర్వజన్మములో కనకలతాదేవి యను నామంబుతో 'జాంబునీ' యను గ్రామంబున మహా భక్తురాలుగానుండి శ్యామసుందరుని పూజించు చుండిన వృత్తాంతమును చెప్పి యుండెను. ఈ విషయమును గురించి హారనాథుని సోదరుడగు శివనారాయణగారికిన్ని, భాగవత్ చంద్రమిత్రుడను భక్తునికిన్ని జాబులుగూడ వ్రాసియుండెను. ఒక్క సుందరీదేవి పూర్వజన్మ వృత్తాంతమే గాక తన యాంతరంగిక భక్తులలోని కొందరి పూర్వజన్మ వృత్తాంతములను గూడ ప్రభుహారనాథుడిచ్చియున్నాడు. అట్టి భక్తుల నామముల నిచ్చుచున్నాము.

(1) టహార్ ప్రసాద్‌రాయిగారు, జమిందారు, ఖాజీబజారు, కటక్. వీరిప్పటికిని సజీవులై యున్నారు.

(2) రామ్ పాద ముఖర్జీ.

(3) హెూరుచంద్ర ఘోషు.

(4) రాణావల్లభసీలు.

(5) భగవత్ చంద్రమిత్రసు, హరనాథ హైస్కూలు, 78 బాగ్ బజారు వీథి, కలకత్తా.

(6) భక్తరామ్‌ఖాను (ఈత డిప్పుడు సంసారమును వదలి శ్రీహరనాథుని యనుజ్ఞను బడసి హిమాలయ ప్రాంతములలో యున్నాడు.

(7) కామేశ్వరీ విమలాదేవులు తమ పూర్వజన్మమున అక్కచెల్లెండ్రని మాత్రమే సూచింపబడి వీరిరువురకును తాత్కాలిక పూర్వజన్మజ్ఞానము నొసంగబడినదని "హరనాథలీలలు" అను పుస్తకమున సూచింపబడి యున్నది. తన సర్వజ్ఞతను గుఱించి సూచించు ప్రభుహరనాథుని మహావాక్యములను తిరిగి జ్ఞప్తికి తెచ్చుకొనెదముగాక:—

"పరీక్షకుముందు విద్యార్థి వివిధ పుస్తకములను పునర్విమర్శన జేసుకొనునట్లే అనేక జన్మపరంపరలనుండి మిమ్మందఱిని నేను పునరావలోకించుచున్నాను."

"నారూపము మీకు క్రొత్తదిగా కాన్పించుచున్నను నేను నిజముగా మీకందరకును నెంతయో పాతవాడను. మీరెవరును నాకు నూతనవ్యక్తు లెంతమాత్రమును కారని తెలుసుకొనుడి.

## కనకలతా దేవి చరిత్ర.

సోనాముఖీగ్రామమునకు సుమారు 8 మైళ్లు దూరమున "జాంబునీ" యను గ్రామము గలదు. క్రీ. శ. సుమారు 1000 సం॥న అచ్చట కనకలతాదేవి యను పరమ భక్తురాలుండెను. అత్యంత భక్తి శ్రద్ధలతో

నీమె శ్యామసుందర విగ్రహమును పూజించుచు శ్యామసుందరుడే తన కుమారుడను భావముతో భగవానుని వాత్సల్యప్రేమతో ప్రేమించు చుండెడిది. పాప మామె నిరుపేదరాలుగా నుండెను. ఆమె సర్వ స్వమును శ్యామసుందరునకు దారపోయుటచేత నామె యీ పేదస్థితికి వచ్చెను. ఆ గ్రామస్థులు నిత్యమును ఆమెకు ఒక మనిషికి దగినంత యా హారపదార్థముల నొసంగుచుండిరి. ఒక పాత్రలో వంటచేసి శ్యామ సుందరునకు నివేదించి మధ్యాహ్నము 2 ఘంటల కామె భుజించుచు తరువాత దినమంతయును ఉపవాసముండి హరినామస్మరణ జేసుకొను చుండెను. ఈప్రసాదము కొరకు నిత్యమును కొందరు వచ్చి యామె నడుగుచుండిరి. ఆమె భక్తి మహాత్మ్యమున నీప్రసాదమును భుజియించిన ప్రతిరోగియును పూర్ణారోగ్యమును బడయుచుండెను.

క్రమక్రమముగా నీ ప్రసాదమహాత్మ్య మీగ్రామ మంతటను వ్యాపించుటచే దినమునకు నూరుమంది వరకును జనులీప్రసాదమునకై నిరీక్షించుచు పూజా మందిరము వద్ద నిలువబడు చుండెడివారు. అదేమిచిత్రమో గాని, ఎందరకు ప్రసాదమిచ్చినను యా పాత్రలో నామెకు చాలినంత భోజనము మిగులుచుండెను! క్రమముగా దినము నకు 200-300 మంది అచ్చటకు వచ్చుచుండిరి. అందరకును ప్రసా దము పంచిబెట్టబడుచుండెను.

కనకలతాదేవి ఖ్యాతి, నలుదిక్కులును వ్యాపించుట మొదలు పెట్టెను. ఆమెకుమార్తెయును, అల్లుడును, జాంబునీ గ్రామమునకు 15 మైళ్లదూరముననున్న "లోగ్రామ్" అను గ్రామములో నివసించి యుండిరి. ఒక దినమున ప్రయాణమై, ఆమె అల్లుడును కుమార్తెయును జాంబునీగ్రామమునకువచ్చిరి. ఆసమయముననే కనకలతాదేవి తనయెడమ చేతితో పాత్రను బట్టుకొని, కుడిచేతితో ప్రసాదమును పంచుచుండెను. ఆమె శిరమున ముసుగు వేసియుండలేదు. అదేసమయమున తన

యల్లుని చూచెను. శిరముపై ముసుగులేని కారణమున నామె వెను కకు వెనుకకు నడచుచూ మందిరములోని కేగుటకై యోచించు చుండెను. అద్భుతము! శ్యామవర్ణముగల చిన్న చిన్న రెండుబాలుని చేతులు మాత్రమే ప్రత్యక్షమై యామెశిరముపై ముసుగువేయు చున్నవి. !! ఈదృశ్యము నందరును జూచిరి. అల్లుడుకూడా జూచెను. "రాధేశ్యామ్" "రాధేశ్యామ్" అను ధ్వనులు చెలరేగుచుండెను. అందరును నిర్వేరపోయి జూచుచుండిరి. అదేసమయమున నొక బాలుని కంఠము వినవచ్చినది. "అమ్మా" నీభక్తికెంతయో మెచ్చి తిని. నీహృదయమందలి కోరికను తప్పక నెరవేర్చెదను. కాని ఈ జన్మమునకాదు. నన్నుపెంచి పోషించుచు నాప్రేమకు పాత్రురాల వగు ధన్యత నీకు ముందుజన్మమున సిద్ధించును." అని యొక బాలుని కంఠధ్వనిమాత్రమే వినిపించెను. భక్తిపారవశ్యముచే నామె యీలోక మునే మరచిపోయెను. సమీపమునయున్న చెరువుయొద్దకు పోయెను. ఆ నీటినిజూచి "గోపాల్! నిన్ను విడిచియుండజాలను." అనుచు చెరు వులోబడి ప్రాణములను వదలెను! ఆచెఱువిప్పటికిని "కనకలతా పుష్కరిణి" అను నామముతో పిలువబడుచున్నదని చదువరులు తెలుసుకొనెదరుగాక. యీ కనకలతాదేవియే తిరిగి భగవతీ సుందరీ దేవిగా జన్మించెను.

**—: శ్రీ హరనాథవంశావళి—శ్యామసుందర విగ్రహములు:—**

కనకలతాదేవి మృతినొందిన తరువాత యామె పూజించుచున్న శ్యామసుందర విగ్రహములు ఆమె సోదరి కుమారుడగు శ్రీగర్భుని కియ్యబడెను. శ్రీగర్భుని మరణాంతర మాతని కుమారుడగు గౌరీ కాంతుడే విగ్రహములను సేవించుచుండెను. ఇట్లొకని మరణాంతర మాతని కుమారుడు సేవించుచుండెను గౌరీకాంతుని కుమారుడు చాందీదాస్. ఈయన కుమారుడు విశ్వేశ్వరుడు. ఈయన కుమారుడు

బలరామ్. ఈయన కుమారుడు హరిహరుడు వీని కుమారుడు జగన్నాథుడు. వీని కుమారుడు రాఘవచక్రవర్తి. ఈయన కుమారుడు గోపీనాథుడు. ఈయన కుమారుడు రామేశ్వరుడు. ఈయన కుమారుడు మదనమోహనుడు. తరువాత పై విధముగానే గంగాధరుడును, పృథ్వీధరుడును, శీతానాథుడును, యోగీశ్వరుడును, రామచంద్రుడను కుంజవిహారియును, మదనగోపాలుడును, ఈయన కుమారుడగు శ్రీకాంతుడును సేవించుచుండెను. శ్రీకాంతుని కుమారుడే జయరామ్. జయరాముని భార్యయే భగవతీసుందరీదేవి, ఈమెయే కనకలతాదేవిగా నుండెడిది. గోలోకనాథుడును, సర్వజగదాధారుడును నగు శ్రీ హరనాథ మహాప్రభు వీమె నందనుడే.

ఆ శ్యామసుందర విగ్రహములు ప్రతి సంవత్సరమును, మే నెల నందొక మాసమువరకును స్వర్ణముఖిలో శ్రీహరనాథప్రభువు గృహమున పూజింపబడుచుండెను. ఒక గదియందు శ్రీ హరనాథమూర్తికి సేవ జరుపబడు చుండును. మరియొక గదిలో శ్యామసుందర విగ్రహములకు సేవ జరుపబడు చుండెను.

## పార్వతీపరమేశ్వరులు.

(జయరామునికి ప్రత్యక్షంబగుట.)

(ఈ విషయమంతయును నారాయణచంద్ర ఘోషుగారి వలన మాకు తెలియవచ్చినది.) జయరాముడే, గౌరీశంకరులు తనకు ప్రత్యక్షమగు చరిత్రను అనేకులకు జెప్పెను. ఇట్టి ప్రత్యక్షము తరువాతనే యాతడొక శివాలయమును గూడ నిర్మించెను. ఈ యాలయమునందుకూడ మహేశ్వరునకు నిత్యసేవ జరుపబడు చున్నది. శ్రీహరనాథు డవతరించుటకు కొన్ని సంవత్సరములకు పూర్వము జయ

రాముడు కలకత్తాలో లక్క వ్యాపారము జేయుచు తన్మూలమున వచ్చు లాభములో విశేష భాగము పేదసాదలకై వెచ్చించుచు యహర్నిశలు భగవన్నామ స్మరణజేయుచు మహాభక్తుడని సర్వులచేతను కొనియాడ బడుచుండెను.

ఒకప్పుడాయనకు మశూచివచ్చెను. ఇంద్రజాలమువలెనె బీభత్సరూపమునుదాల్చి మాటాడుటకుగూడ వీలుకాకుండు దుస్థితికాయనను తెచ్చెను. నిశరాత్రి సమయమున జయరాముని కత్యధిక బాధగానుండెను. దాహము పుట్టెను. దాహమని యరచుటకు గూడ వీలుకాకుండెను. పాశాపాయస్థితి వచ్చుచున్నదని యాతనికి తెలియుచుండెను. మృత్యుదేవత నోటిలో యాతడు పడుటకు సిద్ధమగానుండెను.

"హా! పరమేశ్వరా! నిన్ను భక్తితో కొలచుచు జీవించుచున్నందు కిదియా నాకుఫలము! నీవే నాకిప్పుడుదిక్కు" అనుచు పలు విధముల ప్రార్థించుచుండెను. ఆకస్మికముగా కన్నులు చెదరునట్టి మహాజ్యోతి స్వరూపములు రెండు కాన్పించెను. వారి తేజస్సులో నాగదియంతయును నిండిపోయెను. ఆ తేజోమూర్తు లిట్లు మాట్లాడు కొనుచుండిరి. "పార్వతి:-ప్రభూ ! పాపమీ జయరాముని రక్షింపుడు. మహాభక్తుడు. నిష్కళంకమగుజీవి. పరమేశ్వరుడు:_ఈత డెట్లు మృతినొందగలడు? కొలదికాలములో నేనీతనిపుత్రునిగా రావలసియుండగా నీతనికెట్లు మృత్యువు సంభవింపగలదు?" అని చెప్పుచు జయరాముని శిరమును తన హస్తముతో తాకెను. వెంటనే యాదివ్యసుందర తేజోమూర్తులు అదృశ్యులైరి. జయరాముని దాహమంతయు మాయమైపోయెను. ఒక విధమగు జీవశక్తి యాతని దేహమంతటను ధారాళముగా తాండవ మాడుచుండెను ! ఆ క్షణమునుండి జయరాముడు శివాలయమును కట్టించుటకై ధనమును కూడ బెట్టుచుండెను.

పాఠకులారా! భగవానుడు సర్వమతసామరస్యమును, దీసుకొని వచ్చి, విశ్వప్రేమను మానవుల హృదయములలో నంకురింప రాబోవ నుండెను. అట్టి సమ్మేళన, తానవతరింప బోవుగృహమున మొదట కలుగజేయ నుద్దేశించెను.

జయరామ్ సుందరీ దేవులిద్దరును, శివ, విష్ణు వ్యత్యాసభావము నెంతమాత్రమును పాటించియుండలేదు. భగవాను డొక్కడే అనియు జగతీక కార్యార్థమై వివిధ రూపములను గైకొని ఒక్కరూపమున కొన్ని కొన్ని శక్తులను వ్యక్తపరచుచు తక్కినశక్తులను అవ్యక్తము గానే యుంచుకొని ఈ జగత్ సామ్రాజ్యము నేలుచు అదేసమయమున జగత్తున కతీతుండై ప్రేమనామములో తన ప్రేమనే గ్రోలెడు జీవులతో ప్రేమరాసలోలుడనిపించుకొనుచు, ప్రేమానంద సాగరమున సదా ప్లవ్వ ళించి సర్వమునకును పరమ సాక్షిగానుండి విరాజిల్లు చున్నాడని విశ్వసించి నిశ్చింతగా భగవన్నామమును స్మరించుకొనుచుండిరి.

శ్రీహరనాథుని చరిత్ర పూర్తిగా చదివినచో వివిధ భగవత్ రూపములను యాతడు గనపరచి "సర్వమును నేనే అయియున్నాను. ఈ బ్రహ్మాండమంతయు నాదియే. నానుండియే యిది యుత్పత్తి అయినది. వీరందరును నాస్వజనులు. నాదొక మహాగహన జీవి తము. నామహాసమస్య ఎవ్వనికిని తెలియరాదు." అని స్పష్టముగా ప్రపంచమునకు సందేశముల నిచ్చియున్నాడు.

## మాయాగర్భము.

శ్రీహరనాథు డయోనిసంభూతుడు. సుందరీదేవి దాల్చిన గర్భము కేవలము మాయాగర్భమనియే సూక్షిగా విశ్వసింపవలయును. "ఈసమస్య భౌతికశాస్త్రవేత్తలెవ్వరికి కూడ తెలియనేరద"నియే నారాయణచంద్ర ఘోషుగారు జెప్పియున్నారు. సుందరీదేవికి నవ

మాసములును పూర్తిఅయిన పిదప భగవానుడే యొక సాధురూపమున సుందరీదేవి భోజనశాల కేతెంచి "అమ్మా! నీవు మధ్యాహ్నము వండిన పూరీలును కూరయును నాకు బెట్టుము" అని అడుగగా నామె "అయ్యా! మీరెవరు? స్త్రీలుండుగదిలోని కిట్లు ధైర్యముగా రాదగునా?" అని ప్రశ్నింపగా, నా మాయాసాధువు మహాతేజస్సును ప్రసరించుచుండు తనదృష్టి నామెపైపునకు మరలించి ,,అమ్మా! నే నిప్పుడు హిమాలయపర్వతములలో నున్న అమరనాథ్ నుండి వచ్చుచున్నాను. ఇది నాస్వంతగృహమే. నీవు నాజననివి" అని చెప్పెను. తరువాత ఈసాధువు మాయమైన వృత్తాంతము సంతయును శ్రీహరనాథస్మృతి మొదటిభాగమునందు చదివేయుందురు. కాబట్టి భగవానుడొక రూపమును దాల్చి జీవుల కగపడుటకై యాతనికొక గర్భవాస మెంతమాత్రమును యవసరములేదు. ఒకేసారి అనేక స్వరూపములను దాల్చి శ్రీహరనాథు డనేకస్థళములయందు తన భక్తులకు ప్రత్యక్షమగు చుండెనని ముందు ముందు పూర్తిగా తెలియ చేయబడి యున్నది. మరియు యిప్పటికిని శ్రీహరనాథుడు స్థూలశరీరముతో దర్సనమిచ్చుచున్నట్లు అనేక ప్రత్యక్ష తార్కాణములున్నవి. కాబట్టి ప్రభువొక క్షణమైనను గర్భమునందు లేడు. అతడొకమాయానాటకము నాడబోవుచుండుటచే తన నరలీల కెట్టి భంగమును కలుగనీయకుండుటకై సుందరీదేవి గర్భవతియైనట్లే తనసంకల్పముచే కనపరచియున్నాడు. శ్రీహరనాథుని మహావాక్యమును గ్రహింపుడు. ఒకసారి "శారీమా" కిట్లు వ్రాసెను. "అమ్మా! సుందరీదేవి కుమారుడ నెంతవరకు యగుచున్నానో, నీకుమారుడనుకూడ అంతవరకే యగుచున్నానని బాగుగ తెలిసుకొని నన్ను నీ స్వంతబిడ్డవలెనే ప్రేమింపుము." అని వ్రాసెను.

మరియు సుందరీదేవి పురిటిగదియందు ప్రసవసమయమున ముగ్గురు స్త్రీలుండిరి. సుందరీదేవి గర్భమునుండి శిశువు వచ్చుచుండు టగాని, శిశువు శిరస్సోదయమగుటకాని, యెవ్వరును కనిపెట్ట జాల కుండిరి. ఎవరికి వారే, తదితర స్త్రీలు శిరశ్శోదయముగుటజూచిరని విశ్వసించి యుండుటయేగాని నిజముగా నెవ్వరును జూచియుండలేదు. వారి కెట్టియనుమానమును కూడ కలిగి యుండలేదు. ఇదిగాక ఇంకను కొన్ని ముఖ్యకారణములు నారాయణ చంద్రఘోషుగారిచే తెలియ జేయబడెను. అవన్నియు నిప్పుడు ప్రచురించుటనావశ్యకము. సమయము వచ్చినప్పుడు ప్రచురింపబడును.

పాఠకులారా! బంకూరానివాసియగు శ్రీమతి యశోదా మాయి అను భక్తురాలు హరనాథమూర్తి పటమును పూజించుసమ యమున ఆమె కనిపెట్టుటకు కూడ దుస్సాధ్యమగు నట్లు పటమునుండి 1½ సం॥ వయస్సుగల హరిగోపాలు డివతలకు వచ్చి యామెస్తైన్య క్షీరమును గ్రోలుచుండెనని యనేకులకు తెలిసినవిషయమే. ఇప్పటికిని పాలకొల్లు సుబ్బమ్మగారను భక్తురాలికి హరగోపాలుడు కాన్పించి యామె స్తన్యక్షీరమును త్రాగువిషయము ఆంధ్రదేశ మంతటను తెలిసినవిషయమే.

కాబట్టి శ్రీహరనాథు డొక బాలునిగా కాన్పించుటకు ముందుగా అతడొక గర్భమునుండి వెలువడు చుండుటనవసరము. ఆయన సంకల్పమాత్రముచే మహామాయ తక్షణమే యొక శరీర మును సృష్టించును.

సంకల్ప మాత్రముచే తిరిగి యీ శరీరమదృశ్యమగుచుండును. శ్రీ హరనాథుడు తన 28 సం॥న (1892 సం॥ లో) హత్రాస్ పట్టణ ము నందదృశ్యుడై సదాశివ శిలావిగ్రహముగా మారిపోయిన యద్భుత మును ముందు ముందు చదువనున్నాము. ఇదియే భగవల్లీల ఇదియే

భగవంతుని ప్రత్యక్షమాయానాటకము-భగవంతుడు కాలస్థల ప్రకృతులకతీతుడైనను జీవులతో క్రీడించుటకై నొక శరీరమును దాల్చి వ్యక్తమగుచుండును. ఇట్టి శరీరములు కేవలము మాయామానుష విగ్రహములేకాని మనశరీరముల వంటివిగావు. భౌతికశాస్త్ర ప్రకారము చలనశక్తి (Motin Energy) వలననే పదార్థముల ఘనత్వము సిద్ధించుచున్నది. ఇట్టి చలనశక్తిపూర్తిగా యాయన యాధీనములో నుండుటచే తనచుట్టును ఒక శరీరమున్నట్లు జేయును. తరిగి తన సంకల్పముచే పదార్థమువలే కాన్పించు తత్వము శక్తిగా మారిపోయి మన స్థూలనేత్రముల కగోచరమగుచుండును. కాబట్టి యాయనకెట్టి శరీర సంబంధములను వుండినట్లులేవు. కనుకనే మహా ప్రభువగు శ్రీహరనాథమూర్తి యవతరించుటలో కూడ నెట్టి గర్భమునుండియు బయటకు వచ్చియుండలేదని పూర్తిగా విశ్వసింపవలెను. సామాన్య సిద్ధులే యీచలనశక్తిని కొంతవరకును స్వాధీనము చేసుకొనగల్గినప్పుడింక భగవానుడగు శ్రీహరనాథుని విషయములోనడుగవలయునా? మనయూపిరినెంత యప్రయత్నముగా విడుచుచున్నామో ఆతడంత అప్రయత్నముగా ప్రకృతితో నాడుకొనునని ప్రభువే చెప్పియున్నారు! మరియు శరీరధారివలే కన్పించునప్పుడాతడు మన సమక్షముననుండునెంత సత్యమని భావింతుమో శరీరమదృశ్యమైనప్పుడు కూడా యాతడు మన సమక్షమున నున్నాడనుటయు సత్యమే.

మనము తీవ్రముగా తపించితిమేని మహాప్రభువగు శ్రీహరనాథు డేక్షణములోనో మనయెదుట స్థూలశరీరముతో కాన్పించును. “అట్లు 17—1—1933 తేది రాత్రి 9 ఘంటలకు హజారాజిల్లాబోర్డు ఇంజనీరుగారగు ప్రఫుల్లచంద్ర గంగులేగారి భార్యయగు ప్రతిమా సుందరీదేవిగారికి ప్రభువు స్థూల శరీరముతో దర్శనమిచ్చి యామెయొసంగిన తేనీరును కొంతత్రాగి మిగిలిన దానిని ప్రసాదముగావిడిచి అద్భుతముగా యదృశ్యుడై పోయెను.”

ఆదినమున ప్రభువునకొసంగిన తేనీరుగ్లాసు ఇప్పటికిని గంగులే గారి గృహమున భద్రముగాదాచి పెట్టబడియున్నది. ప్రభుహరనాథుని చేతివ్రేళ్ల గుర్తులుకూడ ఆగ్లాసు లోపలిభాగమున స్పష్టముగా ఇప్పటికిని కాన్పించుచున్నవి. ఎవరైనను చూడవచ్చును.

అట్లే ఏప్రెల్ 1933 సం॥వ బొంబాయిలో కన్యాలాల్ శాస్త్రి అను భక్తునకు కూడనట్లే కాన్పించి యాతని యాయుర్దాయమును కొన్ని కారణములచేత దీర్ఘముచేసితినని వరమొసంగి యదృశ్యుడై నట్లు, శ్రీహరనాథ స్మృతి మొదటిభాగములో చదివియే యుందురు. ఇట్లనేక తార్కాణములియ్యగలము. కాబట్టి శ్రీహరనాథుడు కేవలము మాయామానుష విగ్రహధారిగా నుండెనని దృఢిగా విశ్వసింపుడి. కనుక సుందరీదేవి దాల్చిన గర్భము కేవలము మాయాగర్భము. శ్రీహరనాథుడు. అయోనీ సంభూతుడు. లీలామానుష విగ్రహధారి.

# సోనాముఖి నగర చరిత్రము.

వంగదేశమందలి బంకూర జిల్లాలోని సోనాముఖియను పుణ్య క్షేత్రమున శ్రీ హరనాథప్రభు వవతరించెను. వందలకొలది సంవత్సరములనుండి మహాభక్తులెందరో ఆ పురమున నివసించి యుండిరి. సోనాముఖిలో భగవాను డవతరించు సమయమువచ్చుచున్నదని. 16 వ శతాబ్దములోనే తెలియజేసిన మహాసిద్ధుడును, ప్రవక్తయును నగు మనోహరదాసుడనేక సంవత్సరము లీక్షేత్రముననే నివసించియుండెను.

శ్రీకృష్ణు డవతరించికాలమున నీప్రాంత్యమంతయును మహారణ్యములతో నిండియుండెను. రాధాకృష్ణు లప్పుడప్పుడు తమమహాత్మ్యముచే నీస్థలముయొద్దకువచ్చి ఇచ్చట తటాకములో జలక్రీడలాడి వినోధముగా కొంతకాలముగడపి తిరిగి యదృశ్యులయిరని మనోహరదాసు తన శిష్యులకు తెలియజేసెను. ఇప్పటికిని నీగ్రామము చుట్టును యనేక మైళ్లవరకును యరణ్యముతో నిండయున్నది.

## సోనాముఖి క్షేత్ర పూర్వ చరిత్రము.

16వ శతాబ్దములో నీపురము విష్ణుపురరాజగు వీరహంబీరుడను స్వతంత్రమహారాజుని రాజ్యములో నుండెడిది. క్రీ॥ శ॥ 1500 సం॥ న విష్ణుపుర మహారాజు వేసినలెక్కలు ప్రకారము గ్రంధములను బట్టి జూడ సోనాముఖిపుర జనాభా 30,000 (ముప్పదివేలు) ఉండెడిది. రానురాను మహారాష్ట్రులును మహమ్మదీయులును నీరాజ్యముపై యనేకసార్లు దండెత్తి యుద్ధములు చేయుచుండుటచేత ప్రాణభీతిచే సోనాముఖి పురమందలి జనులీగ్రామమునువిడచి ఇతరప్రదేశముల కేగిరి. అయితే ఈస్టుఇండియాకంపెనీ స్థాపింపబడిన తరువాత పారిపోయిన వారిలో కొందరు తిరిగి నీపురమునకు వచ్చిచేరిరి. ఈస్టుఇండియా కంపెనీవారీ సోనాముఖి గ్రామములో బట్టల కార్మాగారముల నీలిమందు కర్మాగారములను కట్టిరి. కనుక ఒకప్పుడీ పురమెంతయో శోభాయమానముగా సర్వసంపత్తితోను తులతూగుచుండెడిది. 1931 జనాభాలెక్కల ప్రకారమీగ్రామ జనాభా 10989 ఉండెను ఇప్పుడు సుమారు 16 వేలుండును.

<u>శ్రీహరనాథ యవతారమునుగూర్చి ముందుగా జెప్పిన ప్రవక్త యగు మనోహరదాసు.</u>

ఈయన 16వ శతాబ్దమువాడు. 17వ శతాబ్దములో మరియొక మనోహరదాసుకూడా నుండెను. ప్రభువు రాకనుగురించి తన శిష్యులకు జెప్పిన ప్రవక్తయగు మనోహరదాసుడు 16 వ శతాబ్దములోనివాడే. వీరగంభీరుడను విష్ణుపురమహారాజును ఈతడును కలసి బృందావనము నుండి వంగదేశమునకు వచ్చిరనియే చెప్పబడుచున్నది. ఈమనోహరదాసుడు త్రికాలవేత్త అద్భుతమగు చరిత్రగలవాడు. పూర్ణశిద్ధ పురుషుడు. ఈతడు స్వర్ణముఖివచ్చి యిచ్చట క్రీ॥శ॥ 1590 సం॥ వరకు.

యుండెను. ఆకాలములోనే అచ్చటి పురజనులకు, "భగవంతుడు కొలదికాలములోనే ఈ సోనాముఖి క్షేత్రమున నవతరించి గృహాస్థాశ్రమమునందేయుండి భగవన్నామ మహిమనుగురించి ప్రపంచమునకు జెప్పి మహాపతితపావనుడై ఎన్నియో యద్భుత పరంపరలు గల జీవితముగలవాడగను. ఆయన పవిత్రనామము మహాత్యమును ప్రపంచమంతటను వ్యాపించితీరును." అని తనశిష్యులకు జెప్పెను. కొంతకాలము సోనాముఖిలోనుండి 1590 సం॥ ప్రాంతమున రాజపుత్ర మందున్న జయపురమునకేగి యచ్చటనే తనశిష్యుల సాన్నిధ్యమున 31 మార్చి 1595 సం॥ సమాధినొందెను.

ఆ దినమునుండి యాతని శిష్యులు తరతరములనుండి యాతని యుపదేశములను యాతని సందేశములను జెప్పుకొనుచు వచ్చుచున్నారు. ఈమనోహరదాసుని శిష్య సంతతివారు సోనాముఖి ప్రాంత్యములలో నేడుబహుకొలదిమందియేయున్నారు. శ్రీహరనాథుడే సాక్షాత్ భగవంతుడని మనోహరదాసుడు చెప్పినట్లు యాశిష్యసంతతివారు విశ్వాయించి శ్రీహరనాథ భక్తకోటిలోచేరిరి. మరియు వారిమూలమునను, శ్రీహరనాథుని యద్భుతకీర్తి విశేషమును యితరులచే వినియును, రాజకోట, ఛత్రపురము, దేవాన్, ఛాప్రాముడ్నగు మహారాజులు శ్రీహరనాథునీ తమ రాజ్యమున కాహ్వానించి యాయన పాద పంకజములకు మహాపూజ లొనర్చిన పూర్తి వివరములన్నియు తేదీలసహితముగా కొందరి మహారాజుల ఛాయాపటములను ముద్రించుచు ప్రచురింపబోవుచున్నాము. మరియు బరోడమహారాజుగారి జననియగు శ్రీమతి యసోద బాయి శ్రీ హరనాథుని దర్శనమును బొంబాయి నగరమునజేసి తన రాజ్యమున కాహ్వానించిన వివరములు కూడ ముందు ముందు వ్రాయబడును.

## సోనాముఖపురయాథ్యాత్మికస్థితి.

శ్రీ హరనాథు డవతరించు నప్పటికి సోనాముఖ స్థితి యాధ్యాత్మికముగా నంత బాగుండెడిది కాదు. శుద్ధభక్తి యనునది క్షీణించి ఒకరితో మరియొకరు పోరాడుచు పార్టీలుగా నేర్పడి ఆత్మసమర్పణకు మారుగా అత్మౌన్నత్యమునకే ప్రతివారును తపించు చుండిరి. భక్తులుగా నెవరైనను సంచరించినను ఎన్నియో యాక్షేపణలు జేయుచు వారి నగౌరవ పరచుచుండెడివారు. బ్రాహ్మణకులము నందు పుట్టినను కొందరు వెండి బంగారములను కూడ దొంగిలించు నంతటి మహాపాపమునకు ఒడిగట్టు కొనుచుండిరి. వారి పూర్వీకులు ప్రతిగృహమునందును కట్టించిన యాలయముల వంకనే జూడక అనేకులు దినమంతయును జూదములతో కాలక్షేపము జేయుచుండిరి. జూదమాడువారేవారికి మహాప్రియులును మహామిత్రులునుగా నుండిరి. మరికొందరు తాము గురువులని జెప్పుకొనుచు తమశిష్యులను ధన సహాయమునకై పీడించుచు అట్లియ్యజాలని-చో గురుద్రోహముచేసిన నేరము నీకు సంభవించును. నీకింక తరుణోపాయమే లేదు. అనిక్రోదావేశమున వారిని భయపెట్టి ధనార్జన జేయుచుండిరి. మరికొందరు గురువులు మంత్రోపదేశము పొందనిదే భగవన్నామము నెన్నికోట్ల జన్మలు జపించినను ప్రయోజనము లేదని జెప్పి వారిని తమ శిష్యులుగా జేసుకొనుచుండిరి. ఇట్లనేకమంది గురువు లేర్పడి ఎవరికి వారే నితర గురువుల నాక్షేపించుచు తమ శిష్యులలో విశ్వప్రేమ భావమును మొదలంట క్షీణింపజేసి యరిషడ్వర్గములను చంపు కొనుటకు మారుగా మతము పేరుతో క్రోధాభిమానములను మరింత వృద్ధిజేసు కొనుచు మేము నిజముగా భగవంతునే సమీపించుచున్నాము అని యనుకొనుచు మానవప్రేమజూపించుట లేదు. మరికొందరు శుద్ధభక్తిని

నేర్పు "విశ్వవిద్యాశాల" యనిజెప్పుచు భగవన్మార్గమున నెంతయోక్లి ష్టతమముగాజేసి కొన్నివైదీక భక్తిసూత్రములను నేర్పి సంతుష్టి బెట్టు చుండిరి. ప్రజలలో రోమరోమమునకును గల సాంఘిక మత సంబంధ మగు మూఢవిశ్వాసము లెన్నియో యుండెను. కొందరు గురువులు తమ శిష్యులకు వైదీక భక్తివిధానములను జెప్పుచూ నీవేమాత్రము తప్పుజేసినను మహాపరాధమగును. దీనిచే భగవంతుడు నిన్ను దం డించితీరునని యెన్నియో యపరాధములను పేర్కొనుచు భగవంతుని పరిపూర్ణప్రేమ కృపాస్వరూపమును కప్పిపుచ్చుచుండిరి. భగవాను డనిన నొకవిధమగు భయమే పుట్టుచుండెను. కాని గాఢమగు యను రాగమనునది క్రమక్రమముగా క్షీణించిపోయెను. మరికొందరు గురు వులు తామేమహాపండితులమని విఱ్ఱవీగుచు భగవానుడు వారిగ్రంథపఠ నను పరీక్షజేసి మార్కులువేయునేమో యనుసట్లు దినమంతయుశుష్క పరోక్షజ్ఞానార్జనకై తపించుచు భగవధ్యానమునుదినమునకు పట్టుమని 2 ఘంటలైననుజేయక ఇతరులవిశ్వాసములనుకూడ భంగపరచుచుండిరి. ఇదిగాక మరికొందరు గురువులు నాలుగు పంక్తులకు సరిపడునన్ని బిరుదులను తమ నామములకు తగిలించుకొని తామే జ్ఞానులమనియు ఇతర ప్రపంచమంతయు మూఢులనియు భావించుకొను చుండిరి.

భగవాను డిప్పుడు తన నిజప్రేమస్వరూపమును ప్రదర్శించి భగవానుడన తన తల్లిదండ్రుల కంటెను యనంత మడుంగులధిక ప్రేమతో మనలను ప్రేమించు జగజ్జనకుడే యను స్థిరభావమును జీవు లకు కలుగజేయుటకును, హృదయమందు నిష్కపటమైన యనురాగ ముండినచో భగవానుని సేవించుటలో నెన్ని లోపములున్నను యాతడు లక్ష్యముచేయడను దృఢవిశ్వాసమును జీవుల కొసంగుట కును ఏభాషలోనైననుసరే యేభగవన్నామ మైననుసరే యెట్టి నిబంధనలనుగాని పాటించక సదా స్మరించుచుండినచో సులభముగా

తరించి తీరెదరని మెలుగెత్తి జెప్పుటకును, భగవంతుడు నేడు స్వర్ణ ముఖగ్రామమున యవతరింప నుద్దేశించెను. సోనాముఖి క్షేత్రము పరమపావన క్షేత్రమగు కాలము వచ్చినది. లక్షలకొలది జనులు తమ పాపభారములను తగ్గించుకొని స్వేచ్ఛగా భగవద్ధ్యానమును జేయు సుదినము వచ్చుచున్నది! విశ్వప్రేమ బీజములనేక హృదయక్షేత్రము లలో నాటబడు మహాదినము సమీపించినది. ఎందరెందరో తల్లులను తండ్రులను చుట్టములను సోదరులను భార్యలను అనేక జన్మములనుండి మనము విడుచుచు వారిచే విడువబడుచు జీవయాత్ర చేయుచున్నాము. ఏ పరమపురుషుడు మనలను విడువక సదా వీక్షించుచున్నాడో ఏవిశ్వప్రియుడు మనల నతిగాఢముగా ప్రేమించుచు మనప్రేమనవనీత మును యాచించుచున్నాడో అట్టి జగదాధారుడు తన ప్రేమస్వరూప మును మనలకు జూపుటకై యవతరించు పరమపవిత్రదినము రాబోవు చున్నది.



శ్రీ కు సు మ హ ర నా థా య న మః.

# శ్రీహరనాథావతారము

4 అధ్యాయము.

—:o:—

## శ్రీహరనాథుని జననము-బాల్యము.

—:o:—

1865 వ సంవత్సరం జూలై 1 వ తేది (ఆషాఢ శుద్ధ అష్టమి శనివారము) నాడుదయమున శ్రీహరనాథ మహాప్రభువు తన మాయా మానుష విగ్రహమును ఈలోకమందలి జీవులకు జూపించెను.

ఉదయముననే జయరాముని స్వంతభవనము చుట్టునుయున్న ఆవరణయందలి ఒక చిన్న గుడిసెలో భగవతీదేవి ప్రసవించుటకు సిద్ధముగానుండెను. నిరుపేదలకంటెను దరిద్రుడనని సూచించుటకును సర్వులును తనకంటె యధికులే యని జెప్పుచున్నాడా యనునట్లును గోవులుండు యిట్టి గుడిసెలోనే ప్రభువు యవతరింపనున్నాడు. అరుణుడును శ్రీ హరనాథమూర్తియును ఉదయించి తమతమ తేజోప్రేమ కిరణములచే జగత్తును పోషింపనున్నారు. అదేసమయమున జయరాముడు కట్టించిన యాలయములో హరినామసంకీర్తనలు చెలరేగుచుండెను. గణగణ శబ్దములును "జయ్ జయ్" నాదములును చెలరేగుచుండెను. హర హర "మహాదేవ శంభో" అనుచు జయరాముడు తన శివాలయములో మహేశ్వరుని స్తుతించుచుండెను. అదేసమయమున

నొక యద్భుతము జరిగినది. (ఈవిషయము శ్రీహరనాథుని యన్నగారగు శివనాథుని సతీమణి మాకు తెలియజేసెను.) ఒక విధమగు తేజోకిరణము భగవతీదేవి గర్భమున ప్రవేశించుచున్నట్లు గోచరించెను. ఆతేజోకిరణము దృశ్యమైన తక్షణమే యొక శిశువునేలపై బడియుండి యేడ్చుచుండెను!

అప్పుడు వుదయం సుమారు ఘం॥5-45 నిమిషములగును. మహాప్రభువు తన మాయానాటకమును ప్రారంభించెను. తన లీలామానుష విగ్రహమును పాపులగు నీజీవులకెల్లను జూపించి వారిదురితములను హరించుట మొదలుపెట్టెను. హే! దీనదయాళో! ప్రేమస్వరూపా! అనంత కల్యాణ గుణసాగరా! జీవులపై నీవు జూపునిర్హైతుక కృపవర్ణనాతీతముగదా తండ్రీ! మహాపతితుల మగుటచే నీప్రేమలీలలను గూడ వర్ణింపజాలకున్నాము. నీ పరమపవిత్ర నామామృతమును గ్రోలజాలకున్నాముగదా! తుచ్ఛమగు నీ సంసారకల్మషములను గ్రోలుట కెట్టి సంశయములును లేక యపారత్యాగమును జూపెదము గాని నీ పవిత్ర నామస్మరణకై సందేహ పరంపరలు పిశాచమువలె మమ్మావరించుకొని, నీకొరకై మేమెట్టి త్యాగమును జూపలేకున్నాముగదా! ప్రభూ!

## హరనాథుని బాల్యము—లేక హరగోపాల లీలలు.

హరనాథు డెంతయో సౌందర్యముగల బాలుడు. ఆతని నేత్రములు కాటుకపూచినట్లు నల్లగానుండి నిశ్చలమగు యఖండప్రేమను ప్రసరించుచుండెను. అతని కేసరములు దట్టముగా యుంగరములవలె జుట్టుకొను చూపరుల కత్యధిక యానందమును కలిగించుచుండెను. కాని ఈబాలునిలో రెండులోపములుమాత్రమేయుండెను. దేహచ్ఛాయ నల్లగానుండుట యొకటి. విశేషముగా నేడ్చుచుండుట. మరియొకటి.

హరగోపాలుడేడ్పుగొట్టు పిల్లవాడు! ఒకసారి యేడ్పుటమొదలు పెట్టినచో నెంతయూడించినను, ఊరుకొనకుండెను. కాని హరినామ సంకీర్తన జేసినచో వెంటనే నది యాలకింపుచు నిశ్శబ్దముగా నుండును. శ్రీహరనాథునికి "హరగోపాల్" అను నామముకూడకలదు. ప్రసవించిన రెండుమాసముల తరువాత భగవతీదేవి తన నిత్యపూజ లకై మందిరమున కేగుట కారంభించెను. ఆలయములోనికి దెచ్చి నచో బాలుడు మూత్ర విసర్జనాది కార్యములు చేయునని యెంచి హరనాథుని ఉయ్యాలలోనే పరుండబెట్టి ఆలయమునకు బోవ సిద్ధ ముగానున్నప్పుడు బాలుడొక్క పెట్టున యేడ్పు మొదలుపెట్టును. స్తన్యక్షీరమునిచ్చినచో నిశ్శబ్దముగా త్రాగి ఉయ్యాలలో పరుండబెట్టు నప్పుడు తిరిగి యేడ్పు మొదలుపెట్టును. వేరుచేయునదిలేక తనబాలుని కూడ భగవతీదేవి మందిరమునకు తీసికొనిపోయి నేలపై చాపవేసి పరుండబెట్టుచుండెను. ఎన్నిగంటలు పూజించుచున్ననుకూడ యాడు కొనుచుండెను. మరియు మూత్రవిసర్జనాది కార్యములను వేటినికూడ చేయకుండెను.

భగవతీదేవి తన కుమార్తెయగు కమలాదేవిని (హరనాథుని సోదరి) ఒకదినమున కోపపడుచుండగా పాన్పుపై పరుండిన శిశువు మేల్కాంచి విశేషముగా యేడ్చుచుండెను. స్తన్యమునుకూడ నప్పుడు కుడువకుండెను. ఒక్కసారి హరినామసంకీర్తనజేయగా తన యేడ్పును మాని కన్నులుమూసి నిద్రించెను. భగవతీదేవి యెవరిపై కోపపడు చుండినను హరనాథబాలుడేడ్చి యామెచే నీవిధముగా హరినామ మును చేయించుచుండెను! అనేకసార్లిట్లు జరుగుటజూచి హరనాథుని కొరకై యామెనెవ్వరిని కాని సాధారణముగా కోపింపకుండెను.

హరనాథుని కారుమాసముల వయస్సున్నప్పుడొక పాముల వాడు గుమ్మమువద్దకొచ్చి నాగస్వరము వాయించుచు పాముల

నాడించుచుండెను. అప్పుడు భగవతీదేవి తన శిశువునకు పాలిచ్చు చుండి పాములను జూచుటకై యామెయును వీధిగుమ్మము వద్దకు వచ్చెను. ఆడుచున్నపాము తన పడగ పూర్తిగా విప్పి హరనాథుని వైపుననే తీక్షణముగా జూచుచుండెను. అంత సుందరీదేవి మరి యొక మూలకుపోయి నిలువబడియుండగా నా సర్పము తన పడగను మరల్చి తిరిగి హరనాథునివైపునకే జూచుచుండెను. ఈ విశేషము నందరును కనిపెట్టిరి. సుందరీదేవి యెటువైపునకు తిరిగిన నాసర్పమును యటువైపునకే తిరిగి బాలునిముఖమును తదేక ధ్యానముగా తిల కించుచుండెను. సుందరీదేవి భయపడి అచ్చటనుండి లోనికేగెను. పై విశేషము జరిగిన కొన్నిదినములతరువాత మరియొక విచిత్రముజరి గెను. రాత్రిసమయమున 9 ఘంటలకు జయరామ్ మున్నగువారికి భగ వతీదేవి భోజనముపెట్టుచు తనపిల్ల డుండుగదిలో నొకశబ్దము వినిపింపగా గదిలోనికివచ్చెను. హరనాథుడు పవళించియుండినపాన్పుపై నొకసర్పము తనపడగనువిప్పి యథేచ్ఛగాబాలుని శరీరము నంటుపెట్టుకొని యాడు చుండెను. హరనాథుడప్పుడు చిద్విలాసముగా నవ్వుచు యాపాముతో నాడుకొనుచుండెను. కెవ్వున యరచుచు సుందరీదేవి తనభర్తతో జెప్పుటకేగెను. జయరాముడు భోజనమును మాని లోనికరుదెంచెను. హరనాథుడొక్కడే పవళించియుండెను.

సర్పమెచ్చటను కాన్పించలేదు. తానింతకు ముందు జూచిన సర్పమే పగబట్టి హరనాథుని కాటువేయుటకు వచ్చియుండెనని సుందరీదేవి యెంతయో భయపడి తన బాలునికెట్టి ప్రాణభయమును లేకుండ జేయుమని మహేశ్వరు నెంతయో ప్రార్థించి మంత్రవేత్త లను పిలిపించి సర్పమంత్రములను జదివిపించెను. ఆ దినము నుండియు కంటికి రెప్పవలె తనశిశువును సదా వేయి కండ్లతో జూచుకొను చుండెను.

ఒక దినమున సుందరీదేవి కొక స్వప్నమువచ్చెను. ఒక యరణ్యమందు భయంకరముగా గర్జించుచున్న యడవి మృగముల మధ్య తన బాలుడగు హరనాథుడు యాడుకొనుచుండుట గాంచెను. అతడు నిర్భయముగా చిరునగవుతో యావన్యమృగములతో స్వేచ్ఛగా యాడుకొనుచుండెను. ఆ దృశ్యమును భరింపజాలక సుందరీదేవి నిద్రలోనే యరచుచుండెను. జయరాముడది జూచి యామెను నిద్ర నుండి లేపెను. హరనాథబాలుడు తన భవిష్యత్ నాటక ప్రదర్శన మును తన జనని కీవిధమున జూపించు చుండెను. ఇట్టి దుస్వప్నము లచే నామె తనయునిక్షేమమునకై నిత్యమును భగవానుని తీవ్రముగా ప్రార్థించు చుండెను. ఈకారణముచే యామె మనస్సంతయును అహ ర్నిశలు హరనాథుని వైపునే పనిచేయుచుండెను. జయరామ కమలా దేవులు కూడ హరనాథునే యప్రయత్నముగా సదా స్మరించుచుండిరి. భగవతీదేవి తక్కిన పిల్లలందరికంటెను నత్యధికముగా హరనాథునే ప్రేమించుచుండెను.

—: శషిభూషన్ ముఖర్జీ యను పతితుని పాపవిమోచనము. :—

(ఈవృత్తాంతము నారాయణచంద్ర ఘోషుగారివలన మాకు తెలయవచ్చినది.

హరనాథునికి $1\frac{1}{2}$ సం॥ వయస్సున్నప్పుడు తన జనని యాతని కెన్నియో సువర్ణాలంకారములను జేయుచుండెను. తన మెడలో నొక సారి బంగారపు గొలుసుయుండగా నీబాలు డాడుకొనుటకై మెల్ల మెల్లగా వీధిలోనికి నడచి తన గృహమునకు సమీపముననున్న శషి భూషన్‌ముఖర్జీ యను వాని గుమ్మముయొద్ద వీధిలో నాడుకొను చుండెను. అది సాయంసమయము హరనాథుని సోదరియగు కమలా దేవియు తదితర పిల్లలును వేరొకచోట యాడుకొనుచుండిరి. ఎవరును

లేని సమయమున శశిభూషన్ అను నాగృహాయజమాని హారనాథుని సమీపించి మెడలోని హారమును సంగ్రహించి లోనికేగెను. హారనాథుని శరీరము తాకినది లగాయతు శశిభూషణుని హృదయమందొక యావేదన యంకురించెను. తాను చిన్ననాటనుండియును జేసిన దురితములన్నియును స్ఫురింపు వచ్చుచుండెను.

పాషాణమువంటి యాతని హృదయము కరుగుట మొదలు పెట్టెను. పశ్చాత్తాప ముదయించెను. "భగవంతునితో సమానులగు నోరుమాలిన బిడ్డలనే ద్రోహముచేయుటయా? నేనెన్నియో దొంగతనములుచేసి ఎందరెందరో మోసపుచ్చుచు ధనము నార్జించుచున్నను, నాకష్టములుకాని దరిద్రముకాని ఇంచు కంతయైనను క్షీణించినవికావు" అనుచు పలువిధముల జింతించి తిరిగి బాలుని మెడలో నీ హారమును వేయుటకై వీధిలోనికి రాగా సుందరీదేవి బాలునివైపునకే వచ్చుచుండుటగాంచెను. వెంటనేలోనికేగి యాహారమును తన పెరటిలోనున్న యొక మురికికుండలో పారవైచెను.

సుందరీదేవి హారనాథుని సమీపించగా హారము లేకపోయెను. పిల్లలెవ్వరికిని దెలియదని చెప్పిరి. ఆమె కేకలువేయుచు కమాలాదేవిని కొట్టుట కేగుచుండెను. వెంటనే హారనాథుడేడ్పు మొదలుపెట్టెను. గ్రుక్కత్రిప్పుకొనలేనట్లు జూపించెను. భగవతీదేవి తన పిల్లవాని నెత్తుకొనగా నీతడు తనచేతిలో శశిభూషణుని గృహమును జూపించుచుండెను! ఆమె యాగృహమున జొచ్చెను. హారనాథుడు తన వ్రేలుతో ఆగృహముయందలి పెరడు వైపునకు జూపుచుండెను. ఆమె పెరడులోని కేగెను. మురికికుండీవైపునకు హారనాథుడు తన వ్రేలుతో జూపుచుండెను. ఆమె మురికికుండ యొద్దకుపోయి చూడగా దానిలో పడియుండిన హారము గాన్పించెను.

శశిభూషణ్ ఇదియంతయును జూచుచు "ఈ బాలుడు సామాన్యనరుడుగాడు. ఈతడు భగవంతుడే కావలయును. లేనిచో నేను రహస్యముగా హారమును దాచిపెట్టిన స్థలమీతనికెట్లు తెలియసాధ్యము? అదియునుగాక నింత చిన్నవయస్సులో నెంత చిత్రముగా తన వ్రేలుతో జూపించుచుండెను. మరియు నా కుదయించిన పశ్చాత్తాపమునకు గూడ యీతని కృపయే కారణము కావచ్చు" నని యూహించెను. శ్రీహరనాథుడు పెద్దవాడైన తరువాత స్వర్ణముఖీ గ్రామవాసులలో శ్రీహరనాథుని యండకుజేరిన పరమభక్తుడీతడే. ఈ విధముగా హరనాథుని వస్తువులను హరింపవలయునని వచ్చిన చోరుడు తన హృదయమునే ప్రభువున కొసంగెను. ఆహా! హరగోపాలుడు దొంగలకు దొంగకదా!

## పాతాళగంగ.

(ఈ వృత్తాంతము రాధాకాంత ముఖోపాధ్యాయుని వలన మాకు తెలిసినది.)

స్వర్ణ క్షేత్రమునకు 25 మైళ్ల దూరమున నొక దుర్గాలయమున్నది. అచ్చట ప్రతి సంవత్సరమునను నొక యుత్సవము జరుపబడును. శ్రీహరనాథబాలునకు 2 సంవత్సరముల వయస్సున్నప్పుడు సుందరీ జయరాములా యుత్సవమును జూచుటకేగిరి. జనము క్రిక్కిరిసియుండెను. వీరందరును స్నానమాచరించుటకై నొక తటాకముండెను. అందరును ఒకే చెఱువులో స్నానముచేయుటచే నీరంతయును మలినమైపోయెను. అదివేసవికాలమగుటచే స్నానపానాదులకు నీరు చాలకుండెను.

ఆదుర్గాలయానరణములోనే నొక స్ప్రింగుయుండెను. ఈదినమునకు కొన్ని సంవత్సరములకు పూర్వమునుండి ఏలనోకాని జలము

ప్రసరింపకుండెను. సుందరీదేవి జయరాములా గొట్టమునకు సమీప ముననే కూర్చొనియుండిరి. హరనాథుడు మెల్లగానడచి దాని చుట్టును తిరుగుచు యాడుకొనుచుండెను. తక్షణమే మహావేగముతో భూమిలోనుండి గంగపైటకు ప్రవహించుచుండెను! సుందరీదేవి ఆశ్చర్యపడి తన బాలుని ప్రక్కకుదీసెను. జనులందరును, ఇచ్చటకువచ్చి పరిశుభ్రమగు నీ జలమును తీసికొని పోవుచుండిరి. శ్రీహరనాథుడు పెద్దవాడైన తరువాత నీయద్భుతమును గురించి తన భక్తుడగు రాధాకాంతముఖోపాధ్యాయునికి సూచించెను.

పాఠకులారా! బాల్యదశలో శ్రీహరనాథప్రభువు తన శక్తులను వేటిని ధారాళముగా వ్యక్తముజేసి యుండలేదు. మహాగుహ్యమగు నరలీలనే నాతడు ప్రదర్శించుచు తన భగవత్తత్వమును నెవరికిని తెలియజేయక ఇతరులకెట్టి యనుమానమైనను కలుగజేయక యెన్నియో యద్భుతములను కండ్లయెదుటనే జూపుచుండెను. ఆతడు తన బాల్యమునందును తరువాత 28 వ సం॥ వరకును విశేషముగా ఆత్మనివేదన యోగమును విశ్వప్రేమను ప్రదర్శించుచుండెను. భగవానుని కెంతపూర్ణముగా మనము సమర్పణయగుచుంటిమో అంత సులభముగా నాతడు మనలనంటపెట్టుకొనియుండి సదా రక్షించుచుండుననియు ఆతడు మన యధీనములో నుండుననియు ప్రభువు జీవులకు జూపుచుండెను.

శ్రీహరనాథయవతార తత్వము సులభముగా గ్రహింపవీలుగాకుండుట కీద్వంద్వజీవితమే కారణము. ఆతడు భగవంతుడేయైనను తన బాల్యమునందు ఒక జీవునివలె నటించుచు భగవానునికి పూర్ణ సమర్పణ అయినట్లు జూపించుచు అట్టి సమర్పణవలన, తనకెట్లు భగవానుడు యధీనమై యుండెనో యనిమనకుకొన్ని తార్కాణములను జూపించియుండెను. ఆంతరంగికముగా నాతడే భగవానుడు. బహిర్ముఖ

ముగా నాతడొక యద్వితీయ భగవత్ ప్రియుడు. ప్రభుహరనాథుని మహావాక్యమును గమనింపుడి:-"నా అంతర్బహిర్ తత్వములు వేరు వేరుగా నుండుటచేతనే నా స్వరూపమును గ్రహించుటలో మీకెంతయో మహా కష్టమగుచున్నది. నా జీవిత మెప్పుడును సులభ గ్రాహ్యముగా నుండదు. అట్లుండుటకు వీలులేదు. నేను నటనాగ్రేసరుడను. నా జీవిత మొక గూఢమగు సమస్య ఇతరుల కెవ్వరికైనను అదియొక సీలువేయ బడిన గ్రంథము." పై వాక్యములను జ్ఞప్తికి తెచ్చుకొను చుండినచో శ్రీ హరనాథుని నరలీలలన్నియును మనకెంతయో యానందరసమును కలుగ జేయును. భగవానుడు జీవుల యందలి ప్రేమాతిశయమున నెట్టి త్యాగ మును జూపునో తెలుసుకొనగల్గుదుము.

# జయరాముని నిర్యాణము.

(25 డిశంబరు 1868.)

జయరామ సుందరీ దేవులు హరనాథ బాలుని ముద్దుమాట లనే సదా యాలకించుచు దినములను నిమిషములవలె గడపుకొను చుండిరి. ఒకరోజున జయరాముడు కలకత్తా ప్రయాణమునకై సిద్ధ పడుచుండెను. ఆదినముననే హరనాథునికి జ్వరమువచ్చి మంచినీటి నైనను త్రాగకుండుటచే జయరాముడు తన ప్రయాణమును మాను కొనెను. ఒకటి, రెండు రోజుల తరువాత హరనాథుని యారోగ్యము సరిగానుండెను. వారము దినములు తరువాత తిరిగి జయరాముడు ప్రయాణమునకై సిద్ధ పడుచుండగా తిరిగి హరనాథునకు జ్వరము వచ్చెను. జయరాముడు గృహమునుకూడ విడిచినచో హరనాథబాలు డేడ్చుచుండుటచే హరనాథునికొరకై జయరాముడు మాసమంతయు గ్రామముదాటి వెడలకుండుటకై నిశ్చయించుకొనెను. వెంటనే హర

నాథునకు స్వస్థత కలిగెను. ఆ దినమునుండియు హరనాథుడు జయ రాముని యొడిలోనే సదాకూర్చొనుటయు జయరామునితోనే తిరుగు టయు, ఇట్లు చేయుటలో హరనాథుని యందు విశేషమమతకలిగిన వాడగుచుండెను. పాపము జయరాముని యాఖరు దినములు దగ్గ రకు వచ్చుచున్నట్లాయన యూహింపజాల కుండెనుగదా. సర్వజ్ఞుడగు హరనాథుడు తన తండ్రి మనస్సును ఆఖరు దినములలో వ్యాపారాది విషయములలో బెట్టనీయక తనయందే లగ్నముచేసుకొను నట్లుచేయు టకే తన ప్రియాణమున కెన్నియో సార్లు అంతరాయములు గల్పిం చుచుండెను.

(ప్రతిసందేశములోను కూడ శ్రీ హరనాథుని మాటలు రెండె "Remember Me" 'అనగా నన్ను జ్ఞాపకముంచుకొనుము" అని చెప్పు చుండెను దీనివలననే సులభముగా ముక్తివచ్చును. కనుకనే జయరాము డట్లే చేయునట్లు తన గూఢనరలీల కెట్టి భంగమును రానీయక హర నాథబాలుడు సాధించుచుండెను.)

ఒకదినమున హఠాత్తుగా జయరామునికి జ్వరమువచ్చెను. జ్వర ము బహుతీవ్రముగా నుండెను. వైద్యులెట్టి చికిత్సలు చేయుచుండినను ప్రయోజన మేమియును లేకపోవు చుండెను. జయరాముడు సుందరీ దేవిని దగ్గరకుపిలచి "నేనిక బ్రతుకుట దుర్లభమనియే నాకుదోచు చున్నది, హరనాథుని మాత్రము విడచియుండకుము. వాని నెప్పుడును దేనికైనను శిక్షింపకుము. నా హృదయ మేలనోకాని వీని వైపునకే బోవుచున్నది." అనుచు హరనాథుని సుందరీదేవికి యొప్పగించెను.

మరుచటిదినము రాత్రి జాగ్రదావస్థలో జయరామునికొకదివ్య దర్శనము కలిగెను. ఎవరో కొందరు దివ్యపురుషులొక విమానమును తెచ్చి అయ్యా! జయరామ్! నీవు మహాపుణ్యాత్ముడవు. భగవంతుడు సదా నీయొద్దనే తాండవమాడుచుండగా నీకేమి లోపమురాగలదు.

నీకొరకై ఈదివ్యవిమానమును దెచ్చితిమి. బయలుదేరుటకు సిద్ధముగా నుండుము" అని చెప్పుచూ వారలదృశ్యులైరి.

వెంటనే జయరాముడు తాను జాగ్రదావస్థలో కాంచిన దృశ్యమును గూర్చి సుందరీదేవికి జెప్పి "నే నెన్నియో రోజు లింక బ్రతికెదనని నాకు తోచదు. ఈ దృశ్యమువలన నాకెంతయో ధైర్యము కలుగుచున్నది. బ్రహ్మానందముతో నేను పోవుటకు సిద్ధముగాను న్నాను" అని చెప్పెను. ఇట్టి మహానందమును చేకూర్చి మరణమనిన నెట్టి భయమును లేకుండా జేయుటకే ప్రభువు జయరామునికి ముందుగా తన భవిష్యత్ స్థితిని సూచించుచు ఈ దర్శనమును ప్రసాదించెను. మరుచటి దినముననే భగవన్నామమును స్మరించుచు చిదానందముతో జయరాముడు వైకుంఠమున కరిగెను.

జయరాముని వంటి పరమ భక్తులకును పూర్ణ త్యాగులకును ప్రతిఫల మంత్యకాలముననే కాన్పించును. విషయములకొరకే తనువులను ధనమును ధారవోసెడు జీవుల దుర్గతి వారు మరణశయ్యపైనున్నప్పుడే యెరుక. కనుకనే ప్రభు హరనాథు డిట్లు చెప్పియున్నాడు. "ఇది నీజీవితములో సాయంసమయమనియే నిత్యమును భావించుచు ఒక్కొక్క లిప్త నొక మహా యుగమువలె భావించి కాలమును వ్యర్థముచేయక భగవానుని స్మరింపుము. మరణదినము నీకెప్పుడు రానున్నదో నీకేమియును తెలియదు. అంధకారము రాకమునుపే త్వరితముగా నడువవలయును. దొంగనవ్వులతోను విషయ చింతలతోను కాలము వృధాపుచ్చుట కింక నీకుతడవులేదు." సుందరీదేవి శోకమునుగాంచిన వారెల్లరకును దుర్భరముగానుండెను. హరనాథుని గురించి తన భర్త పలువిధముల చెప్పియుండుటను తలచుకొనుచు మరింత యేడ్చుచుండెను. తన సర్వాశయములును సర్వ హృదయమును నిప్పుడామె తన చిట్టితండ్రియగు హరనాథునియందు లగ్నముచేసుకొని వానికొరకై తన దుఃఖమును దిగమ్రింగి యూరకుండెను.

## మరియొక చోరుని బ్రోచుట.

హరనాథ బాలుని వయస్సిప్పుడు 3½ సంవత్సరములు. తన భావములన్నింటిని క్రమ క్రమముగా, చిన్నమాటలతో స్పష్టపరచుచుండెను. సుందరీదేవి తన ముద్దుల తనయుని యమృతవాక్యములను వినుచు, తనలోతానే యానందపడుచు ఘంటలకొలది వానితో కాలక్షేపము బుచ్చుచుండెను. ఒకరోజు సాయంకాలమున మన చిన్ని తండ్రియగు హరనాథుని పెరటిలో మంచముపై బరుండబెట్టెను. అది వేసవికాలమగుటచే పెరటిలోనే యందరకును పాన్పులు వేయబడెను. కమలాదేవియును, హరనాథుడును, యొకమంచముపై పరుండియుండిరి. రాత్రి సుమారు 8-30 గం॥ లాయెను. సుందరీదేవి ఫలహారము దీసుకొనుచుండెను. అదే సమయమున నా వీధిలోని యొక యింటిలో దొంగ చొరబడి, కొన్ని వస్తువులను దొంగిలించి పారిపోవుచుండగా నాయింటి యజమానులు కేకలు వేయుచు వాని వెంట పరుగిడసాగిరి. గోడలను దాటి యాదొంగ జయరాముని గృహావరణయందలి గడ్డిమేటు వెనుక దాగుకొనెను. ఆస్థలమున కతి సమీపముననే హరనాథ బాలుడు పవళించి యుండెను. ఈ చోరునకు పాపవిమోచన కాలము వచ్చినది! సాక్షాత్ భగవంతుని సమీపముగా యాతడు దాగుకొనియున్న సంగతి వానికి తెలియదుకదా. అదే సమయమున హరనాథ బాలుడు "రాధాగోవిందా" అని యరచెను. కమలాదేవింకను మేల్కొనియే యుండెను. తన సోదరుడు నిద్రలో పలవరించుచున్నాడనుకొని, యామె హరనాథుని జోకొట్టుచుండెను. హరనాథుడీమాట నుచ్చరించిన తోడనే దాగుకొనియుండిన చోరుని హృదయమంతయు మారిపోవుచుండెను! "ఛీ! ఈ వృత్తి నేల యవలంబించితిని. ముష్టియడుగుకొని భుజించుచు నొక చెట్టు

క్రిందపరుండిన హాయిగానుండును కదా, ఇట్టి చిన్నబాలుడే భగవన్నామమును చేయుచుండగా నింతవయస్సు వచ్చినను నాకు పాపకార్యముల యందాసక్తి యేలపోకుండెను. భగవానుడే నేడీబాలుని కంఠమునుండీనామమునే స్మరించుచుండుమని నాకు చెప్పుచున్నట్లున్నది..."అని పలువిధముల యోచించి తన వెనుకటి పాపముల కెంతయో పశ్చాత్తాపబడుచు తుదకీ నీచవృత్తిని మానుటకై నిశ్చయించుకొనెను. (ఇదియే భగవానుడగు శ్రీ హరనాథుని యద్భుతశక్తి ఇంతకంటెను నెక్కువ యద్భుతముగా ఘోరపాపుల హృదయములను ప్రభువుమార్చి వేయగల్గుచుండెను. అట్టి పతితుల పూర్ణచరిత్రలను, వారినామములను కూడ ముందు ముందు వ్రాయబడుచున్నవి.)

ఇంతలో సుందరీదేవి పెరటిలోని కేతెంచెను. ఆ చోరుడు వెర్రి ధైర్యమును దెచ్చుకొని, సుందరీదేవి యెదుటపడి "అమ్మా నన్నుక్షమింపుము, నీవే నన్ను రక్షింపవలయును, నేనొకచోరునిగా నుంటిని, ఇప్పటికి బుద్ధివచ్చినది అని చెప్పుచు ప్రణామముచేసెను. ఇంటిలోని వారందరు యీచిత్రమునుచూచి, వస్తువుల యజమానులకు కబురంపి వారివస్తువులు వారికిప్పించి దొంగను విడుదలచేయించిరి. ఈ బాలునిముఖమా దొంగ తిలకించి, "అమ్మా, ఈ బాలునిలో నిజముగా భగవానుడున్నాడు. వీనివలననే నిజముగా నాకు సద్గతి ప్రాప్తించినది. నాకు పాపవిమోచనము సంప్రాప్తించినది" అని హరగోపాలు నెంతయో స్తుతించుచు, "రాధాగోవిందా" యనుచు వెడలిపోయెను.

తన బాలుడు నిద్రలో కూడ భగవన్నామమునే స్మరించుచున్నాడని, కమలాదేవి వలనవిని సుందరీదేవి యెంతయో యానందపడెను. కాని అట్లు పవళించియున్న చిన్నబాలుడు జగదోద్ధారుడగు పరమపురుషుడే యని అనుమానమైనను పడియుండలేదు.

—: హరనాథుని భగవత్తత్వము సుందరీదేవికి తెలియజేయుట :—

నాటిదినమున హరనాథుని శరీరమును తాకిన క్షణమునుండియు శశిభూషణుని హృదయము నానాటికి మారిపోవుచు పవిత్రమగు చుండెను. హరనాథుడు సామాన్య నరుడు కాడని యాతని హృదయము సదాచాటుచుండెను. ఒకదినమున సుందరీదేవి యొద్దకు శశిభూషణుడే తెంచి "అమ్మా! నీ కుమారుడగు హరనాథుడు సామాన్య నరుఁడు కాడని విశ్వసింపుము. ఈకలియుగము నందలి ఘోరపాపులను బ్రోచుటకై యవతరించిన భగవానుడే యాతడని నాకు దోచుచున్నది." అని చెప్పెను.

సుందరీ:—"నాహరనాథుడు భగవంతుడా నీకేమి మతిపోయినదా"?

శశిభూష:—"నాడు బంగారపు హారము మాపెరటిలోని కుండీలోనున్నదని నీకెవ్వరు చెప్పిరి?"

సుందరీ:—నాబాలుడే చేతితో జూపుచుండగా నప్రయత్నముగా నే నచ్చటకు బోతిని."

శశిభూ:—"రెండుసంవత్సరముల బాలునికా రహస్య స్థలమెట్లు తెలియును? మరియు హారమును దొంగిలించిన వానిని నే నెరుంగుదును. ఈ పిల్లవానికి తెలియకుండగనే వారాయురికి గుంటలో పారవై చుచుండుట నే నెరుంగుదును. ఆ చోరుని నామముతో నీ కేమిబని సమయము వచ్చినప్పుడు చెప్పెదనులే. కానీ, నీబాలుడు సామాన్యనరుఁడు కాడని మాత్రము విశ్వసింపుము. ఇంకను కారణములున్నవి."

సుందరీదేవి హృదయ మనేక భావములతో నిండియుండెను. నాటిదినమున సర్పమాతని వంకే జూచుట. మరియొక సర్పమాతని పాన్పుపై యానందముగా పడగనువిప్పి బాలునితో యాడుకొనుట,

అఘోరుడు నాటిరాత్రి హరనాథుడు నెంతయో స్తుతించుట మున్నగు విషయము లామెకు జ్ఞాపకమునకు వచ్చుచుండెను. అదేసమయమున హరనాథు డచ్చటకువచ్చెను. బాలుని చూచినతోడనే యామె విశ్వాసమంతయును క్షీణించిపోయెను.'' సందేహపరంపర లెన్నియో నామెకు దోచుచుండును. "హరనాథుడు సామాన్యబాలుడే కాని మరియెవ్వరునుకాడు. అయినను శోధించెదను" అని తీర్మానించు కొనెను.

## —: సుందరీదేవి, హరనాథుని శక్తులను శోధించుట :—

ఆమె యొక తమలపాకుల పెట్టె నొకధాన్యపు గాదిలో బెట్టి వీధిలో యాడుకొను హరగోపాలుని లోనికిబిలిచి "నాయనా''! తమలపాకులబెట్టె కాన్పించుట లేదోయి దానిని వెదుకుము" అని యాజ్ఞాపించెను. తక్షణమే హరనాథుడామెతో నిట్లు జెప్పెను. "వెర్రి తల్లీ! నీకునిజముగా తెలియదే. ఆనిచ్చెనను నిచ్చటవేసి ధాన్యపు గాదిలో బాగుగా చూడుము" అనిచెప్పెను. సుందరీదేవి హాశ్చర్యమునకు మితిలేదు. అనేక విధములగు భావములామెను కలవరబెట్టు చుండెను. శశిభూషణుని వాక్యము లసత్యములు కావని యామె తలంచుచుండును. "ఈత డెవరై యుండవచ్చును? కొన్నిశక్తులతో కూడుకొనిన పరమభక్తుడు కాని లేక సిద్ధులను బడసిన యోగిపుంగవుడు కాని కావచ్చునని" తన మాయామనస్సు చెప్పుచుండెను. హరనాథుని యందామె కింతకు పూర్వము మెరుపుతీగవలె కాన్పించిన భగవత్ భావము క్షీణించిపోయెను. పాఠకులారా! ఇదియే భగవల్లీల. ఆయన భగవానుడని విశ్వసించుటకై యాయనే మనకు విశ్వాస మొసంగవలయును. మహామాయ సదా యాయన భగవత్ స్వరూపమును జీవుల మనోనేత్రమునుండి కప్పివేయుచుండెను. మన

లకు విశ్వాసమిచ్చుచున్నదియు ఆవిశ్వాసము లొక్కపెట్టున లాగివేయు నదియుకూడ యాతడే. మన మనస్సు సదా యాయన సంకల్పమును బట్టియే పనిచేయుచుండును. తన స్వరూపమును దాచుటకై నేవ్యక్తి కెట్టి విధమగు సందేహమును కలిగింపవలయునో సర్వజ్ఞుడగు యాయ నకు పూర్తిగా తెలియును. కనుకనే శ్రీ హరనాథుడిట్లు జెప్పు చున్నాడు:—"దాగుడుమూతయాట ఎంతయో మధురమైనయాట" నావారిని నేనే యెన్నుకొనెదను. నాయంతట నేనే కట్టుబడవలయును కాని మీ ప్రయత్నములచేగాదు'' మరియు నెంతటి రహస్యములు కూడ హరనాథునికి పూర్తిగా తెలియుననియే సుందరీదేవి కనేక దృష్టాంతములు కాన్పించెను. తన తనయుడు సామాన్య నరుడు కాడని మాత్రము యామె విశ్వసించుచుండెను.

## వేణునాదము.

(శ్రీహరనాథుని సహాధ్యాయుడగు రామచంద్ర ముఖర్జీ M. A. అను భక్తుడెన్నియో విషయములు సుందరీదేవివలన తెలిసికొనెను. వారినుండియే ఈవిషయము వెలువడినది.)

శ్రీహరనాథుడెవరై యుండవచ్చునని సుందరీదేవి కప్పు డప్పుడు శంకగలుగు చుండెడిది. నిత్యమును ఏవో యద్భుతము లామె గ్రహించుచు శ్రీహరనాథుని వలననే యవి జరుగుచున్నవని యోచిం చుచుండెను. వెంటనే ప్రభువు తన విష్ణుమాయను ఆమెకు కప్పుచుం డుటవలన శ్రీహరనాథుడు సామాన్యనరుడేయని భావించుకొను చుండెను.

ఒకదినమున హరగోపాలుడును ఆమెయును తదితరులును గది లో నిద్రించుచుండగా నామెకు స్పష్టముగా వేణునాదము వినిపించు టచే వెంటనే మేల్కాంచెను. హరనాథబాలుడు నిద్రించునట్లే కాన్పిం

చినను స్పష్టముగా నామెకు తన బాలుని పాన్పువద్దనుండియే మనోహరమగు నాదము వినవచ్చుచుండెను. ఇట్లుకొన్ని నిమిషములు వినవచ్చి యాగిపోయెను.

మరి యొకదినమున తెల్లవారు జామున మనోహరమగు కృష్ణగీతము యెవ్వరో స్త్రీలు పాడుచున్నట్లు వినవచ్చెను. ఆమె మేల్కాంచిన తరువాతకూడ కొలది నిమిషముల వరకును స్త్రీకంఠ ధ్వనివినవచ్చెను! శ్రీ కృష్ణుడే తనయందలి ప్రేమచే నిట్టిలీలలను తన గృహమునందే జూపుచుండెనని యామె యూహించుకొనుచుండెను. హరనాథుడు పుట్టుటకు పూర్వము ఇట్టి విశేషమెన్నడును ఇంత చిత్రముగా జరిగియుండలేదని యామె తెలియజేసెను.

శ్రీ హరనాథుని శక్తులను కొన్నింటిని ఆమె ప్రత్యక్షముగా శోధించి నందువలన ఇట్టి లీలలన్నియును కూడ హరనాథుని విశేషమేమోయని అప్పుడప్పుడు శంకించుచుండెను.

మరియొకరోజున తనగృహమందే ఆమెపూజ సల్పుచుండగా హరగోపాలుడుకూడ తప్పటడుగులు వేయుచు వచ్చి తనతోబాటు పూజలు సల్పుచుండెను. తనతోబాటు హరనాథుడుకూడ పూజించుట కదియే ప్రథమము. పూజ సల్పుచుండగా మహత్తరమైన యొక తేజస్సును అనేకవిధములగు సుగంధపరిమళములును పీఠమునుండి వచ్చుచుండెను! తనగుప్త సరలీలకెట్టి భంగమును రానీయకుండగ ప్రభువు ఆమెను సంతసింపజేయుచు ఆమె లక్ష్యమును సదా భగవానునిపై త్రిప్పివేయుచుండెను.

భగవానుడు తన గృహమందే నిలయుడై సదా తనయందు దృష్టిని నిలిపియున్నాడను స్థిరభావమామెకు జనించెను. ఇట్లు జనింపజేయుటయే శ్రీ హరనాథుని యుద్దేశము.

# సుందరీ చంద్రావళీ దేవులు.

సోనాముఖిలో కందర్ప సుందరభట్టాచార్యుడను నొక మహాభక్తుడుండెను. సుందరీదేవి తండ్రియును, కందర్ప సుందర భట్టాచార్యుడును అత్యంతమైత్రి కల్గియుండిరి. వీరిరువురును బ్రాహ్మణులే యైనను ఒకేశాఖకు చెందినవారుకారు. కందర్ప నారాయణు లీవిషయమును గ్రహించి విచారించుచు సుందరీదేవి తండ్రితో తన కెట్టి బాంధవ్యమును కలుగనేరదుకదా యని విచారించుచుండెను.

కందర్ప నారాయణుని భార్య చంద్రావళీదేవియును సుందరీదేవియును వీరిరువురు ప్రాణస్నేహితులనియే చెప్పవచ్చును. అన్యోన్య ప్రేమాతిశయములను వెలిబుచ్చుచు సంసార విషయము లెన్నియో మాట్లాడుకొనుచుండిరి. హరనాథుని మహాసుగుణములను హరనాథుని శక్తులును చంద్రావళీదేవికి ప్రత్యక్షముగా జూచు భాగ్యము కలిగెను. హరనాథుడు సామాన్యబాలుడు కాడనియు ఒక మహాపురుషుడనియు ఈయనకీర్తి దేశములన్నిట ప్రాకితీరుననియు ఆమె విశ్వసించుచుండెను. మరియు హరనాథుని తనగృహమున కప్పుడప్పుడు తీసికొనిపోయి తినుబండారముల నొసంగుచుండెను. హరనాథుని కే గృహలక్ష్మి యొద్దను క్రొత్తలేదు.

ఇరుగు పొరుగు తల్లు లెవరైన యాతనిని తమ గృహమున కాహ్వానించినచో వెంటనేబోయి వారియొడిలోనే గూర్చొనుచు స్వంతబిడ్డకంటె హెచ్చుస్వతంత్రముతో మాట్లాడుచుండెను. కొలది రోజులలో హరనాథుని యందు ప్రతిస్త్రీయును అత్యధిక వాత్సల్యమును జూపుచుండెను.

ఒకదినమున సుందరీదేవితో మాట్లాడుచు చంద్రావళీదేవి "సుందరీ" మనమైత్రి చాలా పవిత్రమై బలవత్తరమైనదని తెలియును

గదా ఈమైత్రి బాంధవ్యముగా మారినప్పుడే నాకత్యంత ప్రీతికల్గును. నీవేమనెదవు.

"చంద్రా"! నీయభిప్రాయమే నాయభిప్రాయము. సోదరీ! ఇంతవరకును మనకే విషయములో భిన్నాభిప్రాయముకలిగినది!

"సుందరీ!" అట్లయిన నాకొక కోర్కెయున్నది. నాకు కుమార్తె పుట్టినచో మీ హరనాథునికిచ్చి వివాహము చేయవలెనని తపించుచున్నాను. నాహృదయమంతయూ హరనాథుని వైపేలనోగాని యాకర్షింపబడుచున్నది. వానిని నాగృహమునకు దెచ్చుకొన వలయును.

సుందరీదేవి పకపకనవ్వి,

"అమ్మా! నీకు మతిపోయినది. నీకు కుమార్తె పుట్టినప్పుడు చూచుకొనవచ్చునుగదా! ఇప్పటినుండియు నీకేలయాందోళన"

అట్లుకాదు. హరనాథుని యందలి మమతచే నేనిట్లు జెప్పుచుంటిని. వానితో నాకు బాంధవ్యము కలుగుటచే నేను ధన్యురాలయ్యెదను. నాపిచ్చితో నీకేమిపని? నాకు కుమార్తెపుట్టినచో హరనాథునిచ్చి వివాహము జేసెదనని ఇప్పుడు వాగ్దానము చేయగలవా లేవా?" అని దీనముగా అడిగెను. సుందరీదేవి వాగ్దానముజేసెను!

## చంద్రావళీదేవి గర్భమును దాల్చుట.

నాడు సుందరీదేవి వాగ్దానము చేయునప్పటికే చంద్రావళీదేవి గర్భవతిగా నుండెను. ఆమె గర్భమునుండి సాక్షాత్ జగజ్జనని యగు కుసుమకుమారీమహాదేవియే రాదలంచెనని ఎవ్వరికిని తెలియదాయెను. ఇదియే కుసుమహరనాథుల ప్రత్యక్షగుప్త భగవల్లీల.ఆమె యవతరించుటకు ముందే హరనాథునకిచ్చి వివాహము చేయబడెను!! ఎట్టి మానవ ప్రయత్నములును మానవ సంకల్పములును కూడ భగవదేచ్ఛకు కట్టువడియే యుండునని మనకిప్పుడే తెలియుచున్నది.

# కుసుమ కుమారీదేవి జననము.

చంద్రావళీదేవికి నవమాసములు పూర్తి యయినను ప్రసవించకుండెను. 11 మాసములు పూర్తియయిననుకూడ బ్రసవించకుండెను. ఆదినములలో సుందరీదేవి సోనాముఖ గ్రామమును విడచి తనపుట్టింటి కేగెను. అచ్చట పనులన్నియు పూర్తి అయినపిదప తిరిగి సోనాముఖకి వచ్చిరి. వీరువచ్చుటకు రెండు దినములు ముందునుండియు చంద్రావళీ దేవి ప్రసవించుటకై యెంతయో కష్టపడుచుండెను. ఆమె బ్రతుకుట దుర్లభమనియే తలంపబడెను. సుందరీదేవి కీవృత్తాంతము దెలసి చంద్రావళీదేవిని జూచుటకై బయలుదేరెను. హారనాథుడెచ్చట నుండియో వచ్చి తనకుమెత్తుకొనమని యేడ్వ ప్రారంభించెను. కమలాదేవి యెంతయూరడించినను ఎన్ని తినుబండారము లొసంగినను బాలు డేడ్పుమానలేదు. వేరుచేయునది లేక హారనాథుని చంకనిడుకొని సుందరీదేవి యతిదుఃఖముతో తన స్నేహితురాలెట్లుండనో యని చురుకుగా నడచుచుండెను. సుందరీదేవి చంద్రావళీ యుండిన గది యొద్దకువచ్చి తనకుమారునిదింపి లోనికేగు చుండగా హారనాథు డేడ్పు మొదలుపెట్టెను. యెంతయో విసుగుకొనుచు బాలుని చంక బెట్టుకొని గదిలోనికేగెను. చంద్రావళీదేవి తన బ్రతుకుపై నిరాశ జేసికొనుచుండెను. హారనాథుడు గదిలోనికి ప్రవేశించిన తక్షణమే చంద్రావళీదేవి బ్రసవించెను! కుసుమహారనాథు లెంత గూఢముగా తమభగవల్లీలలను జూపుచున్నారో గమనింపుడి.

శిశువు పుట్టినను యేడ్చుటగాని కండ్లను విప్పి జూచుటగాని లేదు. శిశువు బ్రతికియున్నదో లేదోయని జూచుటకై సుందరీదేవి శిశువును సమీపించెను. హారనాథుడు కూడా సమీపించి తదేకధ్యానముతో శిశువును జూచుచున్నాడు. వెంటనే యాబిడ్డ కన్నులు దెరచి

శ్రీ రాధాంశా సంభూతురాలగు

# శ్రీ శ్రీ కుసుమకుమారి దేవి.



"తల్లియనగా యెవరు?" అని యోచించిన మీ కష్టము లన్నియు గట్టెక్కును. కుమారులకు తల్లి పరిశుద్ధ ప్రేమరాసి, రక్షకురాలు. అగ్నినుండి వేడిని వేఱుచేయవీలులేనట్లు పై రెండుసుగుణములు మిమ్ములనుండి నన్ను వేఱుచేయలేవు. మీ మనోక్లేశములను నాపై విడిచి నిశ్చింతగ, సుఖముగ నుండుడు, మీరందఱును యొకచోట సమావేశమై మీ ప్రభువును గూర్చి సంభాషించుటకు ప్రయత్నింపుడు. నాకుమారులందఱు యొకే ప్రేమపాశముచే యొక్కటిగ కట్టబడియుండగా చూచుటయే నాకోరిక."

మాతృశ్రీ కుసుమకుమారి దేవి.

తన ప్రథమదృష్టిని హరనాథుని పావన స్వరూపముపై. ప్రసరింప జేసెను!! ఈయవతారములోని తన నాథుడగు దేవదేవుని వేషమును బాగుగా తిలకించెను. ఈ బాలమూర్తిని తన మనోనేత్రముల యెదుట ముద్రించుకొని యానందాతిశయమున యేడ్వ ప్రారంభించెను! కొంతసేపైన తరువాత సుందరీదేవి హరనాథు లాగదిని విడచి తమ గృహమునకు వచ్చిరి.

ఆహా! జగన్నాథుడు మన కన్నుల యెదుట ఎన్నెన్ని చిత్రములు- జేయుచున్నను ఆయన కృపలేనిదే గ్రహింపజాలము గదా! దీనినే భగన్మాయ యనెదము.

# శ్రీ హరనాథ లీలా తత్త్వము.

భగవానుడు నరరూపమున వ్యక్తమైనప్పుడు సామాన్య నరుని వలెనే నటించుచు తన భగవత్ స్వరూపము లెన్నియో విధములుగా కప్పిపుచ్చుకొనును. తన యాంతరంగిక భక్తులకు మాత్రమే తన భగవత్ స్వరూపమును జూపుచు ఎట్టి దాగుడు మూతలును లేక వారి సమక్షమున సంచరించు చుండెను. నారద పురాణముకూడ నిట్లే చాటుచున్నది. కాబట్టి అవతారపురుషుని బాహ్యలీలలు జూచి నచో సామాన్యజీవులు మోసపోయెదరు. అతడొక భక్తుడనియో లేక సిద్ధుడనియో భ్రమించెదరు.

శ్రీహరనాథుడే కాళీమాత యని విశ్వసించిన మణికారు మహాశయునకును సదానంద బ్రహ్మచారికిని మహాప్రభు వగు శ్రీ హరనాథుడు కాళీమాతగా వారికి దివ్యదర్శన మొసంగెను. శ్రీహరనాథుడే గౌరాంగుడని విశ్వసించిన రావుసాహేబ్ సతీష్ చంద్రబంధోపాధ్యాయునకు అద్భుత తేజస్సుతో గూడుకొనియుండ యౌవ్వనస్వరూపముగా దర్శనమిచ్చి 'నేనే గౌరాంగుడ నని' యాతని హృదయ

మునకు జెప్పెను. హరనాథుడే సదాశివుడని విశ్వసించిన బోలానాదీ మహాశయునకు అట్లే దర్శనమయ్యెను. లక్ష్మీనరసింహోపాసకు డగు బరంపురంలోని సత్యనారాయణరావుగారి మామగార్కి భయంకర మగు లక్ష్మీనరసింహాకృతితో దర్శన మిచ్చెను. కొందరికి తాత్కాలిక భగవదృష్టిని ప్రసాదింప జేసి తన యఖండ స్వరూపమును జూపెను. నరలీలను దర్శించుచున్నప్పుడు తన స్వరూపమును గప్పిపుచ్చుటకై శ్రీ హరనాథు డనేక విధములుగా మాయానాటకమునే యాడుచుండెను.

అయితే అవతార పురుషుని సమకాలికులు సాధారణముగా ఆయన భగవత్తత్త్వమును గుర్తింపజాలరు. భగవాను డేవైనను అద్భుత కార్యములు చేసినచో, "ఇదియొక హైంద్రజాలము. ఇతడొక శిద్ధుడే" యని మున్ను దుర్యోధనాదులు కృష్ణుని పరిహసించినట్లే జెప్పెదరు. ఎట్టి శక్తులును జూపక పరిశుద్ధ నరునివలెనే యాతడు సంచరించినచో ఈతడొక పుణ్యజీవుడు; భక్తుడు-" అని యోచించెదరు-"నేనే భగవానుడ" నని జెప్పినచో ఇతడొక వంచకుడు. తనకు శాశ్వితఖ్యాతి రావలయునని యిట్లు చెప్పుచున్నా" డని ఇప్పటి క్రైస్తవ మహమ్మదీయాది మతస్థులు భగవద్గీతను గురించి పరిహసించుచు ఉపన్యాసము లిచ్చుచు పామరులను తమ మతములో జేర్చుకొనునట్లే పరిహసించెదరు. "నేనును మీవలెనే సామాన్య నరుడనే" అని యాయన జెప్పినచో "ఆతడు భగవానుడు కాడని ఆతడే యొప్పుకొను చున్నాడు! ఆతడు భగవదవతారపురుషు డెట్లగును?" అని తర్కించెదరు. కనుకనే ప్రభుహరనాథు డొక సందేశములో నిట్లు జెప్పుటకు కారణమైనది.

"This play is a very difficult one to act"
"ఈ యాటను యాడుటెంతయో కష్టము."

కనుకనే భగవదవతార పురుషుడు తన స్వరూపమును గూర్చియు తన భగవత్తత్త్వమును గూర్చియు తన యాంతరంగికులకే సాధారణముగా నెరింగించును. కనుకనే మున్ను కృష్ణావతారములోకూడ ప్రభువు తన భగవత్తత్త్వమును గూర్చి తన యాంతరంగికుడగు అర్జునునితో మాత్రమే స్పష్టముగా జెప్పెను. హరనాథావతారములో ప్రభువున కనేకు లాంతరంగికులుగా నుండిరి. వారితో తన భగవత్తత్త్వమును గురించి స్పష్టముగా జెప్పుచుండెను.

తదితరులతో కూడ ఒక్కొక్కప్పుడు తన భగవత్తత్త్వమును గురించి స్పష్టముగా జెప్పి జెప్పి "నేనిప్పు డేమిచెప్పితిని? ప్రియులారా! నేనేమి మాట్లాడెదనో ఏమిచేయుదునో అప్పుడప్పుడు నాకే తెలియకుండ జరుగునుసుమా. నాలో నెవరో యుండి అట్లు పలుకుచుందురని యూహించెదను ఆహా! మీరే నిజముగా ధన్యులు. కనుకనే భగవానుడు నానుండి మాట్లాడుచున్నప్పుడు ఆయన కంఠధ్వనిని మీరు వినగల్గితిరి. ఆయన పావనస్పర్శను పొందగల్గితిరి. ఆయన ముఖారవిందమును చూడగల్గితిరి. నాకట్టి భాగ్యము అబ్బలేదు కదా!" యని చెప్పుచు తన నిజ స్వరూపమును కప్పివేయుచుండును! పైవిధముగా దీనముగా మాట్లాడునదికూడ భగవానుడే యని ఆంతరంగికులు గాక ఇతరులలో కొలదిమంది మాత్రమే గ్రహింపగల్గుచుండిరి. కనుకనే శ్రీహరనాథు డిట్లొక సందేశములో జెప్పుటకు కారణమైనది:—

"My inner and outer selves are different. Hence your difficulty in urderstanding me. My life is a great riddle It is a sealed book to any others. I am not simple & can neverbe.

"నా అంతర్ బహిర్ స్వరూపములు వేరువేరు గనుకనే నన్ను తెలుసుకొనుట మీకెంతయో కష్టమగుచుండును. నాజీవిత మొక మహా సమస్య. ఇతరుల కదియొక సీలు వేయబడిన గ్రంథము. నేను సులభ గ్రాహ్యుడనుగాను, అట్లుండుటకు వీలులేదు.

అవతారపురుషులు నిర్యాణమైన క్షణమునుండియే వారి పవిత్ర నామము ప్రపంచమంతటను క్రమ క్రమముగా అల్లుకొనిపోవును. శ్రీ హరనాథుని నామమందలి యత్యద్భుత శక్తి ఇప్పుడు వేలకువేలు జీవుల హృదయములను వశము చేసుకొనుచున్నది. ప్రభునామ మిప్పుడు హిందూదేశమునందలి ప్రతి రాష్ట్రమునందును అనేక గ్రామములకుగూడ మహా వేగముతో వ్యాపించుచున్నది. కోట్లకొలది జీవులు ప్రభుహరనాథుని పాద పద్మములపై విశ్రాంతిని దీసుకొని తమ తమ పాప భారములను హరింప జేసుకొనునట్టి సుదినము వచ్చుచున్నది.



శ్రీ కుసుమహరనాథాయనమః.

# శ్రీహరనాథావతారము

5-వ అధ్యాయము.

---

## విద్యాభ్యాసము.

---

హరనాథుని కిప్పుడు 5 సం॥ వయస్సు. కులాచారమును బట్టి వానిని బడికి పంపుటకు సమయము వచ్చెను. ఒక శుభదినమున యా గ్రామమందున్న నొకయుపాధ్యాయుని పిలిపించిరి.

ఉదయముననే బాలునికి స్నానము జేయించి శివాలయమునకు దీసుకొనిపోయి యచ్చట మారేడు దళములతో మహేశ్వరునకు పూజలుచేయించిరి. మహాశ్రద్ధాభక్తులతో హరనాథుడు పూజలు చేసెను. గృహమునకు వచ్చిన పిదప శ్యామసుందర విగ్రహముల దర్శనము చేసుకొని శ్యామసుందరుని పూజాపుష్పములను తన శిరస్సునందుంచుకొని హరనాథు డావీధిగదిలోనికి వచ్చెను. తోడి బాలురెందరో యచ్చట గుమిగూడి యుండిరి. హరనాథుని విద్యాగురువు యచ్చటనే కూర్చొని సిద్ధముగా నుండెను. ఈ యుపాధ్యాయుడు శ్రీ కృష్ణ భక్తుడు. మహాప్రభు వగు శ్రీ హరనాథుడు తన విద్యాభ్యాసమునకై నియమింపబడిన శుభముహూర్తములో భగవన్నామోపదేశమును

నీయుపాధ్యాయునికే జేసి వానికి పరాభక్తిని ప్రసాదింప నిశ్చయించుకొనెను. అయితే తన గుప్తనరలీలల కెట్టి భంగమును కలుగకూడదు. ఎంతచిత్రముగా తన నామసందేశము నితరులకొసంగుచు, అచ్చట నుండువారలెల్లరకును తన నోటినుండి వచ్చు భగన్నామమును విని పించి వారి కర్మక్షయమును జేయ నిశ్చయించుకొనెనో చూచెదము.

ఉపాధ్యాయు డొక బెంగాలీ యక్షరమును నేర్పుటకై వ్రాయుచుండగా "తండ్రీ! సర్వమునకు మూలమగు భగవానుని పవిత్రనామమును వ్రాయుటెట్లో నాకు మొదటనేర్పు" "రాధాగోవింద" అను నామము "నెట్లు వ్రాయవలెనో జెప్పుడి" అని "రాధాగోవింద" అను నామమును బిగ్గరగా స్మరియించెను. హరనాథు డీనామము నుచ్చరించుచుండగా అచ్చట వారి హృదయములెల్లను ద్రవీభూతమగుచుండెను. ఆమె హృదయము ప్రేమపూరితమవ, తన కుమారుని భక్తికిని జ్ఞానమునకును మెచ్చుచు సుందరీదేవి తన యానందభాష్పముల నాపుగొనలేక లోనికిబోయెను. శశిభూషణుడును, అనంతబంధోపాధ్యాయుడును, చంద్రావళీదేవియును, శివనారాయణుడును అచ్చటనేయుండిరి. వారి హృదయములలో నవాచ్యమగు భావములెన్నియో తుపానువలె వ్యక్తమగుచుండెను. ఆహా! కనకలతాదేవి జన్మము నేటికి (ఈజన్మమున) ఫలించెను గదా. సర్వమంగళగుణాకరుడును జగన్నాధుడును, దీనదయాళుడును, పతితపావనుడును అగు భగవానుడు ఒక బాలునిగా కాన్పించుచు తన గృహమునందే యామె కన్నుల యెదుటనే తన యఖండప్రేమను నిర్హేతుక కృపారసమును ప్రదర్శింపుచున్నాడు!

ఉపాధ్యాయుని హృదయ మానందములో పొంగుచుండెను. తన హృదయమంతయు భగవత్ ప్రేమచే లీలామానుష స్వరూపముగా నున్న హరనాథ దేవదేవునిచేతనే పూరింపబడుచున్నదని యాతనికి దెలియుచుండెను. అదే సమయమున అప్రయత్నముగా

నచ్చట బాలురెల్లలును "రాధే గోవింద" యని బిగ్గరగా స్మరింపు చుండిరి.

హరనాథు డవతరించిన ముఖ్యోద్దేశములలో నొకదానిని జీవులకే శుభముహూర్తమున సూచించుచున్నాడు. ఉపాధ్యాయు డీనామమునే వ్రాసెను. దాని నంతయును ఒక్కసారి బాగుగాచూచి గగుర్పాటుతో గద్గదస్వరముతో హరనాథుడు బల్కుచు దిద్దుచున్నాడు.

—. భగవన్నామ విశ్వరూపము :—

[ఈవిషయము జ్యోతిష్‌చంద్ర విస్వాస్‌గారివలన మాకు తెలిసినది]

హరనాథు డతిశ్రద్ధతో విద్యాభ్యాసమైన దినము నుండియు తన బడికిపోవుచుండెను. ఒక దినమున తన తోడిబాలుర నందరిని బిలచి "సోదరులారా! భగవన్నామములను కాగితములపై వ్రాసి మనము బడి గోడలన్నింటికిని యంటించవలయును. ఈపని రేపుదయమునకు చేయవలయు" నని చెప్పెను. హరనాథుని మాటలయందు వారత్యధికగారవమును భక్తియును నిలుపుకొనుచుండుటచే నట్లేచేయుటకు సంతసించిరి.

మరునాడుదయమున నెవరికాగితములను వారు గోడల కంటించిరి. అంతలో వారి యుపాధ్యాయు డేతెంచి చూడగా చింపిరి కాగితములవలె గోడలపై యుండెను. అదేసమయమున అభదత్తునాందీ యను నొక గ్రామస్థుడు కూడ నచ్చటనే యుండెను. ఈపని యంతకును మూలకారణము హరనాథుని ప్రభావమే యని తెలుసుకొని "హరనాథ్! నీకు మతిపోయినదా! యీ చింపిరికాగితములు యేల యంటించితివి. ఇవి చూచినవారెల్లరును మనలను పిచ్చివారినిగానెంచి నవ్వుచున్నారు. కాగితములన్నియును లాగివేయుము" అని మందలించుచుండెను. అభదత్తునాందీ యీ కాగితములను చూచి

పకపక నవ్వుచు నిలువబడెను. హరనాథు డిది చూచి "అయ్యా! కోపించకుడి కాగితము లెంత చింపిరిగా నుండిననేమి వాటిపై నెంత యో భక్తిచే వ్రాయబడిన భగవన్నామమునుకూడా చింపిరిగానే యుండునా? ఆనామమునకు మించిన రత్నమెచ్చటగాని లేదు. అని చెప్పుచు "రాధా గోవిందా" "గోపాల్" అనుచు యానామములను బిగ్గరగాచదువుచు యానందభాష్పములను వదలుచుండెను. అభదత్తు నాందునిహృదయము ద్రవీభూతమయ్యెను. తన వెకిలినవ్వుమాని తదేక ధ్యానములో హరనాథునివంక రెప్పవాల్పక జూచుచుండెను. హరనా థుడు గద్గదస్వరములో నేడ్చుచు భగన్నామము బిగ్గరగా జేయుచు న్నాడు. ఆయేడ్పువినిన ప్రతివారి హృదయములును ద్రవీభూతమగు చుండెను. దుర్భరమగు ప్రేమభావోద్రేకము అభదత్తుని వశముచేసుకొ నెను. అద్భుతము! అభదత్తున కీప్రపంచక చైతన్యము తగ్గుచుండెను. "రాధా గోవింధా" యనునామము మాత్రమే వినిపించుచుండెను. బ్రహ్మాండమంతయును భగవన్నామమునే స్మరించుచు గర్జించుచున్నట్లా తనికి కాన్పించుచుండెను. ప్రతిజీవియును తుదకు రాళ్లుకూడ భగవానుని వైపున కాకర్షింపబడి మురళినాదమువలె వివిధస్వరములతో తదేక ధ్యానముగా భగవన్నామమునే స్మరించుచున్నట్లు గోచరించు చుండును. కలియుగములో శులభము క్తిమార్గము కేవలము భగ వన్నామ స్మరణయే యని యాతనికి గోచరించుచుండెను. చైతన్యము పూర్తిగా తప్పి యీ విశ్వమోహన హరినామమునందు లగ్నమన స్కుండై నేలపై బడిపోయెను. సాక్షాత్ గోపాలుడె నేడు హరగోపా లుడై కలియుగంబున నవతరించెనని యాతని హృదయము చెప్పు చుండెను.

కొంతసేపటికి స్పృహ తెచ్చుకొని యేడ్చుచు భగవన్నామము స్మరించుచుండెను. హరనాథుని యెత్తుకొని తన వక్షమున కద్దుకొని

ముద్దులతో యాతనిని ముంచివేయుచుండెను. పాఠకులారా! ఈతడు (కొన్నిసంవత్సరములు తరువాత) హరనాథుని భక్తకోటిలో నొక డాయెను. స్వర్ణముఖిలోను దానికి చుట్టునున్నగ్రామములలోను హరి నామప్రచారము హరనాథుని యాజ్ఞననుసరించి సలుపుచుండెను. కొంతకాలముక్రిందటనే యీతడు హరినామస్మరణచేయుచు తన ప్రాణ మును బ్రహ్మానందములో విడచెను.

జీవులలో మార్పు గలుగజేయుటకై భగవానుని కెట్టి యుప న్యాసములును యవసరము లేదుకదా! తన సంకల్పమాత్రముచే జీవులహృదయములను భగవత్ ప్రేమతో పూరించి వారిచే నాట్యము చేయింపగలడు. వారిని తనశాశ్వత పాదసేవకులుగా జేసుకొనగలడు. శ్రీహరనాథుని భక్తకోటిని గమనించినచో వేలకువేలు జీవు లిదే విధమున హృదయమార్పును జెందియుండిరి. అట్టివారనేకు లింకను సజీవులై యహర్నిశలు హరినామస్మరణ జేయుచున్నారు.

## హరనాథ బాలుడు.

### హరిసేవాసంఘమును స్థాపించుట.

హరనాథుని కిప్పుడు 6 సం॥ ల వయస్సుండును. హరనాథుడు సామాన్య బాలుడు కాడనియు అద్భుతశక్తులతో కూడుకొనియుండు నొక మహాపురుషుడో లేక అవతారపురుషుడో యని శశిభూషణుడును అభదత్తు నాందీయును అనంతబందోపాధ్యాయుడును తన యుపాధ్యా యుడును మరికొలదిమందియును పూర్తిగా విశ్వసించిరి. హరనాథు డసమాన్యవిశ్వప్రియు డనియు పరమభక్తుడనియు మాత్రమే యూరి లోని వారనేకులు యనుకొనుచుండిరి.

పై చెప్పబడిన గ్రామస్థులును తన తోడివారునుచేరి నిత్యభగవన్నామ సంకీర్తన సమాజమును స్థాపించిరి. ఇట్టిసమాజముగా మొదట బాలురందరును హరనాథుని ప్రేరేపణపై యాతని నాయకత్వముక్రింద యేర్పరచిరి. ఇంత చిన్నవయస్సులోకూడ హరనాథునికి సంగీత లయ స్వర నాట్యజ్ఞానమెంతయో యుండెను. ఆతడు గజ్జెలు కట్టుకొని చిరతలు పట్టుకొని భగన్నామస్మరణ తన స్నేహబృందములో కలసి చేయుచుండినచో ప్రేక్షకుల హృదయములు కరుగుచుండెను. కన్నీటి ధారలుహరనాథునిచెక్కిళ్లనుండి స్రవించుచుండును. నిమీలితనేత్రములలో దీనముగా భగవానుని వేడుకొనుచుండునట్లుండును. భగవానుని వెదకుచున్నాడా యనునట్లు సహజభావోద్రేకములను జూపుచు నటన చేయును. చూచుచున్నవారిని సమీపించి యతిదీనముగా "బాబా బోలో రాధే గోవిందా" యని జెప్పుచు వారి హృదయములను కరిగించి వారిచే భగన్నామమును జేయించి తీరునుకదా! ఆహా స్వర్ణముఖి క్షేత్రమెట్టి పుణ్యము జేసుకొనెనో గాని సాక్షాత్ ప్రేమనాథుడును జగదోద్ధారుడును అగు ప్రత్యక్ష భగవానుని పాదధూళిని ధరించుచున్నది. ఆయన పరమపావన మగు కన్నీటి దారలను గ్రహించుచున్నది. ఒక్కొక్కప్పుడు తన తోడిబాలురలో నొకనిని భావోద్రేకమున కౌగలించుకొని కెవ్వున యరచి స్పృహ దప్పి మన చిట్టితండ్రి నేలపై బడిపోవును.

ఇరుగుపొరుగు స్త్రీలందరును హరనాథుని గారాబముగాపిలచి "నాయనా! ఏదీ! నాట్యమాడుచు మాగదిలో నొక కీర్తన పాడి మాకానంద మొసగుమోయీ నీ చిన్నచిరుతలను వాయించుచు రాధేగోవింద నామమును మాచేతగూడ చేయించుము. చిట్టి తండ్రీ! నిన్నుగనిన సుందరీదేవి యెంతటి ధన్యురాలో గదా రమ్ము. మా యింటి కొకసారి రమ్ము. నీకు కావలసిన ఫలహారము నొసంగుటకు

సిద్ధముగా నున్నాము'' అని యనేకవిధములుగా హరనాథుని వేడు కొనగా వారి గృహంబుల కేగి యెవరి కేనామమిష్టమో యానామ మునే యతిమధురముగా పాడి వారి నానందసాగరమున నోలలాడించు చుండెను.

హరనాథు డిప్పు డెంతయో సుందరముగా కన్పట్టుచుండెను. తటాకమునందు పుష్పించియున్న తామరకమలమువంటి సొగసైన ముఖంబుతోడను, నొసటపై నూగులాడుచున్న ముంగురులతోడను, నల్లకలువరేకులవలె విశాలమైన కాటుక కన్నులతోడను, విశాలోన్నత వక్షముతోడను, గులాబిరేకులవలె మృదువైన చిన్ని సొట్టబుగ్గలతో డను, మంచి ముత్యములవంటి పలువరుసలతోడను నిగనిగలాడు చిన్ని బొజ్జతోడను. ముద్దులొల్కు మనోహరమైన చిరునగవుతోడను, ప్రకా సించుచుండెను. ఆతడు నాట్యముసేయుచున్నప్పుడు నిమీలితనేత్రము దాల్చి అశ్రుధారవదలుచు ఎట్టి కఠినహృదయులనైనను కరిగించి కన్నీటి ధారలు తెప్పించి తీరుచుండెను. మనహరగోపాలుని మధురగానమును, గానమునకుమించిన నాట్యమును, నాట్యమునకుమించిన భావోద్రేక మును భావోద్రేకమునకు మించిన భువనమోహన సౌందర్యమును జూ చిన ప్రతిస్త్రీపురుషులును తన్మయమొంది భగవత్ ప్రేమానందములో నోలలాడుచుండిరి. ఈబాలుని నోటినుండి వెలువడిన భగవన్నామమును విని నంతనే అప్రయత్నముగా వారి హృదయములు ద్రవీభూతమగు చుండెను. అనేకులు తమ కన్నీటిధార నాపుకొనలేక పోవుచుండిరి. కొందరు "గోపాల్'' యనుచు వెక్కివెక్కి యేడ్చుచుండిరి. గానము చేయుచున్న బాలుని కొందరు స్త్రీలు బలాత్కారముగా కౌగలించు కొని "ఆహా! నాయనా! నీమూలమున మేమందరమునుకూడ తరించు చున్నామోయి! నీ సమక్షమున నుండిన వారలకు వేరు వైకుంఠ ములో పనియేమి? అని చెప్పుచుండిరి. ప్రతి స్త్రీయును హరగోపా లుడే తన స్వంతబిడ్డయని భావించుకొనుచుండెను.

హరనాథబాలు డీవిధముగా మానవ హృదయములను హరించుచు తన ప్రేమసాగరమున ముంచివేయుచుండెను. కొందరు స్త్రీలు హరగోపాలుని తమ యొడిలో కూర్చుండబెట్టుకొని "నాయనా! హరనాథ్! స్వంతబిడ్డలకంటె చనువుగా నీవుమమ్ము అమ్మా" యని నోటినిండ బిలుచుచున్నావే! మేము నీకేమి యొసంగితిమని యట్లు మమ్ము ప్రేమించుచున్నావు?" అని యడుగుచుండిరి. అట్టివారిలో చంద్రావళి యొకతె అట్టివారినిజూచి మందహాసముతో "అమ్మా! సుందరీదేవి నా కెంతవరకు తల్లియో మీరును నాకట్లే తల్లులగుచున్నారు. మిమ్ముజూచినతోడనే నా హృదయమేలనోకాని కరుగునని చెప్పుచు వారి మెడలను ప్రేమాతిశయమున కౌగలించుకొనుచుండెను.

ఇంతకంటె విశేషమేమనగా శ్రీహరనాథుడు ప్రదర్శించు వాత్సల్యప్రేమరాస హరగోపాలుని ప్రేమలో స్త్రీలును స్త్రీలప్రేమలో హరగోపాలుడును మునిగి తన్మయులగు చుండిరి. ఒక్కొక్కప్పుడు ముద్దులుగుల్కునట్టి, హరగోపాలుడు తన మందహాసవదనముతో తల్లులను కౌగలించుకొనినంతనే, వారి దేహమంతయును నొక్కసారి పులకరించి, స్తన్యక్షీరము పొంగిపొరలుచుండెడిది. గాఢముగా హరగోపాలుని శిరస్సును తమ వక్షములకద్దుకొని, "హరా! నిన్నువదల జాలను. పాలుత్రాగుము." అని చెప్పుచు ప్రేమావేశమున శ్రీహరునకు పాలొసంగుదురు!

ఆహా! ఆతల్లులెంతధన్యులోకదా! వెన్నముద్దలను గోపికలపాత్రలనుండి తీసుకొనినచిన్నిచేతులు మురళినిధరించిన ఆచిన్నిచేతులు తమ కంఠములకు జుట్టుబెట్టుకొనియుండును! అట్టి హరగోపాలుని నిత్యక్రీడలను కండ్లారజూచి యానందించు భగవతీసుందరీదేవి, భాగ్యమేకదా నిజమగు భాగ్యము! వేలకొలది సంవత్సరములనుండి ఆమె సల్పిన మహాతపస్సు నేటికికదా ఫలించి అవాఙ్మనస గోచరుండగు భగవానుని తన తనయుడేయని భావించి ప్రేమించుకొను చున్నది.

# భగవన్నామ ప్రచారము.

[ఈవిషయము భాగవత్ చంద్రమిత్తర్‌గారివలన మాకు తెలిసినది]

బడినుండి వచ్చిన తరువాత హరనాథు డప్పుడప్పు డేకాంత స్థలమున కేగి దీర్ఘాలోచనా నిమగ్నుండై యుండినట్లు కాన్పించును. అట్టిసమయములో హరనాథుని తోడి బాలు రాతనికై వెదకి తుద కాతని స్థలమును గుర్తించి పిలువగా వారిని జూచి హరనాథుడు మాట్లాడక రెప్పవాల్చక యట్లే కన్నీటి ధారలు వదలుచు వెక్కి వెక్కి యేడ్చుచుండును. హరనాథుని తరగతిలోనే చదువుచు, యాతని వెంటనే తిరుగుచు, యాతనితో యాడుకొనుచు యాతనివెంట సంకీర్తనము జేయుచుండు హరనాథుని యాంతరంగిక మిత్రులు ముఖ్యముగా ఏడుగురనియే జెప్పవచ్చును. హరనాథు డవతార పురుషుడని వీరం దరును గ్రహించి వారిని సఖ్యప్రేమతో ప్రేమించుచుండిరి. వారి పవిత్ర నామముల నిచ్చుచున్నాము:—

(1) రామ్‌నాథ్ ముఖర్జీ.
(2) శ్రీపతి ఛటర్జీ.
(3) సురేష్ చంద్ర బెనర్జీ.
(4) ఉపేంద్రనాథ్ బెనర్జీ.
(5) రామ్ సధ్య బెనర్జీ.
(6) రాశిక్‌లాల్ డి పొద్దార్.
(7) కేదర్‌నాద్ డి పొద్దార్.

శ్రీహరనాథుని బాల్యచరిత్ర వీరికి చాలవరకు తెలిసి యుండె ను. వీరివలననే అనేకవిషయములు తెలుసుకొనబడెను. పై యేడు గురును గాక శశిభూషణుడు, అభయదత్తునాందీ అనంత బందోపాధ్యా యుడు మరి యిద్దరుగ్రామస్థులును హరనాథుని భగవతత్త్వమును యా

తని బాల్యమునందే గ్రహించిరని ఇంతకు పూర్వము వ్రాయబడినది.

తనతోడి బాలుర నట్లు కొంతసేపు రెప్పవాల్చక జూచి యే డ్చుచు "సోదరులారా! పవిత్రమగు భగవన్నామమునే సదా స్మరించు చుండెదము గాక. పనికిమాలిన యాటలను విరమించి భగవన్నామ మును చేయుచు భగవానుని స్తుతించుచు నాట్యముజేసి యానంద ముగా కాలము గడుపుకొనెదము గాక'' అని శ్రీహరనాథ ప్రభువు వారితో జెప్పెను.

వారొకదినమున, హరనాథునితో నిట్లు సంభాషించిరి.

బాలురు:—"హరా! అట్లు సదాభగవన్నామము జేసినచో, మనకు విసుగు పుట్టదా?"

హర:—"విసుగుపుట్టుటకు మారుగా ఎంతో యానందము కలుగుట యేగాక ఆనందబాష్పములు కూడవచ్చును. నామమును విడుచుట కూడ చాల బాధకరముగాదోచును.''

బాలురు:—"భగవంతుడు కూడ కన్పించునా లేదా? చెప్పుము?''

హర:—"తప్పక కన్పించితీరును. నిత్యము భగవన్నామము జేసినచో భగవంతుడు సదా వారివెంటనే తిరుగుచుండును సుమా. పసిబిడ్డను వదలి తల్లియొక రోజైనను మరియొకచోటునకు బోవగలదేమో మీరే చెప్పుడి."

బాలురు.—"అవును నిజమే. హరా! నీకు భగవంతుడు కన్పించెనా? కన్పించినచో యాతడెట్లున్నాడు? నీతోనేమైన మాట్లాడెనా?''

హర:—"నేను భగవానుని సందర్శించితిని. ఎంతో జగన్మోహనము గానున్నాడు. ఆయనను పూర్తిగావర్ణింప సఖ్యముగాదు. భగవ న్నామము నెంత ప్రీతితోస్మరించిన అంత యధికముగా మనలను ప్రేమించుచు మన కోర్కెలనన్నింటిని నెరవేర్చునని నాకు యాతడు తెలియజేసెను.''

బాలురు:—"అట్లైన మేము తప్పక భగవన్నామస్మరణ గావించి యాతనిని చూడవలయుననియున్నది. ఎన్నిరోజులకు కాన్పించును?"

హర:—"మీరేమియును కోరక నామమును స్మరింపవలయును. ఎప్పుడో హటాత్తుగా, ఆతడు మనలను కనిపెట్టి చూచుచున్నాడని జెప్పుటకై, ఏదో యొక వింతను జేయును. ఆవింతను మీకన్నులతో మీరే జూచెదరు. ఆయనను దర్శింపవలయునని మనమప్పుడెంతయో తీవ్రముగా తపించెదము. ఇట్లు తపించినచో శీఘ్రముగా యాయనను దర్శింపగలము."

బాలురందరును యానందపడి భగన్నామస్మరణ గావించుచుండుటకు నిశ్చయించుకొనిరి. భగవానుని సందర్శించుటకై యువ్విళ్ళూరుచుండిరి. భగవానుడు తమ కెట్టి యద్భుత వింతలు జూపనున్నాడో యని సదా యెదురుచూచుచుండిరి. భగవన్నామము నందు వారికిప్పు డొక విధమగు యుత్సాహము జనించెను. తమ సఖుడగు హరనాథుని ధైర్యవాక్యములందు వారి కెంతయో దృఢమగు నమ్మిక గుదిరెను. ఒక మహాత్ముడు చెప్పినట్లు విశ్వాసమే రాజు—విశ్వాసమే పతి—విశ్వాసమే మార్గదర్శి—సర్వ విజయమునకును మూలము విశ్వాసమే—భగవన్నామస్మరణ పూర్ణహృదయములతో గావించిన యెడల బహుకొలదికాలములోనే భగవానుడు మనకు దర్శన మొసంగుననియే హరగోపాలుడు తన యనుచరులకు జెప్పి వారి కీవిషయములో తన సంకల్పముచే దృఢమగు విశ్వాసమును వెంటనే జనింపజేసెను.

7, 8 సం॥ ల బాలురెందరో హరగోపాలుని కృపవలన విశ్వాసమును కల్గి భగవన్నామమును నిత్యమును గావింపవలయుననియు తామింతవరకును వినోదార్థమై యాడెడు ఆటలన్నియును నిష్ప్రయోజనమనియు గ్రహింపగల్గిరి కదా! అట్టి విశ్వాసము వారికి జీవితమంతయు నుండెను కదా! ఇదియే హరగోపాలుని దివ్యశక్తి.

# దివ్యపురుషుడు.

భగవాను డవతరించినప్పుడు ఏసమయమున కేయేశక్తులను వ్యక్తము చేయుటవసరమో వాటినే ప్రదర్శించుచు తదితర శక్తులను తనలోనే అవ్యక్తముగా నుంచుకొనును. ఒక్కొక్కప్పుడు ఒకేకాలములో అనేకవ్యక్తులుగా కన్పట్టుచు ఇట్టి వ్యక్తుల యన్యోన్యసంబంధము కూడ ప్రదర్శించును. మున్ను త్రేతాయుగమున ఒకేకాలమున శ్రీరామ, శ్రీపరశురాములను నామములతో జీవుల దృష్టికి ప్రత్యేకవ్యక్తులవలె దోచుచుండెను. ఈరెండు నామములతోను రెండు రూపములుగాను వ్యక్తమగుచున్నవా డొక్కడే యైనను తాను ప్రదర్శింపబోవు అవతార నాటకమునకు రక్తి కట్టించుటకై యట్లు జూపించెను. దీనిని బట్టి పరశురాముని కంటె రాముడే హెచ్చనియు లేక రామునికంటె పరశురాముడే హెచ్చనియు భావించుట మూఢత్వమే యగును. నాటకప్రదర్శనమునం దట్లు కనబరచినను స్వరూపమొక్కటియే.

శ్రీహరనాథావతారమునందు కూడ ప్రభువట్లే అప్పుడప్పుడు తన మాయానాటకము నాడుచు జీవులను వివిధ విధములుగా భ్రమింపజేయుచుండెను. అందొక్క విధము నీయధ్యాయమునందు వర్ణింపబోవుచున్నాము. శ్రీహరనాథప్రభువు తన బాల్యమునందు ప్రదర్శించుచున్నది "ఆత్మసమర్పణా యోగమును భగవన్నామశక్తియును అయి యున్నవి.'' తన నిజస్వరూపమును జీవుల కెవ్వరికిగాని స్పష్టముగా తెలియజేయకుండెను. భగవానుని మితముగా ప్రేమించు జీవులవెంట భగవానుడు సదా పరిచారకునివలెనే తిరుగుచు సఖునివలె ప్రతియంశమునందు తోడ్పడుచు తల్లివలె పోషించుచు ప్రభువువలె అహర్నిశములు రక్షించుచుండు నని పామరులకు గూడ స్పష్టమగునట్లు శ్రీహరనాథ ప్రభు విప్పుడు ఋజువుచేయ నెంచెను.

శ్రీహరనాథుని నేడు గొలుచుచున్న భక్తులకు వేలకు వేలు యద్భుతాను భవములుగలవు. ఆయనను నిష్కపటముగా ప్రేమించు చున్న ప్రతివారికిని (ఎట్టి సామాన్యజీవుడైనను) మహాప్రభు వగు శ్రీహరనాథు డనేకవిధములుగా కన్నతల్లికంటె వేయిమడుంగు లధిక ప్రేమతో బ్రోచుచున్నాడు. ఈవిషయమును స్పష్టపరచుచు తార్కాణము లియ్యబూనినచో కొన్నిమహాగ్రంథములు వ్రాయగలము.

పై కారణమును బట్టి తనబాల్యమున శ్రీహరనాథ మహాప్రభు వొక విశ్వప్రియునిగాను పరమ భక్తునిగాను నటించుచుండెను. భగవానుడు సదా తన వెంటనే నీడవలెనే తిరుగుచున్నట్లు జీవులకు కనబడుచుండెను. ఇట్లు చేయుటవలన జీవులకు ఆత్మ సమర్పణా తత్వమును గురించి స్పష్టపడును కదా!

శ్రీహరనాథ ప్రభువు ప్రదర్శించిన విచిత్ర నాటకమును గురించి ఇప్పుడు మనము నేర్చుకొనెదము గాక.

ఒక దినమున మన హరగోపాలుడును యాతని సోదరుడగు శివనారాయణుడును స్వర్ణముఖ గ్రామమునకు సమీపముననున్న వారి మేనమామగారి గృహమునకు బోయి తిరిగి యచ్చట నుండి సాయంసమయమున బయలుదేరి సొనాముఖికి తిరిగి వచ్చుచుండిరి. కొంతదూరమునడచిన పిదప చీకటిపడి దారి యంతయు కాన్పించకుండెను. వీరిరువురకును తోడు మరెవ్వరును లేరు. ఎట్లో శ్రమపడి ఈ సోదరులిరువురును సొనాముఖి గ్రామప్రాంతమునకు వచ్చిరి. తమ గృహమింకెంతయో దూరము లేదు. అదే సమయమున శివనారాయణ వెనుకకు తిరిగిచూడగా భయంకర పరిమాణముగల యొక దివ్యవిభూతి వారి వెంటనే మెల్లగనడచి వచ్చుచున్నట్లు గోచరించెను. ఆదివ్యపురుషుడు సుమారు 45 అడుగుల పొడవుండెను! చుట్టునుయున్న వృక్షములన్నిటి

కంఠెనుకూడ మెత్తుగా కన్పట్టుచుండెను. ఆ తేజోమూర్తి తన మొలచుట్టును వస్త్రమును మాత్రమే ధరించి యుండెను.

ఒక జంధ్య మాతని మెడలో కాన్పించుచుండెను. బొడ్డుప్రదేశమున నొక యద్భుత తేజస్సు, అగ్నిగుండమువలెనే కాన్పించుచుండెను. మరియు సుడిగుండమువలె యాతేజస్సు తన బొడ్డుచుట్టును గిరగిర తిరుగుచుండెను. శివనారాయణ తనతమ్ముడగు హరనాథుని బిలిచి యీవిచిత్ర స్వరూపమును జూడుమని చెప్పి భయకంపితుడగుచు తాను హరనాథునికంటె ముందు పారిపోవుచుండెను.

కాని హరనాథుడు మహదానందములో యామాయామానుష స్వరూపమును సమీపించి ప్రణామములర్పించెను. కొంతదూరము నుండి శివనారాయణ చూచుచుండెను. హరనాథుడు సామాన్య బాలుడు కాడు. ఏమీ! వీని ధైర్యసాహసములు! అనుకొను చుండగానే యావ్యక్తి చెరువునేటిపైననే నడచుచు కొంతదూరముపోయి అదృశ్య మాయెను.

శివనారాయణుని దేహమంతయు కంపించుచుండెను. ఆతడొక గెంతులో తన గృహముచేరి సుందరీదేవిని జూచి మాటాడలేక స్పృహ తప్పి నేలపై బడిపోయెను. సుందరీదేవి కిదియేమియు నర్థమగుటలేదు. తన పిల్లవానికి తెలివియొచ్చు ప్రథమచికిత్సలు జేసెను. శివనారాయణ తన తల్లినిజూచి "అమ్మా! నేనొక బ్రహ్మరాక్షసి వంటి వ్యక్తిని జూచితిని. కాని యది బ్రహ్మరాక్షసిగాదు. భగవంతుడో యెవరో నాకు తెలియదు. కాని మన హరనాథుడు నిర్భయముగా యావ్యక్తిని సమీపించి యేదోమాట్లాడు చుండుట నేను జూచితిని." అనిచెప్పెను. సుందరీదేవి భయభ్రాంతులచే మాటాడజాలక వీధిలోని కేగుచుండెను. "హరనాథా" అని కేకలు వేయుచుండెను. హరనాథబాలుడు తన సహజ చిదానందముతో తల్లిని సమీపించెను.

సుందరీ:—నాయనా! ఏమిజరిగినది! నీకు భయము వేయుట లేదా! అని చెప్పుచు హరనాథునెత్తుకొని లోనికి వచ్చెను.

హర:—అమ్మా! నాకేలనో కానిభయము వేయుట లేదే. మావెంట వచ్చుచున్న వ్యక్తినిజూచి మన బంధువుడగు ద్వారకనాథబెనర్జీ యనుకొని వారిని సమీపించి నమస్కరించితిని అప్పుడతడు నన్నుజూచి "హరా! నేను ద్వారకనాథ బెనర్జీనుకాదు సుమా" అని జెప్పుచు వెడలిపోయెను. చీకటిలో మేమిరువురమును యొంటరిగా వచ్చుచుండుటచే భగవంతుడే యీరూపమునుగైకొని మావెంట వచ్చియుండవచ్చునని నాకుదోచుచున్నది. సూర్యునివలె ప్రకాశించు నొకజ్యోతి యాయన బొడ్డునుండి కాన్పించుచుండెను. మరియు ఆయనను సమీపించగా నెన్నియోసువాసనలు యాతనిదివ్యశరీరము నుండి వచ్చుచుండెను. అమ్మా! యీదివ్య విభూతుని గురించి నాకింకేమియును తెలియదు అని హరనాథుడు తనజననితో జెప్పెను.

సుందరీదేవి తన కుమారు నెంతయో ముద్దాడి యానందపడి భోజనమిడుటకై తన పిల్లలనులోనికి దీసుకొనిపోయెను. వార్లకెట్టి యరిష్టములును కలుగకుండుటకై మంత్రింపబడిన కుంకుమ వార్ల నొసట బెట్టెను.

## హరనాథుని స్నేహ బృందము.

దివ్యవిభూతి యెవరో హరనాథునికి దర్శనమిచ్చి యాతనితో మాట్లాడి యదృశ్యమాయెననువార్త గ్రామమంతయును వ్యాపించెను. జనుల లక్ష్యమంతయును నొక్కపెట్టున హరనాథుని వైపునకుతిరిగెను. హరనాథుడు భగవదాంశ సంభూతుడే యని కొందరును, భగవత్ సాక్షాత్కారమును పొందినయొక మహానుభావుడని కొందరును, సాక్షాత్

భగవంతుడేయని మరికొందరును, ఎవరితార్కిక జ్ఞానమెట్లు సూచించిన నట్లు జెప్పుకొనుచు హరనాథ బాలుని జూచుటకు వచ్చుచుండిరి. నాటినుండియు హరనాథునిమాటలయందు గురుత్వముకలిగి యాతనిని పరిహాసింపక వినయముతో యాతని లీలలను పరిశీలింప ప్రయత్నించు చుండిరి. హరనాథుని యాంతరంగిక మిత్రులగు రామ్‌నాథుడును, శ్రీప తియును,: ఉపేంద్రనాథుడును, సురేష్‌చంద్రుడును పరుగిడుచువచ్చి "హరా! మేమెంతయో యుత్సాహముతో నెదురు చూచుచున్న భగవత్ మహాత్యము నీకేకాన్పించునే! నీవు నిన్న రాత్రిజూచిన దివ్యపురుషుడెవరు?" అనికొందరును "హర! మావిషయమై యాత డేమైనా చెప్పెనా? మాకేమైన వింతలుజూపునని చెప్పెనా? అని మరి కొందరును హరనాథుని ప్రశ్నించిరి.

హరనాథుడు వారి ప్రశ్నలను వినుచు చిద్విలాసముతో వారి ముఖములను తిలకించుచుండెను. వారికి భగవంతునియందు పూర్ణ విశ్వాసమును స్థిరపడునట్లు చేయదలంచెను.

"సోదరులారా! భగవంతునికి మీయం దెంత ప్రేమాతిశయ మున్నదో నేను వర్ణింపజాలను. మీరు స్మరించు భగవన్నామము నాతడు సదా విని యానందించుచు మిమ్ము సదా కంటికి రెప్పవలె కనిపెట్టియే జూచుచున్నాడు. తగిన సమయము వచ్చినప్పు డాతడు మీకు తన యద్భుత స్వరూపమును చూపించి తీరునని నమ్మడి.'' అని హరనాథుడు చెప్పుచుండగా భగవంతునికి తమయం దుండిన ప్రేమాతిసయమును వినినవారై ఈ బాలురు అశ్రుధారలను వద లుచు "నిజముగా మమ్ము భగవంతుడు సదా చూచుచున్నాడా? నిజముగా యాయన మమ్ము ప్రేమించుచు మానామస్మరణ వినుచు న్నాడా?'' అనుచు భావోద్రేకమున వెక్కి వెక్కి యేడ్చుచుండిరి. అప్రయత్నముగా వారు "హరిబోల్ హరిబోల్'' అనుచు నాట్యము

సల్పుచుండిరి. అంతలో తక్కిన బాలురుకూడ హరనాథునియొద్ద కేగిరి. వారిని జూచి హరనాథు డిట్లు తిరిగి జెప్పెను:—

“మిత్రులారా! మనము భగవన్నామమును జేయుచు నాట్యము సల్పినచో యాతడు తన స్వరూపమును మరచిపోయి మన నామమునే స్మరించుచు అదృశ్యుడై మనతో సమానముగా చేయును సుమా!'' బాలురిది విని భగవత్ ప్రేమావేశమున, తిరిగి నాట్యము సల్పుచు తమ దేహములను మరచి “రాధే గోవిందా! రాధే గోవిందా'' అనుచు దీనస్వరముతో “భగవంతుడా! నీవిప్పుడు మాతోనే యున్నావా!'' అనుచుండిరి.

హరనాథు డిది విని మిత్రులారా! మన మాతనికై మిక్కిలి తపించుచు, యేడ్చినచో ఆయన మనకై హెచ్చుగా తపించుచు యేడ్చునుసుమా'' అని చెప్పుచు వెక్కి వెక్కి యేడ్చుచు “ఓతండ్రీ! మాయందు నీకెట్టి ప్రేమయున్నది!'' అని దీనముగా వేడుకొను చుండెను.

హరనాథు డంత తన మిత్రబృందముతో చిదానందముగా గెంతుచు ఉచ్ఛస్వరముతో భగవన్నామమును జేయుచు బడికి పోయెను.

## ఉపేంద్రనాథుడు.

కాలము గడచినకొలదియు హరనాథుని దివ్యప్రేమ సుగంధము గ్రామమంతయును ప్రాకి పోవుచుండెను. ఎందరెందరో తల్లిదండ్రులు తమ తమ బాలురు నిత్యమును ఒక గంటయైనను ఏకాంతముగా కూర్చొని శ్రద్ధతో భగవన్నామమును జేయుచుండుట గాంచుచు అపరిమితానందభరితులై “ఆహా! 7 సం॥ల హరనాథబాలుడు ఇట్టి కుర్రల కెట్టి విశ్వాసమును కలుగజేసి బహుశ్రద్ధగా నామమును జేయించు

చున్నాడు! వీరివలన మాకుకూడ జ్ఞానము కలుగుచున్నది'' అను కొనుచుండిరి. కొందరు తల్లిదండ్రుల కిది సరిపడక "బొడ్డుకూడ యూడని వీరికి భగవధ్ధ్యానమేల? ఇప్పటినుండియు వీరి కీయవస్థ యేల? హరనాథుని మూలమున మాపిల్లలు కూడ చదువు సంధ్యలు లేక పాడై పోవుచున్నారు కదా'' అని హరనాథునితో బాటు తమ పిల్లలనుకూడ నిందించుచుండిరి. ఇట్లు కఠినముగా నిందింపబడి శిక్షింపబడినవారిలో ఉపేంద్రనాథుడను బాలు డొకడై యుండెను. ఒక దినమున సంకీర్తన పూజాదులను పూర్తిజేసుకొని గృహమున కీయుపేంద్రుడాలస్యముగా వచ్చెను. ఈతని తండ్రియగు జగదీశు డాగ్రహముతో తన బాలుని జూచి "నీకు భిక్షమెత్తుకొని జీవింపవలసిన దుర్గతి పట్టినది. చదువు సంధ్యలు మాని యీ భజనలతో తిరుగుచుండినచో దేవుడు నీకు ప్రత్యక్షమై భోజనమిడునా? ఓరీ! నీవింక గృహము దాటితివేని చావమోదెదను'' అని చెప్పుచు ఉపేంద్రుని గొట్టెను. ఉపేంద్రు డేడ్చుచు యూరకుండెను.

మరునాడుదయమున బడిలో హరనాథుని కలుసుకొని "చూచితివా! హరా! మాతండ్రి నన్నుకొట్టెను. నీతో నేనింక తిరుగకూడదనియు గృహమునుండి పోగూడదనియు కఠినముగా శాసించెను. నేనేమి చేయవలెను.''

హర:—"సోదరా! నీవెంతయో అదృష్టమంతుడవు సుమా! భగవానుడు నిన్ను జూచుచునే యున్నాడు. భయపడకము భగవన్నామమును మాత్రము విడువకుము. నేటి సాయంకాలము మీ యింటిలో పూజసల్పి సంకీర్తన గావింపవచ్చునా? మీతల్లి యొంటిరిగానున్నప్పుడు చెప్పి సంకీర్తన బెట్టించుమని యేడ్వుము.''

ఉపే:—"నీవు చెప్పినది చాల బాగున్నది. నేనెంతయో యేడ్చి నెగ్గెదను. మీరందరును తప్పక రావలయునుసుమా'' అని చెప్పెను.

# భగవన్నామ సంకీర్తన.

## —: అద్భుత దర్శనము. :—

ఉపేంద్రనాథుని కొసంగిన వాగ్దానము ననుసరించి హరనాథ బాలుడును అతని మిత్రబృందమును పయనమగుటకై సిద్ధపడుచుండిరి. నాటిసాయంకాలము హరనాథచంద్రుడు తన తల్లిని జూచి "అమ్మా! ఇప్పుడు మేమందరమును ఉపేంద్రుని గృహమున కేగి సంకీర్తన గావింపనున్నారము. తల్లీ! నాకనుజ్ఞ నొసంగవా" అని దీనముగా వేడుకొనెను. అప్పుడా సుందరీదేవియున్ను చంద్రావళియున్ను మాటాడుకొను చుండిరి. సుందరీదేవినిజూచి చంద్రావళి "సుందరీ! నీబాలునికి గోపాలునివలె యలంకరించెదముగాక. ఆహా! ఎంతమనోహరముగా నీతనయుడు సంకీర్తనముగావించునే! వీని నేత్రములనుండి ప్రేమరసం చిప్పిరిల్లుచుండును.''

"సుందరి:—అమ్మా! నాహరనాథుడు బట్టకట్టి చిరకాలము జీవించినవో నాకదియే చాలును. వీనికిప్పటికే దృష్టిదోషము తగిలి నీరసముగా కన్పట్టుచున్నాడు. ఇప్పుడు వేషముకూడ వేసినచో మరింత దోషముతగులునే. వీని నిట్లే నుండనిమ్ము'' అని చెప్పెను. అదేసమయమున హరనాథుని మిత్రబృంద మేకకంఠముతో అట్లు కాదు హరనాథుని యలంకరింపవలయును- లేనిచో మానాయకుడని యొరులకు తెలియుటెట్లు?'' అని చెప్పిరి. హరనాథుడూరక నిలువబడి
యొరులకు తెలియుటెట్లు?" అని చెప్పిరి. హరనాథుడూరక నిలువబడి
జూచుచు, మిత్రులారా! నాకెట్టి వేషము వేసిన బాగుండునో మా జననికి పూర్తిగా తెలియును'' అని చెప్పెను.

సుందరీదేవి ప్రేమాతిశయమున బాష్పములు వదలుచు తన బాలుని లోనికి కొనిపోయి దివ్యసుందర విగ్రహముగా కన్పట్టునట్లు తన తనయున కలంకరించి "నాయనా! ఏడీ? రాధాగోవింద నామ

మును పాడుచు ఒక్కసారి నాట్యముజేయుము'' అని యాజ్ఞాపించెను. బాలు రందరును సంకీర్తన గావించుచు సుందరీ చంద్రావళుల యెదుటనాట్యము జేయదొడంగిరి. పాటకడ్డమువచ్చుచు సుందరీదేవి తన కుమారు నెన్నియోసార్లు ముద్దు బెట్టుకొనుచుండెను. కొంత సేపైన తరువాత తనజననికిని చంద్రావళికిని నమస్కరించి హరనాథ బాలుడు తన ప్రియబృందముతో ఉపేంద్రుని గృహమునకు పయనమ య్యెను. ఉపేంద్రుని తండ్రి యగు జగదీశుని పుణ్యకాలము సమీపింప నున్నది. పరమభక్తునిగా యాతడు మారిపోవు క్షణములు సమీపించు చున్నవి. ఎట్టి పాషండహృదయమునుకూడ కరిగించి భగవత్ ప్రే మావేశమున నాట్యము చేయింపగల్గు యద్భుత శక్తిని కలిగియున్నను తన గుప్తనరలీల కెట్టి యాటంకమును రానీయకుండగ మహాప్రభువు తన స్వరూపమును గప్పుకొని ఏమియు తెలియనివానివలె నటింపగల్గు యద్భుత నటనాగ్రేసరుడుకదా! శ్రీహరనాథుడు! తన వారిని తానే యెన్నుకొనుటకై ప్రభు విప్పుడు తన మాయామానుష బాలవిగ్రహ మున పయనమై యేగుచున్నాడు.

జగదీశుని గృహములోని యొక గది యందు ఉపేంద్రుని తల్లి బాలురరాకకై యెదురు చూచుచుండెను. హరనాథబాలుడు తన గజ్జలను మ్రోగించుచు అనేక దివ్యసుగంధ పరిమళములను తన పావన దేహమునుండి వెదజిమ్ముచు లోనికేగి ఉపేంద్రుని జనని యొడిలో కూ ర్చొనెను! ఆమె మెడపై తన చేతులువైచి చిరునగవుతో యామె ముఖమును తిలకించుచు "అమ్మా! నీవే నాతల్లివి. ముందు తినుటకు మాకేమైనా బెట్టుము. తరువాత నాట్యము జేసెదము.'' అని చెప్పెను. ఈపలుకులు వినుచుండగా నామె యొడలు వాత్సల్య ప్రేమాతిశయమున పులకరించుచుండెను. తన స్వంతబిడ్డకంటెను గూడ వేయి మడుంగు లధిక వాత్సల్యముతో "అమ్మా!'' అని నోటినిండ పిలచుచున్న హర

నాథుని యామె విడువలేకపోవుచుండెను. ఎన్నిసార్లుముద్దిడిగాఢముగా కౌగలించుకొనినను యామెకు తనివి తీరకుండెను. బాలునెత్తుకొని లోనికి బోయి స్వహస్తములతో హరనాథునికి ఫలహారములు తినిపించి యాతని యనుచరులకు గూడ బెట్టెను.

బాలు రందరును నిలువబడి చుట్టును తిరుగుచు సంకీర్తన గావించుచుండిరి. అదేసమయమున జగదీశుడుకూడ నచ్చటకు వచ్చి కూర్చొని చూచుచుండెను. "హే! దీనదయాళో! ఎట్టిపాపులను గూడ ప్రతిఫలాపేక్ష లేక నీవు బ్రోతువుకదా. నిన్ను నిరసించిన వారినికూడ రక్షించెద నని కంకణము గట్టుకొంటివికదా. ఆహా! నాకొకసారి కాన్పించుము" అని యర్థము నిచ్చు నొకగీతమును హరనాథబాలుడు పాడుచుండెను. పాటను వినుచు జగదీశుడు తన శరీరమును మరచిపోవుచుండెను. అదృశ్యమగు ప్రేమశక్తి తన హృదయమును వశము జేసుకొనుచుండుట కనిపెట్టెను. హరనాథు డతిదీనముగా జగదీశుని వంక జూచుచు గ్రుడ్లనిండ నీరు బెట్టుకొనుచుండెను. జగదీశుని కేడ్పు యాగకుండెను. "నాకొకసారి కాన్పించు" మనుభావము ఆతని హృదయములో నాటుకొనిపోయెను! ఆతని కీప్రపంచ చైతన్యము పూర్తిగా తగ్గిపోయెను. మనోహరమైన ప్రేమనాద మాతని హృదయకర్ణములయందు మారుమ్రోగుచుండెను. ఆతనికొక యద్భుతదృశ్యము గోచరించెను. హరనాథబాలుని శరీరమునుండి మహత్తరమైన దివ్య తేజము నలుదిక్కులకు ప్రసరించుచుండుటయును ఆతని చుట్టును అసంఖ్యాకములగు నవయావ్వన భువన మోహనబాలురు నాట్యముచేయుటయును, వీరినాట్యమును చిరునగవుతో హరనాథ బాలుడు జూచుచున్నట్లును, అందరును హరనాథునే స్తుతించుచున్నట్లును, జగదీశునకు గోచరించుచుండెను. అప్రయత్నముగా నాతడు "హరనాథా" అనుచు కేకలువేయసాగెను. హరనాథుడును ఇతరబాలురును తమ సంకీర్తన

మును ఆపి జగదీశుని సమీపించిరి. కొంతసేపటికాతనికి స్పృహవచ్చి చూడగా తన చుట్టును బాలురు నిలువబడియుండిరి. ఆతడు హరనాథ బాలుని కౌగలించుకొని ముద్దుపెట్టుకొనెను. హరనాథుడు సామాన్య బాలుడుకాడని మాత్రము విశ్వసించెను. యథేచ్ఛగా హరనాథునితో బాటు నిత్యమును సంకీర్తన గావింపవచ్చునని ఉపేంద్రనాథుని కనుజ్ఞ నొసంగెను!

నాటినుండియు జగదీశుడు భగవన్నామస్మరణయందు పూర్తి గానిమగ్నుడై ఈ దినముతరువాత స్వల్పకాలమే జీవించి మహ దానందముతో తన తనువును విడచెను. ఇట్టి మార్పు రాకున్నచో యాతడెంతయో దుఃఖముతో ప్రాణములు వదలి యేదుర్గతికి పాల య్యెడివాడో కదా!

## పాపభారములు మోయుట.

శ్రీహరనాథుని వయస్సిప్పుడు సుమారు 12 సం॥ లుండును. బడిపాఠములయం దాతని కెంతమాత్రమును శ్రద్ధ యుండేది కాదు. వేళకు భోజనముకూడ చేయకుండెను. ఒక్కొక్కప్పుడు సోనాముఖి గ్రామమునకు సమీపమందున్న పల్లెలకెంతయో శ్రమపడి వెళ్ళి అచ్చట బాలురకును యువకులకును హరినామ సంకీర్తన వినిపించుచు వారిచే భగవన్నామమును జేయించుచుండెను. కొలదికాలములో నాపల్లెల యందలి బాలురకును స్త్రీలకునుగూడ హరనాథునియం దధిక యనురాగము జనియించెను.

ఒకరోజున తన గ్రామమునకు కొలదిదూరములోనే యున్న పల్లెకు హరనాథుడేగి యచ్చట హరినామసంకీర్తనజేసి తిరిగి వచ్చు చుండగా నొక గుడిసెలో నొక వృద్ధుడు శ్లేష్మముతో కూడుకొనిన దగ్గుతో అధిక బాధ పడుచుండెను. ఆతడు జంగమ కులస్థుడు. పాప

మాతడు బాధ పడజాలక మధ్యమధ్య "మహాదేవా! శంకరా! నేనీ బాధ పడజాలనోయీ! తండ్రీ! నీవే నాకు దిక్కు" అనుచు యఱచు చుండెను. ఆపల్లెవా రెవరును యాతని కెట్టి చికిత్సలుగాని యుపచారము లుగాని శ్రద్ధవహించి చేయకుండిరి. హరనాథబాలు డాతని రోదన మును వినెను. నడచిపోవుచున్నవాడు హటాత్తుగా ప్రక్కకు తిరిగి ఆగుడిసెలోని కేగెను.

ఈ రోగిని జూచి హరనాథుడు "తాతా! నీ కెట్లున్నది? నీకేమియును భయములేదు. భగవన్నామమును మాత్రము విడువ కుమా" అని చెప్పుచు యాతని ప్రక్కపై కూర్చొని ఆవృద్ధుని గుండెలపై తన పవిత్రహస్తముతో మెల్లగా రాచుచుండెను. ఆవృద్ధుడు లేచి కూర్చొని బాలుని వీపురాయుచు "ఆహా! నా తండ్రీ! నా యందు నీకెంత ప్రేమ యున్నది. నేనొక దిక్కు మాలిన పక్షిని. నాకు భగవంతు డేల చావు నొసంగకున్నాడో కదా" అని చెప్పుచు తిరిగి దగ్గుచుండెను. ఆదేసమయమున అచ్చట నున్న గ్రామస్థులు కొందరు హరనాథుని పిలచుచు "నాయనా! నీవచ్చట నుండకూడదుసుమా! ఆదగ్గునీకు కూడ వచ్చును. ఇవతలకు రమ్ము" అని వారించుచుండిరి. వెంటనేహరనాథుడు "అయ్యా! మా తాతకు సంపూర్ణారోగ్యము కల్గుటకై నాప్రాణమైనను మహేశ్వరున కర్పించుటకు సిద్ధముగా నున్నాను. దయచేసి యితని కుపచారములు చేయుడి. మానవసేవను వదలి మీరెంత భగవధ్యానము జేసినను భగ వంతుడు సంతసింపడని నాయభిప్రాయము" అని వారికి జెప్పుచు కొంతకాల మచ్చటనే యుండి రోగిని పరుండబెట్టి తాను బయటకు వచ్చెను.

మరుచటిదినము నుండియు హరనాథునికి తీవ్రమగు దగ్గు ప్రా రంభమయ్యెను. క్రమ క్రమముగా యాతడు కృశించిపోవుచుండెను.

ఆతడు తిను భోజనముకూడ జీర్ణము కాకుండెను. సుందరీదేవి యెంత యో భయపడుచుండెను. ఎన్నియో చికిత్సలు చేయించుచుండెను. కాని హరనాథుని స్థితి యట్లేయున్నది.

హరనాథ బాలుడు తన గుడిసెను విడచిన క్షణమునుండియు రోగియొక్క బాధ తగ్గుట మొదలుపెట్టెను! 10 దినములలో యాతనికి స్వస్థతకలిగి సుఖముగా నడువగల్గుచుండెను. కృతజ్ఞుడగు నీవృద్ధుడు హరనాథబాలునికి తనపైనున్న ప్రేమాతిశయమును జ్ఞప్తికి దెచ్చుకొనుచు సోనాముఖివచ్చి హరనాథుని దర్శింపగోరెను. వానిమృదుమధుర వాక్కును తిరిగి వినగోరెను. తన స్వంతబిడ్డ కంటె కూడ నెక్కువ ప్రేమాతిశయముతో తన యోగక్షేమమును కనుగొనుచు మానవ సేవయే ముఖ్యమని చెప్పిన యాచిన్నిబాలుని ముఖారవిందమును జూచి వాని నొక్కసారి కౌగలించుకొనవలెనని తీర్మానించుకొని, కొంత పటికిబెల్లమును మూటగట్టుకొని సోనాముఖిచేరెను. ఎట్టిశ్రమయును లేక హరనాథుని గృహమును కనుగొని లోనికేగెను. శివనారాయణునితో తన వృత్తాంతమంతయును జెప్పి హరనాథబాలు నొకసారి జూపింపమని వేడెను.

హరనాథుని ప్రస్తుత యనారోగ్యమున కీవృద్ధుడే కారణమని శివనారాయణ గ్రహించి కోపోద్దీపితుడై వృద్ధునిదిట్టుచు లోనికేగి తన తల్లితో జెప్పెను. సుందరీదేవి బయటకువచ్చి వృద్ధుని జూచి "నీకు బుద్ధి లేక పోయెనా? పసిపిల్లవానిని నీవద్దకేల రానిచ్చితివి. నీపాడురోగ మంతయు వీనికొచ్చినది. సిగ్గు లేక యీవృత్తాంతమును జెప్పుటకై యిచ్చటి కేల వచ్చితివి." అని కేకలు వేయుచుండెను.

అదేసమయమున హరనాథు డచ్చటకు వచ్చి "అమ్మా! పాప మీతని కేమియును తెలియదు. ఈతడు మహాభక్తుడగుటచే వీనిని చూచుటకై లోనికేగి యొక్కక్షణమే వీనితో మాట్లాడి తిరిగి వచ్చితిని.

నాకిప్పుడేమియును బాధలేదు'' అని చెప్పుచుండగా వృద్ధు డానంద బాష్పములను రాల్చుచు "ఆహా! ఈపిల్లవాడు జూపు ప్రేమ కేవలము భగవత్ ప్రేమయే. ఇతనికి మానవలక్షణము లేవియును కాన్పించుటలేదు'' అని చెప్పుచు బాలుని సమీపించి "నాయనా! ఇంతచిన్న వయస్సులో నీకెంత బుద్ధియున్నదోయీ! ఒక్కసారి నాయొడిలో కూర్చొనుము. నావేదన చల్లార్చుము'' అని చెప్పగా హారగోపాలు డాతని యొడిలో కూర్చొని చిరునగవుతో యాతని చెక్కిళ్లు రాచుచు "తాతా! నాకు తినుటకేమైనా తీసుకొనివచ్చితివా?'' అని యడిగెను. "నాచిట్టితండ్రీ! ఈభవనము చూడ నీవొక ధనికుని బిడ్డవలె గాన్పించుచున్నావు. నేనొక కటికిదరిద్రుడను. నీకు నేనేమి బెట్టగలను?'' అని చెప్పుచు బాలుని శిరస్సు తన హృదయమున కద్దుకొని యానందబాష్పములు కార్చుచుండెను.

"తాతా! ఈమూటను విప్పుము? దీనిలో నేమున్నదో చూచెదను'' అని చెప్పుచు మూటను విప్పి దానిలోని పటికిబెల్లపుముక్కలను సంగ్రహించి బ్రహ్మానందముతో ఏదో రాజ్యపదవి వచ్చినవాని వలెనే సంతసించుచు దానిని తననోటిలో బడవైచుకొనెను. హారనాథుని యధిక సంతుష్టిని జూచుచు నావృద్ధు డెంతయో నుప్పొంగుచుండెను.

---

నాటినుండియు హారనాథునికి పూర్ణారోగ్యము కలుగుచుండెను. శ్రీహారనాథుని మహావాక్యములనే గమనింపుడి:—

"మీ యందరికొరకును బాధపడుటలో నాకెంతయో ఆనందము కల్గును. మీ మీ పాపభారములను కష్టములను నాభుజములపై నిడి నిశ్చింతగా భగవన్నామమును స్మరియింపుడి. మిమ్ముల నెవ్వరును దప్ప ప్రేమించుటకు నా కెవ్వరును మరెచ్చటగాని లేరు. మీరే నాసర్వస్వము నైయున్నారు. విశేషముగా ధనార్జనచేయు మీసోదరునిపై మీరా

ధారపడినట్లే నాపై మీరు పూర్తిగా యాధారపడుడి. మిమ్ము నేను రక్షింపగల్గుదునో లేనో మీకే యనుభవముగా తెలియును.'' పాఠకులారా! పూర్వజన్మకర్మవలన యంకురించెడి దీర్ఘరోగములను (కుష్ఠు, తైసిస్, మూలశంఖ) ప్రభువు తనపై నాకర్షించుకొని ఆనందముతో జీవుల పాపభారములను మోయుచుండుట కనేక ప్రత్యక్షతార్కాణము లున్నవి. అయితే తన బాల్యమున యాతడు రహస్యముగా భరించుచుండెను. తరువాత తన భక్తకోటి వేలకువేలుగా పెరిగినప్పుడు ధారాళముగా "మీ పాపములను మోయుటకే నే నిచ్చటకు వచ్చి యున్నాను'' అని చెప్పుచు జీవుల పాపములను భరించుచుండెను. సువర్ణచ్ఛాయగల తన శరీరము (తన 31-వ సం॥ నుండి నల్లని శరీరము సువర్ణచ్ఛాయగా మారిపోయెను.) చూచుచుండగానే నల్లగా మారిపోవుచుండెను! శరీర రోగముల నెట్లు భరించుచుండెనో జీవుల భవరోగములనుగూడ నట్లే హరించుచుండెను. శ్రీహరనాథుడు పరమ పావనుడు. అద్వితీయ విశ్వప్రియుడు, అఖండశక్తిమయుడని యాతని చరిత్ర యంతయును చదివినవారికే తెలియగలదు. ఆతని పావన చరిత్ర వినినవారికి కొలదికాలములో పావనత్వము సిద్ధించును. ఆతని మహానామమును స్మరించిన వారికి సులభముగా భవబంధములన్నియును తెగిపోవుట నిశ్చయము.



శ్రీ కుసుమహరనాథాయనమః.

# శ్రీహరనాథావతారము

## 6-వ అధ్యాయము.

---

## శ్రీహరనాథుడు-ఉన్నత విద్య.

---

(శ్రీహరనాథుడు కూచియాకోలునకు ప్రయాణమగుట.)

వివాహమైన తరువాత హరనాథబాలుడు సోనాముఖిలో నున్న పాఠశాలయందలి పరీక్షయందు త్తీర్ణుడై (మిడిల్‌స్కూల్ పరీక్షకు) కుచియాకోలునందలి శాభావల్లభ బడిలో చదువుటకై తన గ్రామమును విడచి చనెను. తనతోబాటు ఉపేంద్రుడును, శ్రీపతియును, రామనాథుడునుకూడ పయనమై విద్యాభ్యాసమునకై యేగిరి. మిగిలినవారును గ్రామమందలి తదితరులును హరనాథబాలుని విడుచుట నెంతయో కష్టముగా భావించిరి. ఏబాలుడు భావోద్రేకమున సర్వులచేతను భగవన్నామ సంకీర్తనలు జేయించుచుండెనో, ఏబాలుడు చిరునగవుతో తమ యొడిలో కూర్చొని గారాబముతో ముద్దు పలుకులుపలుకుచుండెనో, ఏబాలుడు స్త్రీలహృదయములను వాత్సల్య ప్రేమచే పూరింపజేయుచుండెనో, ఏవిశ్వప్రియుడు ప్రతిస్త్రీని కూడ నోటినిండ "అమ్మా" యని పిలచుచుండెనో, అట్టి ప్రేమగానలోలుడగు హరనాథుడు స్వర్ణముఖ గ్రామమును విడుచుచున్నాడని తెలుసు

కొని వారందరును ఎంతయో దుఃఖించిరి. వీరందరికంటెను హరనాథునితో నిత్యమును కలసి మెలసి యాడుకొనుచుండు కుసుమాంబకు మరింత కష్టముగా నుండెను. తన నాథుని మనోహరగాత్రమును నిత్యమును విని యానందించుటకింత వీలుండదుకదా యని లోలోపల దుర్భరమగు శోకము నామె పొందుచుండెను.

కొందరు స్త్రీలు సుందరీదేవిని జూచి "అమ్మా! కొంత కాలము మీరందరును ఈ యూరిలోనే నేల యుండకూడదు! హరనాథబాలుడు విద్యనభ్యసించి త్వరితముగా యుద్యోగము చేయకుండినచో మీకు కలిగెడి నష్టమేమియును లేదుకదా! అతడు చిన్నబాలుడైనను మాహృదయములలో భక్తిజ్వాలలను కలిగింపజేయుచున్నాడు సుమా! మాస్వంత బిడ్డలకంటెనుకూడ హరనాథు డధికముగా మా హృదయముల నాకర్షించుచున్నాడు" అని చెప్పిరి.

సుందరీదేవి చాల సంతసించి "అమ్మా! మన స్వలాభమును గమనించి వీని భవిష్యత్ జీవితమునకు మనమేల యడ్డమురావలయును. ఇప్పటికే వీడు ఈ యూరులో నుండుటచే బడికి సరిగా పోవక విద్యయం దాసక్తిని చూపక చాల వెనుక బడిపోయెను సుమా. నాసర్వయాశయములును వీనిపై లగ్నముచేసుకొనియున్నాను. మీరందరున్ను వీనిని దీవించి పంపుడి'' అని జెప్పెను. వేరుచేయునది లేక వారందరును హరనాథుని దీవించి "నాయనా! నీవెచ్చటనుండినను మమ్ము మాత్రము మరువకుమోయీ! నీజీవితము చూడ నీవు సామాన్యనరుడవు కావని మాకు దోచుచున్నది. లేనిచో ఇందరి హృదయములను నీవెట్లాకర్షింపగల్గుదువు. సుందరీదేవివలెనే మమ్ముగూడ భావించి ప్రేమించుము.'' అని చెప్పచు కండ్లనిండ నీరు బెట్టుకొనిరి. సుందరీదేవి కూడ తన తనయునిపవిత్ర జీవితమును తలంచుకొనుచు ప్రేమావేశమున పొంగుచున్న తన దుఃఖమును దిగమ్రింగుచుండెను.

హరనాథబాలుడు మెల్లగా వారినిచూచి "నాప్రియమైన తల్లులారా! సామాన్యముగా ప్రతివారికిని ఒకేతల్లి యుండును. నా యదృష్ట మేమో కాని నాకిందరు తల్లులున్నారు. సుందరీదేవి నాకెంతవరకు తల్లియైనదో మీరుకూడ నాకట్లే తల్లులగుచున్నారు. మీప్రేమను నేను మరువజాలను. నన్ను దీవించి పంపుడి" అనుచు ప్రేమాతిశయ మున కన్నీటిధారలను వదలుచు వారి పాదములకు ప్రణమిల్లుచుం డెను! వారిపాదధూళిని తన శిరముపై వేసుకొనుచుండెను!!

ఆహా! భగవానుడు మనకొరకై యెట్టి త్యాగమునైనను జూపునుగదా! తన స్వరూపమును పూర్తిగా మరచిపోవునుగదా! ప్రేమపాశములనుండి యాత డెన్నటికిని పారిపోవజాలడు. ప్రేమ నవనీతమున కాశించి యాతడు తన ప్రియులకు దాసివలె లోబడి పోవునని శ్రీహరనాథుని జీవితముననే చాటుచున్నది. ఆయన భక్తులజీవితములున్ను చాటుచున్నవి. మాయామానుషవిగ్రహములను దాల్చి తన భక్తులకు నీచసేవల నెన్నింటినో మహదానందముతో భగవానుడు చేయునని చెప్పుట కనేక తార్కాణములు ప్రభుహర నాథుని చరిత్రయందు ముందు తెలియజేయబడియున్నది. హే! ప్రేమ స్వరూపా! శ్రీహరనాథా! మహాపతితులగు మాకొరకై నీవెట్టి త్యాగమునైనను జూపెదవుగదా! తండ్రీ! అణుమాత్రమైనను యో గ్యతలేక, అహంకారాది కల్మషములలో దినమంతయు నీదుచు, నీ విషయములలో దినమున కొక ఘంటయైనను, వినియోగము చేయజాలని, పతితులమగు మాపై, నీ కెంతటి నిర్హేతుక ప్రేమయో కదా! ప్రభూ!

# మహాప్రసాదము.

హరనాథుడు కూచియాకోల్ వచ్చినప్పటినుండియు తన గుప్త లీలా ప్రకరణమును విజృంభింప జేయుట మొదలుపెట్టెను. తన సహోదర విద్యార్థులనెల్లరను భగవన్నామ సంకీర్తన జేయునట్లు ప్రేరేపించు చుండెను. అతికుతూహలముతో వారందరును హరనాథుని నాయకత్వమును స్వీకరించి నిత్యసంకీర్తనలు గావించుచుండిరి. భగవానుడెచ్చటనో దూరముగా నున్నాడను భావము పూర్తిగా నశించి సదా తమ యొద్దనే యుండి నామస్మరణ వినుచు నాట్యము చేయుచున్నాడను స్థిరభావము వారి కుదయించెను. ఇట్టి భావమువలన వారనన్యముగా భగవత్ చింతలోమునిగిపోవుచుండిరి. ఇట్టి చింతవలన వారి కెంతయో ఆనందము కలుగుచుండెను. అంధకార మగు వారి జీవితములో శ్రీ హరనాథు డనునొక తేజోకిరణ ముద్భవించిన దనియే వారు భావించుకొనుచుండిరి.

ఒకదినమున కూచియాకోలునకు 3 మైళ్ల దూరమున నున్న యొక పల్లెకు వారందరును కలసి పోయిరి. వారి దారి అరణ్యమునుండి పోవును. ఆపల్లెలోని వారందరును నామ సంకీర్తనముచే తమ ప్రాకృత దేహములను మరచిపోవుచుండిరి. హరనాథుని ప్రేమనేత్రములు స్త్రీల హృదయములను ద్రవీభూత మొనరించు చుండెను. అనేక గృహములలో హరినామములు చెలరేగు చుండెను. ప్రతిస్త్రీయును హరనాథుడే తన స్వంతబిడ్డ యని ప్రేమించుకొనుచుండెను. ప్రతిగృహమునందును హరనాథునకును వాని మిత్రబృందమునకును ఫలహారము లిచ్చుచుండిరి.

ఆపల్లె నుండి బాలురందరును తిరిగి కూచియాకోలునకు బయలువెడలిరి. అరణ్యమునుండి వచ్చుచుండిరి. కొంతదూర మట్లు నడచిన

తరువాత వారికధికశ్రమ కలుగుచుండెను. విశేషముగా యాకలియు, దాహమును, వారిని పీడించుచుండెను. కాని నీరెచ్చటను కాన్పించదు. తినుటకు ఫలములుకూడ లేకపోయెను. ఆయరణ్యమందెచ్చట వెదకినను పనికిమాలిన వృక్షములే గాని వారి కుపయుక్తమగు వృక్షముకాన్పించుట లేదు. వారందరును దీనముగా హరనాథునిజూచి "హరా! మే మిప్పు డేమిచేయవలెనో కదా! మన మింకను చాల దూరము నడువ వలసియున్నది. ఆకలియు దాహమును దుర్భరముగా నున్నది. నడచుట కేమియును శక్తిలేకున్నది" అని జెప్పుచు నేలపై కూర్చొని యుండిరి. హరగోపాలు డెంతయో జాలిపడి వీరి కాహారమేమైన నొసంగ వల యునని సంకల్పించుకొనెను. వెంటనే హరనాథు డరణ్యములోనికిబోయి యొక క్షణమాగి "సోదరులారా! రండు, రండు ఇదిగో ఫలవృక్షము. ఇవిగోఫలములు. బాగుగా ముగ్గిన ఫలములెన్నియోయున్నవి." అని కేకలు వేయుచుండెను. బాలురందరును ఇంతకుముందా ప్రాంతమున నెంత వెదకినను వారికావృక్షము కాన్పించలేనందున వారెంతయో హాశ్చర్యపడుచుండిరి. ఆవృక్షమువారి దృష్టినుం డెట్లో తప్పించుక బో యెననియే వారనుకొనిరి. (శ్రీహరనాథుడు పెద్దవాడైన తరువాత వేలకు వేలు యద్భుతములను ధారాళముగాచేయుట కండ్లారజూచి తమచిన్న తనమందు జరిగిన నీవిశేషముగూడ ఆయన మహాత్యమే యనుకొనిరి. అంతవరకును వారు హరనాథునిగుప్తలీలలను కనిపెట్టజాలక పోయిరి.)

ఫలములను భుజించినతోడనే వారికెంతయో శక్తి జనించెను. తమ గృహములకేగి వారీవిషయమును తమ తల్లి దండ్రులకు జెప్పి "నిజముగా భగవానుడు సదా మాయొద్దనే యున్నాడు. మాదీనాలాప ముల నాతడు సదా వినుచున్నాడు. ఆయన పవిత్రనామ ప్రచారమును జేయుటకేగినప్పుడు మాకేమైనా లోటు రానిచ్చునా!" అని యెంత యో గర్వముతో భగవానుని దయాళత్వమును కొనియాడిరి.

## శుష్క వేదాంతి.

కూచియాకోలు గ్రామములో హరిత్తరుఁడను నొక పూజారి యుండెను. అత డేవో కొన్ని శ్లోకములను వర్ణించి కొందరి గ్రామస్థులకు వేదాంతము జెప్పుచు మంత్రోపదేశములు చేసి తన్మూలమున ధన మార్జించుకొని జీవయాత్ర చేయుచుండెను. అయితే ఒకరిపై మరియొకరికి కొండెములు జెప్పు దురభ్యాస మాతనికి యుండెడిది.

హరనాథుడును తన మిత్రులును గ్రామమందలి కొందరిచే యాహ్వానింపబడి మనోహరముగా శ్రీకృష్ణగీతములను పాడుచు అచ్చటి స్త్రీ పురుషుల కెంతయో ఆనందము కలుగజేయుచుండెను. హరిత్తరున కీవిషయము తెలిసి "స్త్రీలకు సంకీర్తనయేటికి? వారికి సిగ్గైనా లేక భజనలేటికి" అని గ్రామమందలి పురుషులతో కొందరితో జెప్పుచుండెను. మరియు బాలురందరును కొందరు పంచమజాతి వారితో కలసి నృత్యముచేయుచుండిరని కూడ విని క్రోధోద్దీపితుడై హరనాథుని మందలింప నుద్దేసించెను. తన వేదాంతమును వినుటకై సామాన్యముగా వచ్చెడి స్త్రీలుడ నిత్య సంకీర్తనలను గావించుకొనుచు తమ గృహముల యొద్దనే యుండుట తన కెంతయో కష్టముగా నుండెను.

ఒక దినమున సుందరీదేవినిజూచి "అమ్మా! నీకుమారుడు పంచమజాతిలో కలసిపోవ సిద్ధముగానున్నాడు. ఆతడొక్కడే గాక నోరుమాలిన నితరబాలురను కూడ చెరుపుచున్నాడు. ఆపిల్ల వానిని నీవు మందలింపనిచో మీకుటుంబమును వెలివేయవలసి వచ్చును" అని చెప్పెను. సుందరీదేవి తన తనయుని జూచి "నాయనా! ఇదేమి కర్మము! మనము బ్రాహ్మణులమై యుండియు నానాజాతి వారితో కలసి తిరుగ వచ్చునా? అట్లెన్నడును చేయకుమ"ని జెప్పెను.

హరనాథబాలుడది విని "అమ్మా! ఈ హరిత్తరుని మాటలు నమ్మకుము. నీవు జెప్పిన జాతివారు దూరముగానుండియే మాగీతములు నాలకించుచున్నారు. అదియును నపరాధమేయనినచో మాను కొనెదను'' అని జెప్పెను. సుందరీదేవి తన కోపము నణచుకొని "నాయనా! నీవును నీమిత్రులును కలసి మనగృహమందే సంకీర్తన జేసుకొనుడి. నీవెచ్చటకును పోవలదు" అని శాసించెను. హరనాథుడు తన తల్లిమాటలకు మీరి నడుచువాడు కాడు. గనుక సంతోషముతో నొప్పుకొనెను.

కొంతకాలమైన తరువాత ఒకయుత్సవ దినమున బాలురందరును సమీపమందున్న కోవెలకు బోయి నృత్యము చేయదలంచిరి. హరనాథుడు తన తల్లిని సమీపించి "అమ్మా! నేటిదినమునకు మాత్రమే మాకనుజ్ఞ యొసంగితివేని సమీపమందున్న కోవెలలో సంకీర్తనము గావించెదమ'' ని జెప్పి యామె సమ్మతిపై బాలురందరును కలసి ఆలయమున కేగిరి. ఆ యాలయమునకు చేరి యొక తోట యుండెను. బాలురాతోటలోని కేగి సంకీర్తన గావించుట మొదలు పెట్టిరి.

సుమారు నూరుమంది కలసి మనోహరముగా పాడుచు నృత్యముజేయుచుండిరి. ఈ బాలురతో నింతకుపూర్వమాడు కొనుచుండిన కొందరు హరిజనులు కూడ కలసి నృత్యముచేయుచుండిరి. గ్రామస్థులెందరో యచ్చటకు వచ్చి బాలుర నృత్యమును జూచుచు యానందించుచుండిరి. అదేసమయమున హరిత్తరుడు కూడ తోటలోనికి వచ్చి దూరముగా నిలువబడి బాలుర నృత్యమును జూచుచుండెను. బాలురెన్నియో నభినయములను జేయుచు గుండ్రముగా తిరుగుచుండిరి. హరనాథుడు హరిత్తరుని జూచుచు పాడుచుండెను. చూచినకొలదియు హరిత్తరున కావేశము కలుగుచుండెను. భక్తియుద్రేకము

నకు తన హృదయము తట్టుకొన లేకుండెను. హరనాథుడు క్రమక్రమ ముగా తన ప్రేమసుధారసము నీతనిపై వెదజల్లుచుండెను. చేతులు పైకెత్తుకొని హరిత్తరుడుకూడనాట్యము చేయుటారంభించుచున్నాడు! కొందరు బాలుర చేతులు పట్టుకొని వారితో సమముగా యీతడు చిందులు ద్రొక్కుచుండెను. చూచుచున్నవారిలో కొందరు పక పక నవ్వుచు ఛీ! ఛీ! పంచమజాతివారితో హరిత్తరు డాడుచున్నాడు. వానికేమైన పిశాచము పట్టుకొనినదా యనుచుండిరి. కొంతసేపట్లు నృత్యముజేసి స్పృహదప్పి యేడ్చుచు నేలపై బడిపోయెను.

హరనాథు డచ్చటకువచ్చి యాతనికి తిరిగి స్పృహవచ్చిన తరువాత "అయ్యా! ప్రేమపూరితమైన హృదయ నేత్రముల కెట్టి వ్యత్యాసములును గోచరింపవని మీకే యనుభవముగా తెలిసినదా? భగవానుడు జూచునది మన బాహ్యాచారపద్ధతులు గావు, హృదయ మందలి నిష్కళంక విశ్వప్రేమ, అని మెల్లగా జెప్పుచు యాతనికి సేవలు జేయుచుండెను.

నాటినుండియు హరిత్తరుని జీవితమందొక నూతన మార్పుద యించెను. పరోక్షజ్ఞానమునకై వేటాడుట మానుకొనెను. మానవులపై నాధారపడుటకంటె భగవానుని గాఢముగా ప్రేమించుచు యాతనిపైననే పూర్తిగా యాధారపడుటయే పరమోత్కృష్టమగు జీవితధర్మమని యాతడు విశ్వసించి భగవన్నామస్మరణ యందు నిమగ్నుడై తన కాలమును శుష్కవేదాంత చర్యలయందును చింతలయందును వృథాపుచ్చుట మానుకొనెను. శ్రీహరనాథుడు కలకత్తాలో చదువుచుండిన కాలమున హరిత్తరుడు ప్రభువుతో ఉత్తరప్రత్యుత్తరములను జరుపుచుండెను. ఈతడు పరమ భక్తుడై సర్వమును త్యజించి హరినామస్మరణను గావించుకొనుచు తన ప్రాకృత శరీరమును వదలెను.

శ్రీహరనాథుని కృప యెవరిపై బడునో యాతడేకదా నిజముగా ధన్యుడు. అహంకారమును త్యజించి పూర్ణవిశ్వాసముతో గాఢవిశ్వాసముతో యాతని కృపకై దీనముగా వేడుకొసిన పుణ్యజీవులెవ్వరికిని ఇంతవరకును యాశాభంగము కలుగలేదు. శ్రీహరనాథుడు సరణాగతరక్షకుడు. సులభప్రసన్నుడు. మహాదయాళుడు. దీనులెల్లరకును కన్నతండ్రి కంటె యనంతిమడుంగు లధిక ప్రేమను జూపును.

—: హరనాథుడు కలకత్తాపురమున కేగుట :—

హరనాథు డిప్పుడు ఉన్నతకళాశాల ప్రవేశ పరీక్షయందు తీర్ణుడాయెను. ఉన్నత కళాశాలలో చదువుటకై కలకత్తా నగరమునందున్న బర్ద్వాన్ రాజా కాలేజీకి హరనాథుని బంపుటకై సుందరీదేవి శివనాధులు తీర్మానించుకొనిరి. ఒకరోజు సాయంకాలము సుందరీదేవి హరనాథుని పిలచి "నాయనా! నీవింక కలకత్తాపురమున కేగి యచ్చట ఉన్నతవిద్య నభ్యసింపవలసి యుండును. అచ్చటి కళాశాలయందు ప్రవేశించుట కింక వ్యవధిలేదని నీయన్న చెప్పుచున్నాడు" అని చెప్పెను. హరనాథున కెంతయో విచారముగా నుండెను. "అమ్మా! నాకీచదువు వలదు. పెద్ద పెద్ద యుద్యోగములను చేయవలె ననెడి యాశ నాకేమాత్రమును లేదు. సామాన్య స్థితిమంతునికంటెను తక్కువస్థితియే నాకు కావలయును. సర్వులతోను కలసి మెలసి ధారాళముగా తిరుగుటకు పెద్ద యుద్యోగమెంతయో నడ్డుగా నుండును. నన్నిట్లే నుండనిమ్ము" అని హరనాథుడు పల్కెను.

శివనాధుని కెంతయో గోపము వచ్చెను. హరనాథుని జూచి "హరా! నీవిట్లు చెప్పుట నాకెంతయో హాశ్చర్యముగా నున్నది.

ఎవరైనను పెద్ద యుద్యోగములను బడసి కీర్తిని సంపాదింప తపించు దురు. కాని దరిద్రునిగా నుండెద మని నీవలె జెప్పరు. నీకేమైన మతి చెడినదా? కటికి దరిద్రునిగా నుండెదవా? ఛీ!'' అనుచు క్రోధావేశమును జూపుచుండెను.

హర:—"అన్నా! మన మిచ్చటకు వచ్చినది ఖ్యాతికొరకు కాదని నేను తలంచుచున్నాను. మరియు పుట్టించినవాడు యాహార మునుకూడ మనకు బెట్టడా! ఆహా! భగవానుడెంత దయామయుడో కదా! అన్నా! వానిపై పూర్తిగా నాధారపడినవారి కెట్టిలోపమును రాదు. ఎట్టి విపత్తులును కలుగనేరవు. వాని యఖండ నిర్హేతుక ప్రేమను తలచుకొనిన నా హృదయము ద్రవీభూతమగును'' అని జెప్పుచు హరనాథుడు ప్రేమావేశమున కన్నీటిదారను వదలుచుం డెను. తలను వాల్చుకొని నేలపై జూచుచు యేడ్చుచుండెను. మాట్లాడజాలక యచ్చటనుండి వెడలిపోయెను.

సుందరీదేవి కేమియును దోచక నివ్వెరపడి హరనాథుడు వెడలిన వైపుననే జూచుచుండెను.

మరునాడుదయమున హరనాథుని తిరిగి తన యొద్దకు బిలచి "నాచిట్టితండ్రీ! మీతండ్రి చనిపోవుచు నిన్నెంతయో గారాబముతో నాకొప్పగించిరి. నిన్నిట్లే ప్రపంచమున విడచినచో లోకనిందకు నేను పాలయ్యెదను. తుదకు నీకొరకై రెంగ బెట్టుకొని ప్రాణములనుకూడ వదలెదను. నీవు వుద్యోగముచేసినను మానినను చదువకతప్పదు'' అని చెప్పెను. హరనాథుడు తన తల్లిమాటకు జవదాటడు. గాన కలకత్తాపురమున కేగుటకు యొప్పుకొనెను.

హరనాథుడు కలకత్తాలోని బర్ద్వాన్ రాజా కాలేజీలో ప్రవే సించెను. ఇప్పు డాతనికి సుమారు 18 సంవత్సరము లుండును. ఆతడు మరియొక నూతన లీలను ప్రారంభింప నెంచెను. వెనుకటి వలె సంకీర్తన గావించుట పూర్తిగా నాపివేసెను.

తన యుపాధ్యాయులు పాఠములు చెప్పునప్పుడు హరనాథుని నేత్రములు చూచుచుండినను యాతని దృష్టియంతయు పూర్తిగా అంతర్ముఖముగానే ప్రసరించుచుండెను. ఆత డెవ్వరితోను మాట్లా డక మౌనముద్ర ధరించి గదిలోని కడపటి బల్లపై యొక మూల కూర్చొని యుండును. రాధాగోవింద విశ్వాస్ అను మరియొక విద్యార్థి హరనాథుని మనోతత్వము నెట్లో కనిపెట్టెను. ఒక రోజున హాజరుపట్టీ ప్రకారము విద్యార్థుల పేర్లను పిలచుచుండిరి. హరనాథుని పేరు పిలువబడెను. హరనాథుడు చూచుచున్నను నిశ్శబ్దముగా నుండె ను. రెండుమూడు సార్లు గట్టిగా "హరనాథ్" అని పిలచినను హర నాథుడు చూచుచునే నిశ్శబ్దముగా నుండెను! ఒక్కసారి క్లాసులోని విద్యార్థుల లక్ష్యమంతయు హరనాథుని వైపునకు మరలెను. హరనా థుడు కంటిరెప్పనైనను మూయక తదేకధ్యానముగా వెర్రివానివలె జూచుచున్నట్లు వారు గ్రహించిరి. రాధాగోవింద విశ్వాస్ అను నాతని సందేహములు తీరిపోయెను. హరనాథు డట్టి సమాధిలో నుం డుట యాత డనేకసార్లు చూచియుండెను. కనుక యాతడు హరనా థుని సమీపించి మెల్లగా యాతనిని తట్టి "హరనాథ్" అని పిలచెను. త్రుళ్ళిపడి గాఢనిద్రాభంగమైన వానివలె హరనాథుడు లేచి "ఏమి సంగతి" అని యడిగెను. పైవృత్తాంతము నంతయు విని ఆత డెంత యో లజ్జ నభినయించి "అయ్యా! నాపరధ్యానమునకు క్షమింపుడు" అని మెల్లగా తన యుపాధ్యాయునితో చెప్పెను. హరనాథుని వినయ విధేయతల కాయుపాధ్యాయుడు సంతసించి "నాయనా! నీవిచ్చటకు చదువుకొనుటకే వచ్చితివి. ఈధర్మమును మరచి యట్లు పరధ్యానము లో నుండకుము" అని చెప్పెను.

మరియొక దినమున హరనాథు డదేవిధముగా సాయంకాల మాఖరుఘంట కొట్టబడిన తరువాత కూడ కూర్చొని యుండెను.

విద్యార్థులందరును వెడలిపోయిరి. తలుపులను మూయుటకై నౌక రులు లోపలకురాగా వారు హరనాథుని జూచి "అయ్యా! లేచి పోవుడి. వేళ అయిపోయినది" అని చెప్పినను కొంతకాలమువరకును హరనాథు డీ ప్రపంచమునకు దిగకుండెను.

హరనాథు డెవరో, యోగిపుంగవుడో, పరమభక్తుడో, యని రాధాగోవిందుడును, రామ్‌చంద్రముఖర్జీ యను నాతడును మొదట తలంచుచుండిరి. కళాశాల కంతకును హరనాథుని విషయమై యో చించుకొనుచుండిన వారలలో ముఖ్యులు వీరిద్దరే. వీరిలో రాధా గోవింద విశ్వాస్ అను నాతడు బంకూరాలో ప్రఖ్యాతివహించిన ప్లీడ రుగానుండెను. రామ్‌చంద్ర ముఖర్జీ యను నాతడు M. A. పరీక్షయం దుత్తీర్ణుడై అయోధ్య (సోనాముఖికి సమీపమందున్న యొక పురము) లోనున్న ఉన్నత పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగా నుండెను. హరనాథుడే ప్రభువని వీరిరువురును కనిపెట్టిరి. వీరిలో రాంచంద్రముఖ ర్జీ అను నాతడు శ్రీ హరనాథునికి పూర్తిగా సమర్పణమై యాతని నామమునే స్మరించుచుండెను. వీరిరువురి చరిత్రలును ముందుముందు విపులముగా వ్రాయబడును.

ఒకరోజున రాధాగోవిందుడును రామ్‌చంద్ర ముఖర్జీయున్ను హరనాథుని సమీపించి "మిత్రమా! నీచేష్టలుచూడగా నీవొక మహా పురుషుడవేయని యెంచెదము. నీవు మహాధ్యానములో నున్నప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాసములు పూర్తిగా యాగిపోవుట మేమనేక పర్యాయము లు చూచితిమి. ఇంత చిన్నవయస్సులో నీవు జూపుచున్న లక్షణము లను తలంచుకొనిన మాకాశ్చర్య మగుచున్నది" అని జెప్పిరి.

హర:—"ప్రియమిత్రులారా! నేనొక మహాపాపాత్ముడను. నా కెవ్వరును దిక్కులేరు. మీయిరువురును నన్నెట్లయిన రక్షింపవలెను. నాకు కావలసినది మీపవిత్ర ప్రేమయేకాని మరేమియునుకాదు. అని

చెప్పుచు వారి యొడలిని తన మృదుహస్తములతో మెల్లగరాచుచుండెను. ఈస్పర్శవలన వారిరువురును హరనాథునికి శాశ్వితముగా దాసులై పోయిరి! నాటినుండియే వారి హృదయములు బలాత్కారముగా హరనాథునివైపున కాకర్షింపబడు చుండుట వారు గ్రహించిరి. నాటినుండివారు హరనాథుని వెంటనే సదాతిరుగుచు వాని మృదుమధుర వాక్యములను వినుచు కాలము గడుపుచుండిరి.

ఒకరోజున హరనాథుడును ఆతని మిత్రులును కలసి నదీయొడ్డున కేగుచుండిరి. వారికి తెలియకుండగనే హరనాథుడు వారిని విడచి ముందుగా నడచుచుండెను. ఇంతలో కొన్నిబండ్లు ఇటునటు మహావేగమున బోవుచుండెను. హరనాథుని కీ ప్రపంచచైతన్య మేమియును లేదు. యంత్రమువలె యాతనిశరీరము పోవుచున్నదే కాని యాతని లక్ష్యమీ లోకముననే లేదు. అప్రాకృతధామములోనే యాతడు సదా నివసించియుండెను. స్థూలప్రపంచమందలి విషయము లేవియును ఆతని నంటకుండెను,

ఇట్లు నడచి నడచి ఒక మశీదులోనికి ప్రవేశించెను! తన స్నేహితులుకూడ హరనాథుని వెంటబోయిరి. ఒక మహమ్మదీయ యువకుడచ్చట నమాజ్ చేసుకొనుచుండెను. ఆతనిపేరు ఇబ్రాహిమ్. నమాజ్ చేయుచుండగా హరనాథుడు వినుచు ఆనందాతిశయమున ఏకధారగాయేడ్చుచుండెను. అపూర్వభగవత్ ప్రేమ విరహమును చూపుచు ఆమహమ్మదీయుని కౌగలించుకొని "ఒక్క-సారి అల్లాకొరకై తపియించుము. అది చూచుటకే నేనిచ్చటకువచ్చితిని" అని చెప్పి తానేయేడ్చుచుండెను. ఇబ్రాహిమునకు ప్రేమావేశము కలిగెను. భగవానుడు తన సమక్షముననే యుండి తనను జూచుచున్నట్లొక భావమాతనికి కలిగెను. ఈభావమునుండి యాతడు తప్పించుకొనలేక "అల్లా అల్లా" అనుచు వెక్కి వెక్కి యేడ్చుచుండెను. హరనాథుడు వెంటనే ఆమశీదును విడచి హుగ్లీ నదీప్రాంతమున కేగుచుండెను.

పాఠకులారా! ప్రేమ రాజ్యములో సర్వమతములును ఏకీభావమునొందునని ప్రభుహరనాథుడు తనయనుచరుల కిట్లు రుజువుచేయుచుండెను. ప్రేమావేశము వచ్చినప్పుడు భాష, మతచిహ్నములు, తర్కమీమాంసములు, వ్యత్యాసభావములు, కులము, లజ్జ, భయము, కాలస్థలజ్ఞానము మున్నగునవి ఒక్కసారి అంతరించును. ప్రాకృతరూపము లేకపోయినను అప్రాకృత భావరూపము భగవానుని కున్నట్లు అనుభవముగా తెలియబడును. కేవలము అప్రాకృతదృష్టిచేతనే ఇట్టి భావరూపము గ్రహింప వీలగును. ఇట్టి యప్రాకృత ప్రేమభావమును ఎట్టి పాషాండ హృదయములోనైనను శ్రీహరనాథుడు తనసంకల్పమాత్రముచే జనింపజేసి అట్టి జీవులను భగవత్ ప్రేమచే తన యిష్టమువచ్చినట్లు తాండవమాడించు చుండుట అనేకులకు ప్రత్యక్షమే. దామోదరశాస్త్రి, రామ్‌లాల్, రామగోపాల్, సిసిర్‌కుమార్, ఘోషాల్, జగత్‌మోహన్‌దాస్ మున్నగు తార్కికు లెందరో శ్రీహరనాథునికృపచే నిట్టి భావమును పొందగల్గిరి. అట్లు పొందగలిగి ప్రభువునకుశాశ్వత బానిసలై పోయిరి. వీరందరును ఇప్పటికిని సజీవులై శ్రీహరనాథ మహానామమునే స్మరించుచున్నారు. ప్రేమనాథుడగు భగవానుడుగాక ఎట్టి సిద్ధులైనను యోగులైనను జ్ఞానులైనను మహాఋషులైనను జీవులకు నిర్హేతుక ప్రేమను తమ సంకల్పముచే నొసంగజాలరని అనేక గ్రంథములందు వ్రాయబడిన విషయమే. శ్రీహరనాథుడే సాక్షాత్ గోలోకనాథుడగు ప్రేమమూర్తి యనుట కీ ప్రేమశక్తియే తార్కాణము.

హరనాథుడు మశీదును విడచిన తోడనే మహమ్మదీయ యువకుడుకూడ ఆతనిని వెంబడించెను. హరనాథుని సమక్షమున ఆతనికి "అల్లా" ప్రేమ యప్రయత్నముగా కలుగుచుండుట యాతడు కనిపెట్టెను. అవాచ్యమగు మహదానందము నాతడు పొంద గలుగుచుండెను.

—: సిద్ధ పురుషుడు :—

హుగ్లీ నదియొడ్డున హరనాథుడు పోవుచుండగా అచ్చటనివసించిన యొక సిద్ధపురుషుని చుట్టును అనేకులు గుమిగూడి ఒకచిత్రమును చూచుచుండిరి. బండ్లకొలది యాహారమును బెట్టుచున్నను యాతడు దానినంతయు తినివేయుచు ఇంకను కావలయునని యడుగుచుండెను. హరనాథు డతనిని జూచి తన యనుచరులతో చూచితిరా సోదరులారా! ఈతడెట్లు తన శక్తులను వృథాపుచ్చుచు అనేకులకాలమును ధనమునుకూడ వ్యర్థము చేయుచున్నాడో? ఇట్టి శక్తులు కొలదికాలములోనే క్షీణించగానే తిరిగి శక్తులను సంపాదించు కొనుచుందురు. తిరిగి వ్యర్థము చేసుకొనెదరు. భగవానుని సేవించుటయే జీవితధర్మమనువిషయము మరచి అనేకులిట్లు వ్యర్థులగుచున్నారు కదా! అనుచు అచ్చటనుండి మరియొక వైపునకుబోయి నదీయొడ్డున కూర్చొనెను. ఇబ్రాహిమ్‌కూడ శ్రీహరనాథుని వద్దనే యుండెను.

మహమ్మదీయ యువకుని జూచి "సోదరా! నిన్ను జూడ నాకేలనోకాని యానందమగు చున్నది. నీ ప్రతియూపిరితోడను భగవానుని స్మరించుకొను చుండుము. ఆతడు సదా నీయొద్దనే యుండి నీవుచేయు స్మరణను వినుచున్నాడని పూర్తిగా విశ్వసింపుము'' అనిచెప్పి పంపివైచెను. హరనాథుడు పెద్దవాడైన తరువాత కూడ ఈతడు సదా యాతనిని దర్శించుటకు వచ్చుటయు ఆతనికి జాబులు వ్రాయుటయు కలదు. బ్రహ్మమును అల్లాయును ఒక్కటియే యని చెప్పుచు ఈతడొక సమాజమును స్థాపించెను. ఈతడు హరనాథునిట్లు సంభోదించుచు జాబులు వ్రాయుచుండెను:—

"My dear God in the Form of his Holiness Sree Haranath Maharaj"

"పావనమగు శ్రీ హరనాథ్ మహారాజ్ రూపముతో నున్న నా ప్రియమగు భగవానునకు" భగవంతుడే శ్రీ హరనాథ రూపమున మూర్తీభవించెనని యాతడు విశ్వసించి యుండెను. భగవత్ ప్రేమను జీవులకు బోధించుటకును వారికి కలుగజేయుటకును భగవంతుడే ఈ రూపమును గైకొనెనని యాతడు విశ్వసించి హరనాథుని పాదముల వద్ద ప్రణమిల్లుచుండెను. ఆతని పాదసేవ ఆత్రుతతో జేయుచుండెను. ఆయన నేత్రములను జూచి భగవానుని సందర్శించునట్లే యేడ్చుచుండెను.

## శ్రీ హరనాథుడు బ్రహ్మలోకమున కేగుట.

హరనాథుడొకసారి తన తల్లినిజూచుటకై స్వర్ణముఖివచ్చెను. శ్రీహరనాథుడు ప్రతిలోకమునను వ్యవహరించు చుండెనని జీవులకు సూచించు చుండెను. ఆతడు తన భగవత్ స్వరూప మేదియో స్పష్టముగా తెలియ జేయక తాను త్రిమూర్తులకంటె యధికుడనని మాత్రము తన జనని యగు సుందరీదేవి కొకసారి సూచించెను. స్వర్ణముఖిలో తన గృహమందొక రోజు మధ్యాహ్నము హరనాథుడు పవ్వళించి యుండెను. తాను గాఢమగు నిద్రావస్థలో నున్నట్లే కాన్పించుచుండెను. తన జనని యగు సుందరీదేవి తన బాలుని సమీపమునందే కూర్చొనియుండెను. అదే సమయమున హరనాథుని కంఠమునుండి మనోహరమగు గీతమేదియో వినవచ్చు చుండెను. అప్రాకృత ధామము నందలి చిత్రములను వర్ణించుచు పరమేశ్వరుని మహిమను పొగడుచు స్తోత్ర మొకటి యామెకు వినవచ్చు చుండెను. తన బాలుని మధురగాన మామె హృదయమును ద్రవీభూతమొనర్చు చుండెను. ఆమె ఆశ్చర్యముతో పూర్తిగావిని తరువాత తన బాలుని

లేపెను. ఇది యంతయు హరనాథుని లీలయే యని ఆమె యను మానమునైనను పడలేదు. తన కుమారుడు నిద్రించుచు ఏదో కలవరించుచున్నాడను కొనెను! హరనాథుడు లేచిన తోడనే సుందరీదేవి యాతనితో "హరనాథా! ఏమట్లు పాడుచున్నావు? ఆహా! ఎంత మనోహరముగా పాడుచుంటివోయీ! తండ్రీ! మరియొక్కసారి పాడుము?" అని యడిగెను.

హర:—అమ్మా! నేనేమి పాడుచుంటినో నాకేమియు జ్ఞాపకము లేదే, నేను సూక్ష్మశరీరముతో అనేకలోకములు దాటి బ్రహ్మలోకమునకు పోయియుంటిని. అచ్చట బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు, సరస్వతి మున్నగువారును అసంఖ్యాకములగు దేవతలును ఎందరెందరో శిద్ధులు మున్నగు వారును ఏదో కార్యాలోచనకై అచ్చట గుమిగూడి యుండిరి. నే నచ్చటకు వెళ్లినతోడనే నన్ను జూచి త్రిమూర్తులును, సరస్వతి మున్నగువారును దేవతాగణమంతయును జయజయ ధ్వనులతో లేచి నిలువబడి నన్నాహ్వానించిరి. సరస్వతియే ముందుగావచ్చి నన్ను ఆహ్వానించి ఒక ఆసనము నిచ్చెను. నేను కూర్చొనిన తరువాత అందరును కూడ కూర్చొనిరి. అప్పుడు సరస్వతి లేచి మిగిలినవారిని జూచి "ఇప్పుడు శ్రీహరనాథుడు కూడ మన యదృష్టవశమున వచ్చియుండెను. అప్రాకృత ధామములను వర్ణించుచు పరమేశ్వరుని లీలలు వర్ణించవలయునని నేను ప్రార్థించుచున్నాను." అని చెప్పగానే బ్రహ్మ దానికి ఆమోదించెను. దేవతాగణమంతయు వర్ణించమని ఏకకంఠముతో కోరిరి. అమ్మా! అప్పుడు నే నేదియోకాని పాడితిని. అదియంతయు నిపుడు పూర్తిగా మరచితినని శ్రీహరనాథుడు తన జననితో జెప్పెను!

పాఠకులారా! శ్రీహరనాథుడు తన స్వరూపమును స్పష్టముగా తెలియజేయక ఇట్టి దృశ్యములు తాను పొందితినవియు అట్టి దృశ్య

ములు పొందితిననియు కొంత కాలమువరకు చెప్పుచుండెను. తాను పెద్దవాడైన తరువాత తన లీలలను ధారాళముగా వేలకు వేలు ప్రదర్శించుచు తన యాంతరంగికుల సమక్షమున తానే సాక్షాత్ భగవానుడనియు, ఇంతవరకును అనేక యవతారములుగా వచ్చినది తానేయనియు, స్పష్టముగా జెప్పుచు తన వెనుకటి అవతార స్వరూపములను వారికి కనబరచు చుండెను! ఇద్దరకు మాత్రమే తాత్కాలిక భగవత్ దృష్టినొసంగి తన యఖండ భువనమోహన విశ్వరూపమును జూపించెనని ముందు ముందు చదువబోయెదరు!

# పాపభారములు మోయుట.

శ్రీహరనాథుడు తిరిగి కలకత్తాపుర మేగెను. తన ప్రియస్నేహితుడగు రామ్‌చంద్రము ఖర్జీ క్షయరోగముతో బాధపడుచుండెను. ఎన్ని మందు లొసంగినను యాతనికి కుదురుట లేదు. ఒకరోజున హరనాథు డతనిని సమీపించి "సోదరా! మధురతమమైన శ్రీకృష్ణనామమును స్మరియించు కొనుము. నీకు స్వస్థతగలుగునని'' జెప్పెను. కాని భగవన్నామ స్మరణ వలన తన జాడ్యము తగ్గునను విశ్వాసమాతనికి లేకుండెను. హరనాథు డాతనితో మరియొకరోజున "రామచంద్రా! నీకెట్టిభయమును లేదు, పూర్ణవిశ్వాసముతో నామమును స్మరించుము. కొలది కాలములోనే నీకు పూర్ణస్వస్థత కలిగితీరును. నామాటల యందు విశ్వాసముంచి శోధనకైనను భగవన్నామ శక్తిని కనిపెట్టుము'' అనిజెప్పగా రామచంద్రునకు విశ్వాసముకలిగి యట్లే స్మరించుకొనుచుండెను. చూచుచుండగనే 2, 3, దినములలోనే యాతనికి పూర్ణారోగ్యము సిద్ధించెను! రామచంద్రుని సంతోషమునకు మితిలేదు. హరనాథుడే తన రక్షకుడని భావించుచుండెను. కేవలము

నామస్మరణవలన అంతశీఘ్రముగా తన జాడ్యము కుదురుట దుస్సాధ్య మనియు, హరనాథుని కృపయే ముఖ్యకారణమనియు, ఆతడు భావించుకొనుచు శ్రీహరనాథుడు నరరూపముతోనున్న భగవంతుడే యని ఆతడు విశ్వసించు చుండెను.

రామచంద్రునకు స్వస్థత కలుగుటకు మొదలు హరనాథుడు క్షయరోగముతో బాధపడుచుండెను! రామచంద్రు డిది జూచి ఎంతయో యాశ్చర్య పడుచుండెను! హరనాథుని కారణమడుగ "సోదరా! నాకెట్టిబాధయును బాధవలెదోచుట లేదు. మీరు మిక్కిలి నేనిట్లు బాధపడుట నాకెంతయో ఆనందముగా నున్నది." అని జెప్పెను. రామచంద్రుని దుర్భరరోగమును తనపై నాకర్షించుకొని శ్రీహరనాథుడు బాధపడుచుండెనను విషయము ఆతని కప్పుడు తోచెను.

క్రమ క్రమముగా హరనాథుడు శుష్కించి పోవుచుండెను. ఎట్టి చికిత్సలకైనను యాతడొప్పుకొనకుండెను. ఈవిషయము నుందరీ దేనికి కూడ తెలియజేయక రహస్యముగా బాధపడుచుండెను. కొన్ని దినములు గడచిన తరువాత స్వర్ణముఖి గ్రామము వచ్చిన వెంటనే తన తల్లి యాతనిని జూచి "నాయనా! ఇదేమివింత! నీవిట్లు శుష్కించి పోయి యున్నావు? అని చెప్పుచు ఎంతయో దుఃఖించుచుండెను. వెంటనే తగినవైద్యులను నియమించవలెనని యోచించు చుండగా హరనాథు డామెనుజూచి "అమ్మా! నీకు భయమేటికి? సర్వశక్తి వంతమైన శ్రీకృష్ణప్రేమామృతమును గ్రోలుచుండగా నాకువేరు చికిత్సలేల? పరమ దయాళుడగు శ్రీకృష్ణుని యిచ్ఛ, నెరవేరును గాక! నాకెట్టి మందులునువలదు. ఎప్పటికైనను నాగోపాలుడే నన్ను రక్షించి తీరును సుమా" అని చెప్పెను. శ్రీహరనాథుని యాత్మ సమర్పణా భావమున కామె సంతసించు చున్నను అపాయకరమగు నీ జాడ్యమును ప్రత్యక్షముగా జూచుచు ఆమె సహింపలేక "తండ్రీ! నీవు దగ్గుచున్న

పుడు రక్తముపడుచున్నది. తగిన యౌషధమును సేవింపకున్నచో నీప్రాణమునకు మోసము వచ్చును. నాకన్నుల యెదుట నీవు మరణించినచో నేను మాత్రము మరణింపకుందునా? నీవు మందుపుచ్చుకొనక తప్పదు'' అని శాసించెను.

భగవన్నామశక్తిని ప్రదర్శించుటకును భగవానునికి పూర్తిగా సమర్పణ అయినచో ఎంత విచిత్రముగా యాతడు జీవులను రక్షించునోయని జీవులకు తెలియజేయుటకును మహాప్రభువగు హరనాథుడు గూఢమగు తన నరలీలలో దుర్భరమగు కఠినరోగములను తనపై దెచ్చుకొను చుండెను!

మరునా డుదయమునుండి హరనాథు డెట్టి బాధనుగాని జూపుటలేదు! రోగమంతయును ఒక్కమారు పోయినట్లే తన తల్లితో జెప్పెను. సుందరీదేవి కెంతయో మహదాశ్చర్యము కలిగి "హరా! ఇదంతయు నైంద్రజాలమువలె నున్నది. నీక్షయరోగ మంతయును ఎంత యద్భుతముగా మాయమై పోయినది! అని చెప్పుచు భగవానుని స్తుతించు చుండెను.

హర:—"అమ్మా! నిన్నరాత్రి నాకెంతయో బాధగా నుండెను. అప్పుడెవరో యొక చిన్నబాలుడు నావక్షముపై కూర్చొని తన చిన్న చేతిని మెల్లగా నా గొంతుకలోదూర్చి ఒక మాంసపుముద్ద వంటి పదార్థమును వెలుపలకుదీసి ఈ తెల్లని పాన్పుపై బెట్టెను. ఆబాలుని ముఖమును స్పష్టముగా జూడగా వాడు నాకెంతయో చిరకాల పరిచితునివలె కాన్పించెను. ఆతడే బృందావన బాలగోపాలుడని నాకు జ్ఞప్తికివచ్చినది.'' అని మాత్రమే తన జననికిజెప్పి "అమ్మా! ఉదయమున చూడగా నాదృశ్యము స్వప్నము కాదని రుజువు యగుచు నా పాన్పుపై ఎఱ్ఱని రక్తపుడాగు మాత్ర మొకటి కాన్పించినది'' అని చెప్పుచు తనతల్లికి పాన్పుపై నున్న రక్తపుడాగును జూపించెను. ఆమె

కిదియంతయు నొక విష్ణుమాయవలె కాన్పించుచుండెను. తన తనయునకు గోపాలుడు చిరకాల పరిచితుడెట్లగునని యామెకు సందేహము కలిగెను. "నాహరనాథుడు గోపాలునికి ప్రాణమిత్రుడు కావలయునని హరనాథుడే సూచించుచున్నాడు. ఇది నిజమా లేక హరనాథుడే గోపాలుడా? శశిభూషనుని వాక్యములు సత్యమేమో" అనుకొనుచుండగా హరనాథుడు తన తల్లినిజూచి "అమ్మా! నాకింకను నీరసముగానున్నది. ఏమైన తగిన మందు పుచ్చుకొనిన బాగుండునేమో యని నాకు తోచుచున్నది" అని జెప్పెను. వెంటనే సుందరీదేవి కింతకు పూర్వము మెరుపుతీగవలె జనించిన విశ్వాసమంతయును బోయి హరనాథుడు సామాన్యబాలుడే యను భావము స్థిరముగా నిలిచెను! ఇదియే భగవల్లీల. ఇదియే ఆయన విష్ణుమాయ! ఆహా! శ్రీహరనాథుడు తన సంకల్ప మాత్రమున ఎట్టి దృఢవిశ్వాసమునైనను తలక్రిందులు చేయునుకదా! ఎట్టి పాపాండులకైనను విశ్వాసము జనింపజేయునుకదా! విశ్వాస దాతయును విశ్వాసచోరుడును కూడ నాతడే యని అనేకసార్లు ఋజువుచేసెను.

—: దేవతలు హరనాథుని సందర్శించుటకు వచ్చుట :—

ఒక రోజు రాత్రి హరనాథుడు తన పాన్పుపై పవళించియుండెను. భగవతీదేవికి నిద్రాభంగమగుటచే లేచి తన పాన్పుపై కూర్చొనెను. హరనాథుడు పవళించి యుండిన గదిలో నొక తేజస్సు యామెను గోచరించుటచే లోనికేగెను. కొందరు తేజోమూర్తులు హరనాథుని పాన్పుచుట్టును నిలువబడి యుండిరి! భయభ్రాంతులచే నామె తక్షణము వెనుకకు మరలి ఒక్కపరుగున తన పాన్పువద్దకేగెను. వెంటనే హరనాథుని గదిలోని కాంతియంతయు క్షీణించెను. ఆమె తన పాన్పువద్దనే యుండి "హరనాథ్" అని బిగ్గరగా పిలచెను. హర

నాథుడు లేచి బయటకు వచ్చుచుండెను. తన విచిత్రదృశ్యమును గూర్చి యామె హరనాథునితో జెప్పి "నాయనా! నాకేలనో కాని భయమగుచున్నది. మన గృహమందు దేవతలో మరెవ్వరో కాని సంచరించుచున్నారు. ముఖ్యముగా నీక్షేమమును గూర్చియే భయ పడుచున్నాను" అని జెప్పెను. హరనాథుడు పకపక నవ్వి "అమ్మా! నీవు పరమభక్తురాలవు. మహాసాధ్వీమణివి. అట్టి పుణ్యజీవి కాపుర ముండు గృహమున దేవతలుగాక ఇతరు లెట్లు సంచరింపగల్గుదురు? నీవేమియును భయపడక సర్వభారమును భగవానునికి వదలివేసి నిశ్చిం తగా నుండుము" అని జెప్పెను.

పాఠకులారా! దేవతాగణములు తనను సందర్శించుటకై సదా వచ్చుచున్నట్లు ప్రభువే స్పష్టముగా జెప్పియున్నారు. ఈ విష యము శ్రీహరనాథ లీలామృతము మొదటిభాగమునందు వ్రాయ బడినది. దేవతాగణములు తనను దర్శించుటయును తన యాజ్ఞల నెల్లను సదా శిరసావహించి కొనసాగించుటయును గూర్చి ప్రభు హరనాథుడే స్పష్టముగా జెప్పియుండెను. ఇదిగాక తన 29-వ సం॥న కాశ్మీరములో నున్నప్పుడు జయంతి ప్రసాద్ అను కాశ్మీర ప్రభుత్వ దివానుగార్కి కూడ అట్టి యద్భుతదృశ్యమైనట్లు ముందు ముందు వివరము లియ్యబడినవి. నారాయణచంద్రఘోష్‌గారు నాకు వ్రాసిన నొకలేఖయం దిట్లు తమ యనుభవమును గూర్చి జెప్పుచున్నారు:—

"శ్రీహరనాథ భగవానుని సందర్శించుటకు దేవతాగణములు వచ్చుట అనేకసార్లు నేను ప్రత్యక్షముగా జూచితిని. అట్లు జూచిన వారింకను యున్నారు'' అని వ్రాసియున్నారు. బరంపురములోని సత్యనారాయణరావుగారు కూడ తమ యనుభవమును జెప్పుచు "ఎందరెందరో శిద్ధులు మున్నగువారు పైలోకములనుండియో మరె చ్చట నుండియో కాని వచ్చి ప్రభుహరనాథుని సందర్శించి వారి

పాదములకు ప్రణమిల్లి వెంటనే యదృశ్యు లగుచుండెడివారు. బొంబాయినగరమునందు 'క్రిష్ణకుంజ' అను భవనములో ఒక దినము రాత్రి 12 ఘంటలకు అట్లు జరుగుట నేను కండ్లార జూచితిని'' అని మాతో చెప్పిరి.

జ్యోతిష్ చంద్రవిశ్వాస్ B, A,, B. L. గారు మాతో ఇట్టి విషయములనే జెప్పుచు తమ స్వానుభవములనే స్పష్టపరచిరి. ధర్మారావునాయుడుగారు కూడ తమ స్వానుభవము నొకటి జెప్పిరి.

ఈ లోకమునందలి జీవులతో ప్రభువెట్లు విహరించుచుండెనో ప్రతిలోకము నందలి జీవులతోను కూడ ప్రభు అదేసమయమున విహరించుచు యాడుకొనుచుండెనని ప్రభు హరనాథుని భక్తుల కనేకులకు స్వానుభవవిషయమేయని తెలసికొనెదముగాక! ప్రభుహరనాథుడు బొంబాయిలో రంచూర్ దాసుగారు మరికొందరు భక్తుల సమక్షమున ఒక రాత్రి యిట్లు నుడివిన విషయము మరువకుడి:—

"నేనిప్పుడీ లోకముననే వ్యవహరించుచున్నా నని తలంపకుడి. ఒకేసమయమున నేనితరలోకములలోకూడ వ్యవహరించుచునే యున్నానని యెరుంగుడి'' అని జెప్పెను. శ్రీ హరనాథ తత్వమను ఇంగ్లీషు గ్రంథమునందు (186 పుటలో) నిట్లు వ్రాయబడినది:—

"Haranath had followers simaltaneously from the four worlds the Trans-divine, the Divine, the Astral and the Physical...."

"నాల్గు ప్రపంచములలోను కూడ శ్రీహరనాథునకు భక్తులు కలరు. అనగా స్థూల, సూక్ష్మ, కారణ, అప్రాకృత శరీరధారులు, ఒకేసారి ఆయనతో తిరుగుచుండెడివారు.'' మహాప్రభువగు శ్రీహరనాథుడు ఒకేసారి వివిధలోకములయందుండెడి జీవులతో క్రీడించుచు ననయఖండ ప్రేమలీలలచే వారి కానంద మొసగుచు సంచరించుచుండెను.

# కుసుమకుమారీదేవి సర్పగండము.

ఒక రోజు రాత్రి కుసుమకుమారీదేవి నిద్రించుచుండగా ఆమెను నొక పాము కరచెను. వెంటనే యామె లేచి పామునుజూచి గృహము నందున్న వారి నందరను లేపుటకై గట్టిగా పిలచుచుండెను. వెంటనే అందరును మేలుకొని ఆమెవద్దకు వచ్చిరి. ఆమెను కఱచినది నాగు పామగుటచే ఎంతయో భీతిల్లి మంత్రవేత్తలకై కబురు పంపిరి. గృహము నందున్న వారందరును లేచినను హరనాథుడు గాఢనిద్రలోనే యున్నట్లు కాన్పించుచుండెను. ఆ గదిలోని జనులందరును ఎంతయో గట్టిగా యరచుచు లేపుచున్నను హరనాథుడు మేల్కొ[న] లేదు. సుమారు 20 మంది జనులప్పుడు గుమిగూడియుండి హరనాథుని లేపుచుండిరి కాని ప్రయోజనము లేదు.

మంత్రవేత్తలందరును ఎన్నియో మంత్రములు పఠించినను కుసుమాంబ చైతన్యము లేక పరుండియుండెను. ఆమె దేహచ్ఛాయ యంతయు నల్లగామారిపోయెను. కొనయూపిరి మాత్రమే యుండెను. తిరిగిహరనాథుని లేపుటకు ప్రయత్నించిరి. కాని లాభములేకపోయెను.

అట్టి సమయములో హరనాథుని కంఠమునుండి యొక వాక్యము వెలువడెను. "రాధా గోవింద నామమును మీరందరును స్మరించి హాయిగా నిద్దురపోవుడి'' అను వాక్యము ఆతని కంఠమునుండి మెల్లగా మధురనాదముగా వినవచ్చెను. ఒకసారి జనులందరును "రాధా గోవిందా రాధాగోవిందా'' యని యరచిరి. వెంటనే కుసుమాంబ నిద్రనుండి లేచినట్లే లేచి కూర్చొనెను. "ఆహా! భగవన్నామమునం దెంత మహిమయున్నది! ఎట్టి మంత్ర తంత్రములుగూడ భగవన్నామముతో సాటికాదుకదా" అని అచ్చటి జనులందరును యనుచు హరనాథుని స్తుతించిరి.

మరునాడుదయమున హరనాథుడు మేల్కాంచి ఏమియు యెరుగనివానివలెనే గృహకృత్యములను చేసుకొనుచుండగా సుందరీదేవి యాతనిని జూచి "హరనాథా! నీవు రాత్రి యంతయును ఎంత గాఢనిద్రలో యుంటివి. అట్లు నిద్రించుచున్నను రాధా గోవింద నామమును చేయుడని మాతో నెట్లు చెప్పితివి?" అని యడుగగా హరనాథుడు "అమ్మా! నేనేమియును పలికినట్లు నాకు తోచదు. బహుశా శ్రీకృష్ణుడే నానోటనుండి అట్లు పలికి యుండవచ్చును. ఆహా! గోపాలు డెట్టి దయాళుడో మీకు తెలియుచున్నదా! భగవన్నామమహిమ మీకిప్పుడు తెలిసినదా?" అనుచు వెడలిపోయెను. శ్రీహరనాథుని మహావాక్యమును మరువకుడి:—

"నేను నటనాగ్రేసరుడను. నాజీవిత మెవ్వరికిని తెలియరాదు. నాజీవిత మొక మహాసమస్య. అది సులభగ్రాహ్యముగా నుండదు. అట్లుండుటకు వీలులేదు."

ఈ మహావాక్యమును గమనించినచో ప్రభు హరనాథుని నరలీల యందలి రసమును పూర్తిగా గ్రోలవచ్చును. భగవంతునకు జీవులయం దెట్టి గాఢమగు నిర్హేతుక కృపయున్నదో స్పష్టముగా తెలియును. శ్రీహరనాథుని నాటకప్రదర్శనమునకు మరింత రక్తి కట్టించుటకు జగజ్జనని యగు కుసుమాంబ తన సర్వశక్తులను తాత్కాలికముగా అణచుకొని ఒక సామాన్యజీవివలెనే నటించుచు ఆయన లీలానాటకమున కెంతయో తోడ్పడునుకదా?

## ప్రేమవిరహము.

హరనాథుడు తిరిగి కలకత్తాపురమున కేగెను. వెంటనే ఆతని స్నేహితు లాతనిని జుట్టి యాతని మృదుమధుర ప్రేమవాక్యములను వినుచుండిరి. తమ స్నేహితుడగు హరనాథు డిప్పుడెంతయో విచార

కరముగా కన్పట్టుచుండెను. ఆతని ముఖమును తిలకించిన ప్రతివారికిని అప్రయత్నముగా హృదయము కరుగుచు కన్నీటిధార వచ్చుచుండెను. ఆతనినేత్రము లెంతయో దీనభావమును సూచించుచుండెను. తన స్నేహితులను జూచి హరనాథు డిట్లు పలుకజొచ్చెను:—

"సోదరులారా! నాకేలనోకాని కళాశాలకేగి విద్యనభ్యసించుట కెంతయో కష్టముగానున్నది. ఏపనిచేయుటకును నాహృదయ మంగీకరించుట లేదు" అని చెప్పుచుండెను. హరనాథు డిప్పుడు తనయప్రాకృత ధామములోనే సదా నివసించుచుండెను. తన స్థూలశరీరము మాత్రము ఈలోకమునందు కన్పట్టు చుండెనేకాని యాతడు సదా తన యప్రాకృత ప్రేమరాసయందు నిమగ్నుడై యుండెను. పగటి వేళయో రాత్రి వేళయో కూడ హరనాథునికి తెలియకుండెను. ఒక్కొక్కప్పుడు తన పాన్పు అంతయు కన్నీటిధారతో తడసియుండును. ఒక్కొక్కప్పుడు ఆతని దేహమందలి జీవకళ పూర్తిగాపోయి నిర్జీవునివలె కన్పట్టు చుండెను. ఒక్కొక్కప్పుడు ఉండవలె చుట్టబెట్టుకొని చూచుటకొక మాంసపు ముద్దవలెనే కన్పట్టు చుండెను. పసిబాలుని కంటెను తక్కువగానే యాహారము భుజించును. హరనాథుని స్నేహితులకీ భావతత్వమించుకయు నర్థముగాక, అప్పు డప్పుడు భీతిల్లుచు హరనాథుడు బ్రతుకునను యాశవదలుకొను చుండిరి. ఒక్కొక్కప్పు డిట్లు తనలో తాను మాట్లాడు కొనుచుండెను. "ప్రియులారా! మీరునన్ను విడచినను నేనుమాత్రము మిమ్ములను విడచి యుండజాలను. మీరే నాసర్వస్వము" అనుచు తిరిగి నిర్జీవునివలె తన పాన్పుపై బడిపోవును.

హరనాథుడు కళాశాల మాటయే పూర్తిగా మరచిపోయెను. తాను విద్యార్థియను మాటయే మరచి పోవుచుండెను! అప్పు డప్పుడు హరనాథుడెంతయో దీనముగా తన స్నేహితులవంక జూచి "మిత్రులారా! నాకొరకై మీరు విచారింపకుడి. మీరు బాగుగాచదివి పరీక్ష

యందు త్తీర్ణులయ్యెదరుగాక'' అని చెప్పియూరకుండును. ఆ ధీన నేత్రములు చూచిన చూపరుల హృదయములు కరుగుచుండెను.

ఇట్లు దినములుగడిచి పోవుచుండెను. పట్ట పరీక్షలు జరిగెను. హరనాథుడు కలకత్తాపురము విడచి తన స్వగ్రామమునకు బయలుదేరుసమయము వచ్చెను. హరనాథుని విడచి వెళ్లుట తన స్నేహితులకెంతయో కష్టముగానుండెను. తమ స్నేహితునిగాంచి "హరనాథా! నీవు మూర్తీభవించిన ప్రేమగాని మరియొక స్వరూపముకాదు. మేమెచ్చటనుండినను నీ భానిసలమనియే గ్రహింపుము. నీదర్శన స్పర్శలవలన మాకు పునర్జన్మసిద్ధించి పావనుల మైతిమని భావించుకొనుచున్నాము. సోదరా! మమ్ము మరువవలదు'' అని చెప్పుచు వారు హరనాథునకు ప్రణమిల్లిరి. హరనాథుడు వారిని లేవనెత్తి కౌగలించుకొనెను. విద్యుశ్శక్తివలె యాతని ప్రేమకిరణములు వారి హృదయములందు ప్రసరించెను. పట్టరాని ప్రేమావేశముచే వారు వెక్కి వెక్కి యేడ్చుచుండిరి. హరనాథుడు వారినిగాంచి "మిత్రులారా! నేనొకదరిద్రుడనుగాన మీకేమియు నొసంగజాలనైతిని. శ్రీకృష్ణుడు సదా మీవెంటనే యుండును గాక!'' అని దీవించి వారిని బంపెను.

శ్రీహరనాథుడు పెద్దవాడైన తరువాత ఈమిత్రులలోని రాధాగోవింద విశ్వాస్ గారింటికి యాహ్వానింపబడెను. శ్రీహరనాథుడే భగవదవతార పురుషుడని వారుపూర్తిగా విశ్వసించిరి. బంకూరాపట్టణమునందు శ్రీహరనాథ నామమును ప్రచురించుటలో రాధా గోవిందుడెంతయో సహాయపడుచుండెను. ఈయననుసరించి ఈతనిచుట్టములు స్నేహితులు మున్నగు వారెందరో హరనాథ భక్తకోటిలోజేరిరి.

## హరినాథుని ప్రతిజ్ఞ.

హరనాథుడు తన పట్టపరీక్షయందు త్తీర్ణుడు కాలేదని శివనాథునికెంతయో కోపమువచ్చెను. దినములు గడచిపోవుచుండెను.

క్రమక్రమముగా జయరాముని పేరుతో సాగింపబడుచున్న లక్క-వ్యాపారములో విశేష ధననష్టము వచ్చుటచే హరనాథుడు ధన సంపాదన ప్రారంభించవలసిన పరిస్థితి వచ్చెను. కాని హరనాథుడెట్టి సంసార బాధ్యతను వహింపక సోనాముఖి చుట్టుప్రక్క-లనుండు గ్రామములందు హరినామ ప్రచారము గావించుచు వేలకొలది ప్రజలను భక్తిసాగరమున నోలలాడించుచుండెను. భగవన్నామ మహిమను ప్రచురించుటకై భగవానుడే యిట్లవతరించెనని అనేకులు యూహించుచుండిరి. ఏమనిన ఎట్టిపాషాండహృదయములనైనను హరనాథుడు తన సంకల్ప మాత్రముచే ద్రవీభూత మొనర్చుచు అట్టివారిచే హరినామ స్మరణను గావింపజేయుచుండెను. హరనాథుని ప్రేమశక్తి ధాటీల కెవ్వరును యెదుట నిలువబడలేక పోవుచుండిరి ఎన్నియో విధముల ఆక్షేపణలుచేయుచున్నవారుకూడ హరనాథుని ముఖమునుజూచి అతని నోటనుండి భగవన్నామము నొక్క-సారి వినినంతనే కన్నీరు కార్చుచు చేతులు పైకెత్తి రాధేగోవింద నామమును బిగ్గరగా పాడుచు చిన్న పిల్లలవలెనే ఎగురుచుండిరి! హరనాథుడు చేయించుచుండిన సంకీర్తనలన్నియును భావోద్రేకమునకు ప్రఖ్యాతివహించెను. మౌన ముద్ర ధరించి తటస్థముగా నుండువారుకూడ భావోద్రేకముచే హరినామమును జేయుచు వెక్కి- వెక్కి- యేడ్చుచుండిరి. ఒక్కొక్క-ప్పుడు 4, 5, మృదంగము లొకేసారి పనిచేయుచుండెను. ఒక్కొక్క-సారి వందల కొలది ప్రజలు తాళములువేయుచు నాట్యముచేయుచుండిరి. శ్రీహర గోపాలుని కృపవలన కన్నీటిధార లెంతయో చవుక అయిపోయెననియే సర్వులును భావించుకొను చుండిరి. భగవత్ దృశ్యములెంతయో సాధారణ యనుభవమైనదనియే అనేకలు వింతగాజెప్పుకొను చుండిరి. ప్రాపంచిక విషయములనెడి దీర్ఘసుషుప్తియందు చిరకాలమునుండి పడియుండిన జీవులెంద రెందరో ఈ భావప్రదర్శనముచే సులభముగా

మేల్కొంచి భూలోక వైకుంఠమువంటి ఇట్టి సత్సంగమునందు హరి నామము గానించుకొనుచుండిరి. ఆనందబాష్పములని గ్రంథములలో చదువుటయేగాని కన్నీటిధారలు వందలకొలది జీవులముఖముల యందు జూచుట ఇప్పుడనేకులకు అనుభవసిద్ధమైనది. కాలస్థలజ్ఞానమును శరీరజ్ఞానమును పూర్తిగాపోయి భగవత్ ప్రేమలో లయమై ఘంటల కొలది నిశ్చేష్టులై నిర్జీవులవలె నుండుట, శ్రీహరనాథుని కృపవలన ఇప్పుడు సామాన్యదృశ్యమైనది కదాయని అనేకు లుప్పొంగుచుండిరి. బాలురును, వృద్ధులును, పండితులును, పామరులును, ధనవంతులును, దరిద్రులును, బ్రాహ్మణులును, శూద్రులును, స్త్రీలును, పురుషులును, తమ తమ కులమును స్థితిని మున్నగువాటిని మరచిపోయి ఒకే రంగ స్థలమునచేరి జగన్నాయకుడును జగదాధారుడును జగజ్జనకుండును అగు ఆ హరిహరనాథుని పరమపవిత్ర నామామృతమును గ్రోలుచున్నారు కదాయని అనేకులు మన చిన్ని హరనాథుని విశేషముగ పొగడు చుండిరి.

ఒక దినమున శ్రీహరనాథుడు తన సంఘవార్షికోత్సవమును చేయించి వేలకొలది జీవులను ఆనందసాగరమున ముంచి రాత్రి సుమారు 10 ఘంటలకు తన గృహమునకు వచ్చుచుండెను. తన సంసారబాధ్యత నేమియును వహించక హరనాథుడిట్లు దినమంతయు హాయిగా తిరుగుచున్నాడను క్రోధములో శివనారాయణ తన వీధి గుమ్మముయొద్ద కూర్చొని తనతల్లితో నిట్లు చెప్పసాగెను. "అమ్మా! మన హరనాథుని నడత యెట్లున్నదో జూచితివా? భగవన్నామ ప్రచారమను పేరుతో దినమంతయు నానాగ్రామములును తిరిగి తన పరీక్షయందు త్తీర్ణుడు కాలేకపోయెను. ఇప్పుడైనను సంసారబాధ్యత యనునదిలేక దినమంతయు విచ్చలవిడిగా తిరుగుచున్నాడు. ఇంత రాత్రియైనను గృహమునకు రాడాయెను. వీనిని రేపటినుండి మన

గృహములో నడుగుపెట్టనీయ దలచుకొనలేదు! ఈ రాత్రి వీనికి భోజనము పెట్టవలదు'' అని కఠినముగా శాసించెను.

హరనాథుడు దీర్ఘాలోచనా నిమగ్నుడై మెల్లగానడచుచు తన గృహమునకు వచ్చుచుండెను. ఆనాటిరాత్రి తనతోకూడ వచ్చుచున్న తన బృందమునంతయును పంపివేసి తానొక్కడే వచ్చుచుండెను. నక్షత్రముల వెలుగుదప్ప వీధులలో మరియొక వెలుగు లేకుండెను. అది పల్లెటూరగుటచే ఆ సమయమునకు ఊరంతయు మాటుపడి నిశ్శబ్దముగానుండెను. హరనాథుడు గృహమునకెప్పుడు వచ్చునా యని క్రోధోద్దీపితుడై శివనారాయణ గుమ్మమువద్దనే కనిపెట్టుకొనియుండెను. మెల్లగా నడచుచు హరినాథుడు తన గృహముఁ జేరెను. తన తమ్మునిజూచి శివనారాయణ యిట్లనెను:—

"హరనాథ్! ఇంతవరకును నేనెట్లో సహించితిగాని ఇప్పటి నుండి నీవీగృహమున నిరుద్యోగివై యుండుట నేను సహింపజాలను. రేపటినుండి నీవింటివద్ద భోజనము చేయుటకు నేనొప్పను. రేపటి నుండియే నీవు నాగృహమును విడువవలయును. నా మాటలన్నియును వినబడుచున్నవా లేవా?'' అని బిగ్గరగా యరచుచుండెను. శివనారాయణ భార్యయును, తల్లియగు భగవతీదేవియును శ్రీహరనాథుని సతీమణియగు కుసుమకుమారీదేవియును శివనారాయణ కంఠమునువిని వీధిగుమ్మమువద్దకొచ్చి లోపలనిలువబడిరి. ఇప్పటికి 4, 5 దినముల నుండియు కుసుమాంబ యేలనోగాని విచారగ్రస్తముగా కాన్పించుచుండెను. ఆదినమున నామె భోజనము కూడ చేయలేకపోయెను. ఇప్పుడామె మనోస్థితి వర్ణనాతీతము. ఎంతయో కష్టముతో తన దుఃఖమునంతయును దిగమ్రింగుచుండెను. శ్రీహరనాథు డవతరించిన ముఖ్యమైన పని ప్రారంభింపబడుటకు కాలమాసన్నమైనదని యామెకు పూర్తిగా తెలియును. తన ప్రాణవల్లభుని దివ్యముఖారవిందము నామె నిత్యము

నుచూడజాలని కాలము సమీపించుటచే నామెకు పట్టరాని దుఃఖము వచ్చుచుండెను. తన ప్రాణనాథుడింత తన్ను విడచి ఘోరపాపుల పాపభారములను భుజములపై నిడుకొని దుర్భరముగా బాధపడుకాల మాసన్నమగుచున్నది కదాయని యామె కెంతయో విచారముగా నున్నది. ఊహాతీతమగు ప్రేమరాసానందమును విసర్జించి ఈకలియుగ పాపజీవులకొరకు తన నాథుడు చూపింపనున్న అపూర్వ త్యాగమును తలంచుకొనినంతనే యామె హృదయము చీలిపోవుచుండెను.

తన యన్నగారగు శివనారాయణుని క్రోధ వాక్యములను విని నంతనే హరనాథుడు కన్నీరు కార్చుచు మహాశాంతముతో నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

"అన్నా! భగవానుని దయాళత్వమును తెలుసుకొన జాలక ఈసంసారముకొరకై నీవిట్లు చింతించుచున్నావుకదా. తల్లి యొడిలోని చంటిబిడ్డ తన యాహార పానీయములకై లిప్తకాలమైనను చింతించునా? ఏ నాడు మనము భగవానుని యొడిలోని చంటిబిడ్డలమని భావించి సంపూర్ణముగా యాయనపై నాధారపడి యాయన కార్యములుచేయు మొదలు పెట్టెదమో యాక్షణము నుండియే మన బాధ్యతలన్నియును ఆతడే వహించుకొనును. దీనికి దృష్టాంతరములు నీకే తెలియనున్నవి. అంతవరకును నీకార్య భారములను ఆయన భుజములపై నిడి నిశ్చింతగా యాయన నామమును భజింపుము" అని చెప్పెను. శివనారాయణ మరింత క్రోధావేశముతో, "నీ వేదాంతములు నాకు తెలియకపోలేదు. ఇట్టి మాటలింక చాలింపుము. రేపటినుండి ఉద్యోగమేదియో నీవు సంపాదించుకొనునంతవరకును నాగృహములో నుండుటకు వీలులేదు. మారు మాటాడకుము!' అని చెప్పెను.

"గోపాలునియాజ్ఞ నెరవేరునుగాక" యని జెప్పుచు హరనాథుడు మెల్లగా లోనికేగి యొకబల్లపై నాసీనుడై దీర్ఘాలోచనా నిమగ్నుడై యుండెను. కొంతసేపైన వెనుక తనతల్లి యచ్చటకు వచ్చి 'నాయనా! హరనాథ్! నీయన్నమాటలను పాటించకుము. భోజనము పెట్టియుంచితిని లెమ్మ" అని పిలచెను. శ్రీహరనాథు డీమాటలు విని "అమ్మా! నాకొరకై చింతింపకుము. నాకు భోజనమువలదు. గోపాలుని యిచ్ఛనెరవేరునుగాక!" అని చెప్పెను. తన తల్లి యెంత బ్రతిమాలుకొనినను హరనాథుడు భోజనము చేయకుండెను. హరనాథుని పట్టుదలజూచి తన తల్లి భయపడి "నాయనా! నీకుద్యోగము లభింపువరకును నిట్లే భోజనముమానుకొనెదవా?" అని ప్రశ్నించెను. హరనాథుడు తన తల్లి భయమును బాపుటకై "అమ్మా! ఇప్పుడు నీకాభయమేల? రేపుదయమగు సరికి అన్ని విషయములును తేలిపోవును. నన్నుగురించి నీవేమాత్రమును భయపడకుము" అని చెప్పెను. సుందరీదేవి యచ్చటనుండి వెడలిపోయి కుసుమకుమారి చెంత గూర్చొని విచారపడుచుండెను.

కొంతసేపైన పిదప యెవరో తలుపుగొట్టుచు "హరనాథ్" అని పిలచుచుండిరి. సుందరీదేవి తలుపు తెరువగా నొక పురుషుడొక జాబు నామెకొసంగి "అమ్మా! నేను బంకూరానుండి కాలునడకను వచ్చితిని. ఈ జాబు హరనాథునికి తత్క్షణమియ్యవలయునని మా యజమానుడు నా కాజ్ఞాపించెను." అని చెప్పెను.

ఆజాబును చేతబట్టుకొని సుందరీదేవి హరనాథుని యొద్దకు రాగా హరనాథు డామెను జూచి అమ్మా! ఈజాబును నాయన్నకు జూపించుము. తరువాత నేను జూచెద నని చెప్పెను. అప్పుడా జాబు శివనారాయణుని కియ్యబడెను. అది రాధాగోవిందునిచే వ్రాయబడెను. అతడు హరనాథుని ప్రాణస్నేహితుడు హరనాథుని యందలి ప్రేమా

తిశయమున తగిన యుద్యోగముకొరకై రహస్యముగా ఎన్నియో ప్రయత్నములు చేయుచుండెను. తన ప్రయత్నములు ఫలించినపిదప హరనాథునకు తెలియజేయ యుద్దేశించుకొనెను. హరనాథున కిప్పు డొక చక్కని యుద్యోగము కాశ్మీర రాజ్యములో స్థిరపరచి ఈశుభ వార్తను తన బాల్యస్నేహితుడగు హరనాథునకు వెంటనే తెలియ జేయనెంచి ఈజాబును వ్రాసిపంపెను. ఆ జాబుయందిట్లుండెను.

"నాప్రియమిత్రమా! నాడు కలకత్తాలోని కళాశాలను విడుచు నప్పుడు నేను నీబానిసనని జెప్పియుంటిని. కాశ్మీర ప్రభుత్వములో ధర్మార్థశాఖయందు చక్కని యుద్యోగమొకటి నీకు స్థిరపడియున్నది. నీప్రేమఋణమును దీర్చుకొనజాలనుకదా. నాపై దయయుంచి నీవు వెంటనే కాశ్మీర ప్రయాణసంసిద్ధుడవై యిచ్చటకు రాప్రార్థించు చున్నాను. నీరాకకొరకై యెదురు జూచు చున్నాను.

నీ ప్రి య మి త్రు డు,

రాధా గోవింద."

శివనారాయణుడీ జాబునుజూచుకొని కండ్లనిండ నీరు బెట్టుకొని "ఆహా! భగవల్లీల లెంత చిత్రమోకదా! హరనాథుడు సామాన్య నరుడు కాడని స్పష్టమగుచున్నది." అనుచు ఆజాబును పట్టుకొని తన తమ్మునియొద్దకేతెంచి "నాయనా! నీకొకచిత్రమైన జాబువచ్చినది. కాశ్మీరములో నీకొక చక్కని యుద్యోగము స్థిరపడినది. దీనికొరకు నీవేమైన ప్రయత్నించితివా?" అని యడిగెను.

హర:—"మన మెవ్వరికిని తెలియకుండ గోపాలుడే ప్రయత్నించెను."

---

శ్రీ కుసుమహారనాథాయనమః.

# శ్రీహారనాథావతారము

7-వ-అధ్యాయము.

## శ్రీ హారనాథుని కాశ్మీర ప్రయాణము.

శ్రీహారనాథుడు వంగదేశమును వదలి కాశ్మీరమున కేగుచుండెనను వార్త గ్రామమంతయును ప్రాకిపోయెను. ఈ వార్త హారనాథుని స్నేహబృందమున కెంతయో విచారకరముగా నుండెను. అట్టి దూరదేశమునకు పోవలదనివారించుటకై వారందరును హారనాథుని సమీపించిరి. హారనాథుడంత దూరదేశమునకు బోవుట సుందరీదేవికి కూడ అంతగా యిష్టము లేకుండెను. తన ముద్దులతనయుడెట్టి యిడుములకు పాలగునో యను భీతిచే నామె లోలోన విచారపడుచుండెను.

హారనాథుని ప్రాణస్నేహితు లందరును వచ్చి యిట్లు చెప్ప సాగిరి:—

"హారా! ధనము, ఖ్యాతి, ఆత్మోన్నత్యము, మున్నగు నవేవియును నీవు కోరకుండువాడవని మాకు పూర్తిగా తెలియును. అయినను అంతదూరము నీవేగి ఉద్యోగముచేయుట మాకిష్టములేదు. నీవచ్చటకు పోవలదు. మన దేశములోనే నీకు యుద్యోగము

ప్రాప్తించితీరును. నీపాదములంటి వేడుకొనుచున్నాము. నీ ప్రయాణమును మానుకొనుము.'' అని దీనముగా వేడుకొనిరి.

అన్నగారగు శివనారాయణుని భార్యయున్ను, తన జనని సుందరీదేవియున్ను కూడ పోవలదని ఎంతయో వారించిరి. వారిని జూచి శ్రీహరనాథు డిట్లు చెప్పదొడంగెను :—

"ప్రియులారా! జీవులకు స్వాధీనయిచ్ఛలుగాని స్వతంత్రతగాని ప్రాపంచకవిషయములలో ఏమాత్రమును లేదు. జీవులెల్లరును యంత్రమాత్రులే శ్రీకృష్ణుడు సారథివలె జీవులను నడపించుచున్నాడు. ఎచ్చట ఎప్పుడు ఏవిధముగా అవశ్యకమో అప్పుడు ఆవిధముగా ఆతడు జీవులను ప్రేరణజేయును. సంపూర్ణముగా ఏజీవుడు భగవానునికి అర్పణయగునో ఏనిమిషమున తన స్వాధీనేచ్ఛను పూర్తిగా విసర్జించుకొని జీవించునో ఆనిమిషముననే అట్టి జీవునియిచ్ఛ భగవదేచ్ఛలో మిళితమగును. అప్పుడు సత్యమగు "సాధు'' అవస్థ సంప్రాప్తించును. ఆనిమిషమునుండియే ఎట్టి కర్మబాధ్యతయును అట్టి జీవునికి అంటకుండయుండును. నేనిప్పుడు కాశ్మీరము వెళ్లుటకు కారణము భగవదేచ్ఛయే గాని మరియొకటి కాదని యెరుంగుడి. భగవదేచ్ఛ నెరవేరునుగాక!'' అని చెప్పెను.

స్నేహబృందము:—"హరనాథ్ ! నీవు చేయవలసిన పని ఈ ప్రాంత్యములలో కూడనున్నదికాదా. అట్టిచో చుట్టములను, భార్యను, స్నేహితులను వదలి అట్టి దూరదేశమునకు ఏకాకివలెపోవుట భగవదేచ్ఛయేయని యెట్లనుకొనవచ్చును? ఇందరు చుట్టములు, స్నేహితులు మున్నగువారు విలపించుచుండగా నిన్నెచ్చటికో గొంపోవుటలో భగవానుని దయ యేమున్నది? భగవానుడు. నిర్దయుడు'' అనుచు వారు భగవానుని నిందించుచుండిరి.

హర:—ప్రియులారా! అట్లెన్నడును భావింపకుడి. ఇది 'దయ' ఇది "నిర్దయ" అని మీకెట్లు తెలిసినది? మీయొక్క బుద్ధి హద్దుతో కట్టబడియున్నది. మీరు దేనిని నిష్ఠురతగా భావించుచున్నారో అది నిర్దయ గాక పోవచ్చును. మీరు ఇంత చిన్న కొలతపుడకను పట్టుకొని అనంతుడగు భగవానుని యుద్దేశములను కొలచుటకు ప్రయత్నించుట పొరబాటు. అట్లెన్నడును భగవదేచ్ఛను పరిశోధింపకుడి. భగవానుడు దయాసాగరుడు. తాత్కాలికముగా మరియొక విధముగా మనకుతోచినను క్రమేణ ఆతడు మహాదయాళుడని మీకే ఋజువగును.

అంతవరకును శాంత చిత్తముతో భగవానుడు దయామయుండని పూర్తిగా విశ్వసింపుడి. భగవానునిపై విచారణకు కూర్చొనుట చాలతప్పితమసుమా. నా హృదయనాథుడగు శ్రీకృష్ణుడెట్లు చెప్పునో యట్లు చేయుటయేనాపని. ప్రియులారా! కర్మఫల త్యాగమును చేయుటకంటెను విశేషమేమనగా కర్మత్యాగమునే చేయుట. కొందరు జీవులు కర్మలయొక్క కర్తృత్వము తమపై బెట్టుకొని కర్మఫలమును భగవానునికి వదలివేయుదురు. ఇది మధ్యమపక్షము. ఉత్తమపక్షమేమనిన కర్మలనే భగవానునికి వదలిపెట్టి శరీర, మనో, యాత్మలు భగవానుని యాధీనమునబెట్టుట. ఇదియే పూర్ణఆత్మనివేదన యనంబడును. ఇట్లు నీవు చేసినచో నీ మనస్సుతో భగవానుడాలోచించు చుండును. నీశరీరముతో యాతడు పని చేయుచుండును. నీయాత్మతో యాతడు తన యిష్టమువచ్చినట్లు క్రీడించును. ఇట్టి పరమస్థితిని పొందుటయే మీజీవిత లక్ష్యమైయుండవలయును. అట్టిస్థితికై తపింపుడి. స్వల్పమగు శరీర మనోసౌఖ్యములనే వదలలేనప్పుడు సంపూర్ణత్యాగము నెట్లు చేయుటీలగును? నేనిప్పుడు కాశ్మీరమున కెందులకు గొంపోవబడుచున్నవో నాప్రియుడగు శ్రీకృష్ణునికే యెరుక. ఈ ప్రయాణమున

కెట్టి విధమగు ఆటంకములు బెట్టకుడి. భగవానుడు దయామయు డనియు ఆయన యిచ్చు సర్వకాల సర్వావస్థలయందును నెరవేరి తీరు ననియు విశ్వసింపుడని నాతుదిప్రార్థన. మిత్రులారా! తల్లులారా! నన్నింక దీవించి పంపుడి. మీరే నాసర్వస్వము. మీ కన్నీటిధారలు నాకుదుర్భరముగా నుండును. బోలో రాధేగోవిందా!!'' అని జెప్పుచు శ్రీహరనాథ ప్రభువు వారిని విడచెను.

ఈమాటలు వినుచుండిన స్త్రీ పురుషులెల్లరును హరనాథుని యందలి ప్రేమావేశమున వెక్కి వెక్కి యేడ్చుట మొదలు పెట్టిరి. వారు జూపించుచుండిన భావోద్రేకము వర్ణనాతీతము. అనేకుల నేత్ర ములనుండి కన్నీటి ధారలు ప్రవహించు చుండెను.

సుందరీదేవి హరనాథుని సమీపించి "నాయనా! నీ భార్యను కూడ నీవెంట దీసుకొనిపొమ్ము. ఒంటరిగా దూరదేశమున నుండుట నీకెంతయో కష్టముగానుండును'' అని చెప్పెను. అదివిని హరనాథుడు తనతల్లితో "అమ్మా! నా వివాహసమయమందు పల్లకిలో నెక్కుచు నీతో నేమిచెప్పితినో జ్ఞాపకమున్నదా! నీకు పరిచారకములు చేయు టకు సర్వవిధములుగను తగిన పరిచారికను దెచ్చుటకే ఈ పల్లకిలో బోవుచున్నానని చెప్పలేదా. నాతల్లివగు నీకు సర్వవిధములుగను ఉప చారములు చేయుటకే నేను వివాహము చేసుకొంటినిగాని నాకు సేవ జేయుటకుగాదు. నేను పాపాత్ముడనుగాన నిన్ను సేవింపజాలక నిన్ను విడచిపోవుచున్నాను. నాయర్థాంగిని యగు నీకోడలను కూడ నాతో నీవుపంపివేసినచో నాస్థితి మరణముకంటె దుర్భరముగానుండును. కనుక నాకీవరమునిమ్ము. నీకోడలిని నీయొద్దనుంచుకొని సేవజేయించుకొనుము. నన్నింక దీవించిపంపుము'' అని చెప్పి తన జననికి ప్రణమిల్లెను.

తరువాత తన యన్నగారగు శివనారాయణుని ప్రణమిల్లుచుండ గా శివనానారాయణుడు వెనుకకుతిరిగి తన తమ్మునిపై కెత్తి కౌగలించు

కొని వెక్కి వెక్కి యేడ్వ నారంభించెను.'' సోదరా! నీబోటి తమ్ముడుం డగా నాకింకేమితక్కువ? మన వంశమంతయుకూడ నీమూలమున తరింప నున్నది. నాయనా! నిన్నెన్నియో నిష్ఠురోక్తములాడితిని; నీపై నెంతయో కోపించితిని. నీవు సామాన్యనరుడవుకావని నాకిప్పుడు తోచుచున్నది. నాతప్పిదములను క్షమింపుము...'' అనుచు పసిబిడ్డ వలె యేడ్చుచుండెను. అది విని హరనాథుడు తన యన్నగారితో "అన్నా! నన్ను నీవేమియును నిందించలేదు. జీవులెల్లరును ఈప్రపంచ కనాటకరంగమందు నటకులేసుమా. భగవత్ ప్రేరేపణ ననుసరించి ప్రతినటకుడును పనిజేయక తప్పదు. ఆయన ప్రేరేపణ ననుసరించియే మాట్లాడుట, పనిజేయుట మున్నగు కార్యములు నీవు చేయుచుంటివిగాని నీప్రత్యేక వ్యక్తిత్వమేమియు లేదు. నా కొరకై నీవేమియును విచారింపకుము. నన్ను దీవించిపంపుము.'' అని చెప్పి తన యన్నగారి పాదములకు ప్రణమిల్లెను. సుందరీదేవి తన తన యుని కొరకై కొన్ని పూరీలను మూటగట్టి చేతికందిచ్చెను. శ్యామ సుందర విగ్రహమునకు పూజలు సల్పిన తులసి దళమును కుంకుమ మునుకూడ హరనాథునికిచ్చెను.

హరనాథుడు తన యాత్మబంధువులను విడచి కాశ్మీరమునకు ప్రయాణము సాగించెను. వందలకొలది స్త్రీ పురుషులాతనిని విడువ లేక విడచుచుండిరి. ఎవరిముఖమును గాంచినను కన్నీటిధారలే కాన్పించుచుండెను.

పాఠకులారా! శ్రీహరనాథు డింతవరకును తన నిజస్వరూప మును గుప్తముగా కప్పిపుచ్చి ఒక నరునివలెనే సంచరించు చుండెను. తన నిజస్వరూపమును తన యాంతరంగిక భక్తులకు ఇప్పుడు జూపించి వారితో యథేచ్ఛగా యాడుకొన నెంచెను. తన భగవత్తత్వమును ధారాళముగా వ్యక్తము చేయదలంచెను. తన యాంతరంగిక భక్త

లెందరెందరో వివిధ ప్రదేశములందు పుట్టి పెరుగుచున్నారు. వారి నందరను తన వైపున కాకర్షించుకొని తన ప్రేమ నాటకమును ప్రారంభించు సమయ మాసన్నమైనది. అట్టి ప్రత్యక్ష భగవల్లీలలను సోనాముఖిలోనే యుండి ప్రారంభించినచో తన దగ్గరి చుట్టములు తల్లి, అన్నగారు, మున్నగువారు కూడ శ్రీహరనాథుని పూజింప ప్రయత్నింప వచ్చును. ఇట్లు చేసినచో తన యవతార తత్త్వమున కెంతయో భంగము కలుగును. కనుకనే ప్రభు విప్పుడు సోనాముఖి గ్రామమునకు వేలకొలది మైళ్ళ దూరమున నున్న కాశ్మీరము పోవ నెంచెను. అదియును గాక కాశ్మీర ప్రాంతములలోను, హిమాలయ ప్రాంతములలోను, అమరనాథ్ ప్రాంతములలోను లక్షలకొలది సాధువులు యోగులు మున్నగువా రుండుటచే వారందరకును భగవన్నామ మహిమ నుపదేశించి భగవత్ ప్రేమను వారి హృదయములలో జనింప జేయ నిశ్చయించుకొనెను. అట్టి సాధువు లెల్లరును తన యొద్దకు వచ్చుటకు అవకాశమిచ్చు యుద్యోగమునే ప్రభువు స్వీకరించెను. ధర్మార్థ శాఖయందు సూపరింటెండెంటుగా పనిచేయ దలంచు కొనెను. కాశ్మీర ప్రాంతముననున్న సాధుజనులలో లక్షలకొలది మందికి శ్రీహరనాథుని యద్భుత చరిత్రామృతము తెలియును. యోగ మార్గముచే భగవత్ ప్రేమ జనింప నేరదని వారందరకును ప్రభువు వుపదేశించెను. ప్రభు హరనాథుడు కాశ్మీరమున కేగుట కింకను కారణములున్నవి. వాటినన్నిటిని ఇప్పుడువ్రాయు టనవసరము. కాశ్మీరములోని ప్రజలనేకులు శ్రీహరనాథుని భగవత్తత్త్వము కనుగొని ఆయనను "ఠాకూర్" (అనగా భగవంతుడు) అని పిలచుచుండెడి వారు. వంగదేశమంతయును నేడు హరనాథుని "ఠాకూర్ హరనాథ్" (అనగా హరనాథదేవుడు, లేక హరనాథ భగవానుడు) అనియే పిలచుచున్నది. హరనాథుని పటములన్నింటి క్రిందను ఈవిధముగానే

ఆయన నామము ముద్రింపబడి యుండు టనేకులకు తెలిసినవిషయమే.

మరియు శ్రీ హరనాథుడు పనిచేయ నెంచినది కాశ్మీర రాజ్యములోనే. కాశ్మీర మహారాజు పూర్వాచార పరాయణుడగు హైందవుడు. అదియునుగాక శ్రీకృష్ణభక్తుడు. ఆరాజ్యమునందలి ప్రధాన దివానగు జయంతిప్రసాద్ అను నాతడుకూడ శ్రీ కృష్ణ భక్తుడు. ప్రభుహరనాథుడు ఎట్టి విధముగా జయంతి ప్రసాద్ మున్నగు వారిని తన పవిత్రపాదముల యొద్దకు దెచ్చెనో ముందు ముందు వ్రాయబడి యున్నది.

భగవాను డేవృత్తియందున్నట్లు కాన్పించినను లీల మాత్రమే కాని మరియొకటికాదు. ఒకప్పుడు బ్రాహ్మణ వేషధారియై యాచకునివలె నటించెను. మరి యొకప్పుడు పశువులను కాచెను. వేరొకప్పుడు రాజ్యము వదలి అరణ్యములలో సంచరించెను.

శ్రీహరనాథు డుద్యోగమును చేయుచున్న కాలములోనే దేవాస్ మహారాజు తన రాజ్యమునకు ప్రభువును దోడ్కొని పోయి విష్ణు సహస్రనామములతో పూజలు సల్పెను! శ్రీ హరనాథుడు కాశ్మీరములో నుద్యోగిగానున్నప్పుడే కోటీశ్వరులగు తనభక్తు లెంద రెందరో యెంత బ్రతిమాలినను తన యుద్యోగమును విరమించకుండెను. శ్రీహరనాథు డుద్యోగములో నున్నప్పుడే పూరీ, బృందావనము, శాంతిపూర్, బారానగరము మున్నగు ప్రదేశములలో హరనాథ మందిర భవనములు నిర్మింపబడి ఆయన పావన మూర్తులకును పాదుకలుకును నిత్య సేవలు జరుపబడుచుండెను. ఆయన ప్రాకృత వేషభాషలుగాని, సాంఘిక వృత్తిగాని ఆయన పరమభగవత్ స్వరూపముగాని తన నిజభక్తుల దృష్టినుం డెట్లుకప్పి పుచ్చును? ఆతను ఉద్యోగము చేయుట కేవలము లీలార్థమేకాని మరియొకటికాదు. ఆధునికయుగ పరిస్థితులన్నియును తాను కల్పించుకొనెను. భగవానుని పొందుటకై ఉద్యోగము సంసారము

హూణవిద్యాభ్యాసము మున్నగున వేవియును ఆటంకములు కావని సర్వజీవులకును తెలియజేయుటకై ప్రభువుకూడ ఇట్టి పరిస్థితులను తనకు కల్పించుకొనెనే గాని మరియొక అవసరమేదియునుకాదు. శ్రీహరనాథుని బాహ్యజీవితమే భగవత్ గీతాసారమై యున్నది. అయన జీవితమే సర్వవేద వేదాంత సారమయమై యొప్పారుచున్నది. తల్లి యెడలను, కుమారుల యెడలను, అన్నదమ్ముల యెడలను, అధికారుల యెడలను, స్నేహితుల యెడలను, శత్రువుల యెడలను, భగవానునియెడలను, ఒకజీవుడెట్లు సంచరించుకొనవలయునో, ఆధునికయుగ పరిస్థితుల కనుగుణ్యముగా, ప్రభు తన లీలామానుషరూపముతో అట్లు సంచరించుచుండెను. ఇట్లు సంచరించుచున్నను తన నిజభక్తుల దృష్టినుండి తన భగవత్ స్వరూపమును దాచలేకపోయెను. భగవానుడెంతనటనాగ్రేసరుడైనను తన నిజభక్తుల సమక్షమున పూర్తిగా ఓడిపోవును కదా? తర్కమీమాంసములచే కనుగొనలేని భగవంతుని సులభముగా ప్రేమచే కనుగొనవచ్చును. బృందావన గోపాలునిజూచి ప్రక్కవీధిలో యజ్ఞము చేయుచున్న మహా పండితులగు బ్రాహ్మణోత్తము లెందరెందరో "ఈతడొక శూద్రబాలుడు. ఈయజ్ఞప్రసాదము నీతనికియ్యకూడదు." అనిచెప్పి గోపబృందమును పంపివేసిరి! ఎట్టి శాస్త్రజ్ఞానమును లేనిగోపికలు తమ ప్రేమచే యాతనిని సులభముగా తెలుసుకొని సిగ్గు, లజ్జ, కులము మున్నగు వానిని విసర్జించి గోపాలుని వెంటాడి సులభముగా తరించిరి.

కనుక భగవానుడే వేషముతో వచ్చినను ఏనామముతో పిలువబడుచున్నను ఎట్టి సాంఘిక పరిస్థితులచే నావరింపబడినను ఎట్టి భాష మాట్లాడుచున్నను తన నిజభక్తులాతనిని వెంటనే గుర్తింపగల్గుదురు. వారి హృదయములేచాటును. నిర్హేతుక ప్రేమావేశమును హృదయములలో జనింపజేయగల్గువాడే గోలోకనాథుడగు శ్రీకృష్ణుడు. తదితరు

లెవ్వరికిని నట్టిశక్తి లేదు. ఒకరివలన నుపకారము పొందినప్పుడు మనః కాతనియందు కల్గు భావమునకు కృతజ్ఞత యనంబడును కాని ప్రేమ యనబడదు. ఎట్టి ఉపకారములను కాని పొందనిదే నిర్హేతుకము గా యాయనను ప్రేమించునట్లు చేయుట ప్రేమనాథుడగు శ్రీహర నాథుని శక్తియైయున్నది! శ్రీహరనాథుడు కాశ్మీరమున ప్రవేసించి నప్పటినుండియు తన ప్రేమనాటకమును విజృంభించెనని చెప్పితిమి. శ్రీహర నాథునినామమును వినినంతమాత్రముననే మిమన్‌సింగు సబ్ జడ్జీగారి కుమారుడగు మణీకాంతుడు తన వివాహమును మానుకొని తన యాస్తిని తలిదండ్రులను వదలి జేబులో నొక కాసైనను లేకపోయి నను శ్రీహరనాథుని దర్శించుటకై చని ప్రేమనాథుని పాదములపై బడెను! అంతవరకును ఆతని హృదయమునకు శాంతి కలుగకుండెను! అట్లే సుధిరంజన్‌సేటు అను పోలీసుఇన్స్పెక్టరు ప్రభునామమును విని ఆయన పవిత్ర ఛాయాపటమును జూచి వెక్కి వెక్కి యేడువ నారంభించి వెంటనే శెలవుతీసుకొని వెళ్లి ప్రభు పాదములపై బడెను! ప్రభువెంతయో బలవంతము చేయగా తన పోలీసు యుద్యోగమును విరమించకుండుటకై యొప్పుకొనెను. అట్లే విఠల్‌దాస్ మెహతా అను నాతడు బొంబాయినుండి ప్రేమవిరహమున ప్రభువును దర్శించుటకై తన భార్యయొక్క వస్తువు లను అమ్మివేసి బయలుదేరెను! ఇట్లనేకులు నిర్హేతుకముగా ప్రభు నామమును వినినంతనే ఆయనవైపునకు బలవత్తరమైన ప్రేమచే నాక ర్షింపబడిరి. ఆకర్షింపబడుచున్నారు. శ్రీహరనాథుని ప్రేమించుటకు కారణ మేమనియడిగినచో వేలకువేలుభక్తులు నేడిట్లు చెప్పుచున్నారు. "శ్రీహర నాథుని ప్రేమించుటకు కారణముమాకే తెలియదు. సహజముగా మా హృదయమాయనవైపునకుబోవుచుండును. ఆయన దివ్యనామము వినిన చోపలనోకాని మా హృదయము ద్రవీభూతమగును." మఱికొందరిట్లు జెప్పుచున్నారు. "భాగవత మంతయును చదివినను కృష్ణునియందు

మాకు తాత్కాలిక భక్తియుద్రేకము దప్ప గాఢమగు యనురాగము జనించలేదు. అయితే హరనాథునియందు మాకు గాఢమగు అనురాగమెట్లుజనించినదో మాకే తెలియదు. మాయుచ్ఛ్వాసనిశ్వాసములెంత యప్రయత్నముగా యున్నవో మాహృదయము లంతయప్రయత్నముగా ఆయనవైపున కాకర్షింప బడుచున్నవి" అని చెప్పుచున్నారు.

1936 సం॥రం ప్రారంభమున గంజాముజిల్లా, లక్ష్మీనరసింహపేట లోని తాళాబత్తుల రామమూర్తి అను నాతడు శ్రీహరనాథ భజనకువచ్చి తనలాంధరును స్వామిపటము వద్దకు తీసుకొనివచ్చి "నీవేనా నాయనా హరనాథుడవు" అని పలుకరించుచు చివర యక్షరము పూర్తి కాకుండగనే రోదన మారంభించి మూడుదినము లహోరాత్రములు యేడ్చుచుండెను. ఎటుచూచినను ఎవరు పలుకరించినను "హరనాథ్ హరనాథ్" అనుచు వెక్కి వెక్కి యేడ్చుటయేగాని మారు మాట పలుకలేకుండెను. నాల్గవ దినమున శ్రీ హరనాథనామ ఏకాహము ప్రారంభించగా నాతనికి హృదయశాంతి కలిగెను.

ప్రభు కాలములో యనేకులకిట్లు అకారణమగు భావోద్రేకము, ఆయనను చూచినంత మాత్రముననే, కలుగుచు క్రమముగా నది గాఢమగు అనురాగముగా పరిణమించి సర్వసంగ పరిత్యాగస్థితికి తీసుకొని వచ్చుచుండెడిది. శ్రీహరనాథుని దివ్యప్రేమ, మురళీనాదము నందలి శక్తి వర్ణనాతీతము-ఊహాతీతము-తర్కాతీతము.

మిడ్నాపురములోని తమాలినిదేవి అను భక్తురాలు ప్రభు నామమును స్మరించుచు నిద్రయనునదిలేక సుమారు 20 దినములట్లే యుండెను. నిద్రకై ఆమె కెన్ని మందు లిచ్చినను లిప్తకాలమైనను ఆమెకు నిద్ర పట్టకుండెను! హరనాథ నామమందలి శక్తి వర్ణనాతీతము కదా.

పాఠకులారా! శ్రీ హరనాథుని కాశ్మీర జీవితమును తెలుసుకొనెదము. ఆయన ప్రదర్శించు దివ్యప్రేమ నాటకమును జూచుటకై పోయెదమురండు. స్థూలదృష్టిచే గమనించిన వారికి ఈ ప్రేమనాటక మర్థరహితముగా నుండును - మీహృదయ నేత్రములను తెరచుకొని రండు.

బోలో. ప్రేమలోలునకుజాయ్.

కుసుమవల్లభునకుజాయ్.




శ్రీ కుసుమ-హరనాథ ముద్రాక్షరశాల, చిత్తూరు.

శ్రీ హరనాథుని యాంతర్యమును తెలుసుకొనగోరు వారీ క్రింది గ్రంథములను తప్పక చదువవలయును.



ఇంగ్లీషు గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| గౌరాంగ లీలామృతం .... .... | 1 | 4 | 0 |
| శ్రీ హరనాథ లీలామృతం .... .... | 1 | 4 | 0 |
| పాగల్ హరనాథ్ లేఖలు. .... .... | 1 | 0 | 0 |
| ఉపదేశామృతము .... .... | 1 | 0 | 0 |
| ఠాకూరు హరనాథ్ .... .... | 0 | 2 | 0 |

తెలుగు గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| ఉపదేశామృతం 2 భాగములు .... .... | 0 | 8 | 0 |
| శ్రీ హరనాథ స్మృతి .... .... | 0 | 5 | 0 |
| శ్రీ హరనాథావతారము .... .... | 0 | 5 | 0 |
| నా ప్రభువు .... .... | 0 | 4 | 0 |
| శ్రీ హరనాథ లీల .... .... | 0 | 2 | 0 |
| శ్రీ హరనాథ తత్త్వము .... .... | 0 | 2 | 0 |
| శ్రీ హరనాథస్తోత్రరత్నావళి .... .... | 0 | 2 | 0 |
| పూజావిధానం .... .... | 0 | 0 | 6 |
| 8 రకముల సంకీర్తన పుస్తకములు ఒక్కొక్కటి | 0 | 0 | 6 |

శ్రీ కుసుమ హరనాథుల పటములు.

| | | | |
|---|---|---|---|
| పద్మాసనం ట్రియికలరు సింగిల్ బాబా (15 × 12) | 0 | 12 | 6 |
| 5 రకముల కార్డులుగల సెట్టు .... .... | 0 | 9 | 0 |
| కమలం ట్రియికలరు (12 × 8) .... | 0 | 8 | 6 |

| | | | |
|---|---|---|---|
| అమ్మా బాబు, చెట్టుక్రిందకూర్చునియున్న విట్రయికలరు | 0 | 6 | 6 |
| ప్రభుహరనాథ్ తేజోమూర్తి .... .... | 0 | 6 | 0 |
| శ్రీ కుసుమహరకుంజ్ .... .... | 0 | 4 | 0 |
| శేషశాయి పటము పెద్దది .... .... | 0 | 4 | 0 |
| ,, ,, చిన్నది .... .... | 0 | 1 | 6 |
| కమలం క్యాబినేట్ సైజు .... .... | 0 | 1 | 0 |
| శ్రీ కుసుమహరనామ పటము .... .... | 0 | 0 | 6 |

**శ్రీ కుసుమహాథుల లాకెట్లు.**

| | | | |
|---|---|---|---|
| సింగిల్ .... .... | 0 | 5 | 0 |
| జూగల్ .... .... | 0 | 5 | 0 |

వలయువారు, యీ క్రింది విలాసమునకు వ్రాసి తెప్పించుకొనవచ్చును:—

శ్రీయుత, యస్. సయదన్ననాయుడుగారు,
శ్రీ కుసుమహరనాథ కేంద్రసంఘము,
నెం. 65-B-1. యూనిట్ నెం. 2.
న్యూసెటల్‌మెంటు, ఖర్గపురము, (B. N. Ry.)



